అపరాధ పరిశోధన అనుబంధం—91

# వెలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వాడేవీడు
రచన : వాణిశ్రీ

## నిరపరాధి
రచన : వసుంధర

## మృత్యు క్షణాలు
రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

## ఇంటిదొంగ
రచన : టెంపోరావ్

రక్తం త్రాగే పిశాచం - మొదటి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—91
జూలై, 1981
వెల: రు. 4-50
ఏడాది చందా 60 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు



కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# వాడే వీడు

## వాణిశ్రీ

కర్ణాటక మ్యూజిక్ హౌస్‌లో నుంచి 'అంకితం....నీకు అంకితం' అనేపాట పెద్ద సౌండ్‌తో వస్తోంది.

పేవ్‌మెంట్ మీద నడుస్తున్న అమర్‌నాథ్ అప్రయత్నంగా తలెత్తి చూశాడు షాపులోకి. అతనికి చటుక్కున జ్ఞాపకం వచ్చింది భార్య చెప్పిన సంగతి. చాలా రోజుల్నుంచి చెప్తూనే వుంది ఘంటసాల పాడిన భగవద్గీత రికార్డు తెమ్మని. కాని బజారుకు వచ్చినప్పుడు జ్ఞాపకం వుండటంలేదు.

నెమ్మదిగా మెట్లెక్కి షాపులోకి వెళ్ళాడు. సేల్స్‌మాన్‌లు బిజీగా వున్నారు. షాపులో డెకరేట్ చేసిన రేడియో, టేప్‌రికార్డర్ సెట్‌లు గాయకుల బొమ్మలున్న పోస్టర్లు చూస్తూ నిల్చున్నాడు.

"తాతగారూ! ఏం కావాలి?" ఒక సేల్స్ గరల్ అడిగింది.

అమరనాథ్ చెప్పాడు.

సేల్స్ గరల్ లోపలకు వెళ్ళింది.

కౌంటర్ దగ్గర ఒక యువకుడు గట్టిగా మాట్లాడు తున్నాడు. "రేటు పెరిగిన సంగతి మాకెలా తెలు స్తుంది?"

"మమ్మల్ని అడిగితే చెప్తాం కదా?"

"అలా కాదు. మీరు రేట్లు డిస్ప్లే చెయ్యాలి."

"రేట్లు రోజురోజుకీ పెరుగుతున్నాయ్ సార్! ఎన్నని డిస్ప్లే చెయ్యమంటారు సార్!" షాపు అతను వినయంగా సమాధానం చెప్తున్నాడు.

"పోనీలేరా! రేట్లు పెరిగితే వాళ్ళు మాత్రం ఏం చేస్తారు?" అతని ఫ్రెండ్స్ సర్ది చెప్తున్నారు.

"త్వరగా కానివ్వరా మనకి టైమ్ లేదు."

అమరనాథ్ ఆ యువకుడివైపు చూశాడు. అతన్ని ఎక్కడో చూసినట్లయింది. జ్ఞాపకపు పొరలలో వెదుకు తున్నాడు ఎక్కడ చూశానా? అని.

అతను పొడుగ్గా వున్నాడు. పువ్వులు ఎంబ్రాయిడరీ చేసిన గ్లాస్కో లాల్చీ, పైజామా వేసుకున్నాడు. ముఖం గుండ్రంగా వుంది. మీసాలు లేవు. కళ్ళు పెద్దవి. ఆడపిల్ల వేషం వేస్తే సరిపోయేటట్లు వుంది అతని ముఖ వర్ఛస్సు. ఇతన్ని ఎక్కడో చూశాడు తను. ఎక్కడ?

ఆ యువకుడి వెంట నలుగురు కుర్రాళ్ళు వున్నారు. బిల్లు చెల్లించేసి షాపులోంచి వెళ్ళిపోతున్నారు. అమరనాథ్ కళ్ళు అతన్నే చూస్తున్నాయి.

అమరనాథ్‌కి మెరుపు మెరిసినట్లుగా గుర్తొచ్చింది రెండేళ్ళ క్రితం జరిగిన సంఘటన. "యస్. వాడే వీడు" అనుకున్నాడు.

'దొంగ వెధవ' కసిగా పళ్ళుకొరికాడు.

'ఎన్నాళ్ళికి దొరికాడు?'

'ఏం చెయ్యాలి ఇప్పుడు?'

అమరనాథ్ మనసులో అలజడి బయల్దేరింది. 'ఏం చెయ్యాలి ఇప్పుడు?' వుద్రేకంతో మనిషి వూగిపోతున్నాడు.

'వాడిని పట్టుకుని పోలీసులకు అప్పజెప్తే?'

కాని యెలా? తను వాడిని పట్టుకుంటే లాభంలేదు. వాళ్ళు మొత్తం నలుగురు వున్నారు. తనను దూరంగా విసిరేసి పారిపోతారు. లేదా తనొక పిచ్చివాడిక్రింద జమకట్టి నవ్వులపాలు చేస్తారు. వాళ్ళు ఎక్కడుంటారో తను కనిపెట్టి ఆ తర్వాత పోలీసులకు రిపోర్టు చెయ్యాలి. అప్పుడు దొరికిపోతారు. ఇక తప్పించుకోలేడు.

అమరనాథ్ షాపులోనుంచి రాబోతుంటే సేల్స్ గరల్ రికార్డులు పట్టుకొచ్చి "తాతగారూ!" అంది.

"మళ్ళీ వస్తా....!" అంటూ వేగంగా బైటకొచ్చాడు అమరనాథ్.

సేల్స్ గరల్ విస్తుపోతూ చూసింది అమరనాథ్ని 'మెంటల్ కేసేమో' అనుకుంటూ.

వాళ్ళు నలుగురూ కబుర్లు చెప్పుకుంటూ నెమ్మదిగా నడుస్తున్నారు. అమరనాథ్ వాళ్ళని వెంబడించాడు. కొంతదూరం వెళ్ళాక బాంబే హోటల్లోకి వెళ్ళారు. అమరనాథ్ కూడా వెళ్ళాడు. వాళ్ళ టేబుల్ దగ్గరలోనే కూర్చున్నాడు. బేరర్ వచ్చాడు. సమోసాలు తెమ్మన్నాడు. తర్వాత టీ తాగాడు. వాళ్ళు ఎంతకీ లేవడంలేదు. అమరనాథ్ సిగిరెట్ వెలిగించాడు.

కాసేపటికి వాళ్ళు లేచారు. అమరనాథ్ వాళ్ళని అనుసరించాడు.

మెయిన్ రోడ్ లోనుంచి చీలి ఒక సందులోకి వెళ్ళాక ఒక పాతకాలపు మేడలోకి వెళ్ళారు. దానిమీద 'లక్ష్మీ మేన్షన్' అని సిమెంట్ తో చెక్కిన అక్షరాలు కని పిస్తున్నాయి. వాళ్ళు మేడపైకి వెళ్ళారు.

మేడపైన అన్నీ రూమ్లు వున్నాయి. వాటికి నెంబర్లు వేసివున్నాయి. చాలావాటికి తాళాలు వేసివున్నాయి. అతను తొమ్మిదో నెంబరు గది తాళం తీసి లోపలకు వెళ్ళాడు.

అమరనాథ్ గిర్రున వెనక్కి తిరిగి ఆటో యెక్కి ఇంటికి వెళ్ళాడు.

అప్పటికి బాగా చీకటిపడింది.

"ఏమిటి హడావుడిగా వున్నారు?" అంది అమర నాథ్ భార్య రుక్మిణి.

ఈవెనింగ్ వాక్ అంటూ బజార్లు తిరిగి భోజనం వేళకి వచ్చేమనిషి కొంపలు మునిగిపోయినట్లు ఆటోలో యెందుకు వచ్చాడో ఆమెకు అర్థంకాలేదు.

అమరనాథ్ భార్యకు సమాధానం చెప్పకుండా సరాసరి టెలిఫోన్ దగ్గరికి వెళ్ళాడు.

"పోలీస్ కంట్రోల్ రూమ్ ప్లీజ్."

సమధానం వచ్చింది అవతలినుంచి.

"నేను అమరనాథ్, రిటైర్డు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ని మాట్లాడుతున్నాను. మీరెవరు?"

"ఇన్స్పెక్టర్ అజీజ్."

"గుడీవినింగ్ ఇన్స్పెక్టర్ అజీజ్."

"గుడ్ ఈవెనింగ్. ఏంకావాలి చెప్పండి?"

"రెండు సంవత్సరాలక్రితం నన్ను ఒక దొంగలముఠా దోచుకుంది. గుంటూరు హైదరాబాద్ రూట్ లో

మా చెర్ల దాటాక."

"అవును గుర్తుంది."

"ఆ ముఠాలో ఒక దొంగని నేను గుర్తుపట్టాను. ఇప్పుడు అతను యెక్కడ వున్నాడో చూసి వచ్చాను. లక్ష్మీ మేన్షన్‌లో రూమ్ నెంబర్ నైన్‌లో వున్నాడు."

"లక్ష్మీ మేన్షన్ యెక్కడుంది? లొకేషన్ చెప్పండి?"

"యమ్.జి. రోడ్డులో కొంతదూరం పోయాక ఒక గల్లీలో వుంది. నేను చూపిస్తాను."

"మీరు యెక్కడ వుంటారు?"

"నేను ఆటోలో మీ దగ్గరికి రమ్మంటారా? లేదా మీరు మా ఇంటికి వచ్చినా సరే."

"మీ అడ్రెస్ చెప్పండి."

అమరనాథ్ చెప్పాడు.

"మీరు వెయిట్ చేస్తూ వుండండి. నేను మీ దగ్గరికి వస్తాను."

"థాంక్స్" రిసీవర్ పెట్టేశాడు అమరనాథ్.

ఇంతలో రుక్మిణి వచ్చింది.

"ఏమిటి అలా వున్నారు? ఏం జరిగింది? ఎవరికి ఫోన్ చేశారు?"

ప్రశ్నల వర్షం కురిపించింది.

"మనల్ని దోచుకున్న వాళ్ళలో ఒకడు కనిపించాడు. పోలీసులకి ఫోన్ చేశాను" అన్నాడు.

"నిజమే?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"అవును. నీ నగలు ఇమ్మని కత్తితీసి పొడవబోయాడు గుర్తుందా? పొడుగ్గా వున్నాడు. వాడికే నువ్వు నగలు గూడా ఇచ్చావు" అన్నాడు.

"ఏమోనండి సరిగ్గా జ్ఞాపకం రావడంలేదు."

"వాడిని చూస్తే మాత్రం గుర్తుపడతావు. నేను కూడా మొదట్లో గుర్తుపట్టలేకపోయాను. ఎక్కడో చూశానే అనిపించింది. తర్వాత జ్ఞాపకం వచ్చింది వాడే వీడని."

"వాడు ఒక్కడే వున్నాడా? మరి మిగిలినవాళ్ళు?"

"ఎక్కడో వుండివుంటారు. వీడిని పట్టుకొని నాలుగు తగలనిస్తే అన్నీ వాడే చెప్తాడు."

"అయితే మన నగలు దొరుకుతాయంటారా?" ఆశగా అడిగింది రుక్మిణి.

"ఏమో చూడాలి."

"నగలు దొరికితే ఆ ఏడుకొండలవాడి దయవలన. కొండకి వెళ్ళి ముడుపు తీర్చుకుంటాను" అంది రుక్మిణి.

"నగలు దొరికినా దొరక్కపోయినా వాళ్ళని జైల్లో వేయిస్తేగాని నాకు మనశ్శాంతి వుండదు" అన్నాడు అమరనాథ్.

పోలీస్ జీప్ హారన్ వినిపించింది. హడావుడిగా వెళ్ళాడు అమరనాథ్.

జీపులో కూర్చున్న ఇన్స్పెక్టర్ అజీజ్ విష్ చేశాడు.

"మీరేగా అమరనాథ్" అన్నాడు ఇన్స్పెక్టర్.

తలవూపాడు.

"ప్లీజ్ గెటిన్" అన్నాడు ఇనస్పెక్టర్.

అమరనాథ్ జీపులో కూర్చున్నాడు. అతను దారి చూపిస్తుంటే డ్రైవర్ జీప్ పోనిస్తున్నాడు.

లక్ష్మీమేనన్ ముందు జీప్ ఆగింది.

అమరనాథ్ మెట్లెక్కి మేడపైకి వెళ్ళాడు.

తొమ్మిదో నెంబర్ గది తాళం వేసివుంది.

నిర్వీరపోయాడు అమరనాథ్.

"ఈ గదిలోనే వుంటే చూశాను ఇనస్పెక్టర్" అన్నాడు అమరనాథ్.

"మరి ఎక్కడున్నారు? లాక్ చేసి వుందిగదా?"

"ఏమోమరి? ఇంతలోనే ఏమయ్యారు? గంట కూడా కాలేదే?" అన్నాడు.

దాదాపు అన్నిరూములూ ఖాళీగానే వున్నాయి. ఆ పైన చివర్లో పదమూడో నెంబరు గదిలో లైటు వెలుగుతోంది.

అమరనాథ్ ఆ గదివైపు వెళ్ళాడు.

లోపల ఒక యువకుడు చాపమీద పడుకునివున్నాడు. ఏదో పత్రిక చదువుకుంటున్నాడు.

"మిష్టర్ .... మిష్టర్ ...."

ఆ యువకుడు లేచి వచ్చాడు అమరనాథ్‌ని చూసి.

"తొమ్మిదో నెంబరు గదిలో కుర్రాళ్ళు యెక్కడికెళ్ళారు?"

"వెళ్ళిపోయారు" అన్నాడు అతను అమరనాథ్‌ని పోలీసువాళ్ళనీ చూసి ఆశ్చర్యపోతూ.

"ఎక్కడికి?"

"ఎగ్జామ్స్ అయిపోయాయిగా. నిన్ననే పూర్తయ్యాయి."

"అయితే?"

"వాళ్ళ వూరెళ్ళిపోయారు?"

"వాళ్ళు స్టూడెంట్సా?"

"అవును. ఏం జరిగింది? ఏదైనా గొడవ చేశారా?"

"దొంగతనం చేశారు" అన్నాడు అమరనాథ్.

"ఏమిటీ వాళ్ళు దొంగతనం చేశారా?" ఆశ్చర్యంగా

ప్రశ్నించాడు అతను.

"మిష్టర్! ఆ రూమ్‌లో వాళ్ళు నీకు తెలుసా?" ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

"తెలుసు."

"ఏం చదువుతున్నారు?"

"బి.కామ్."

"ఆ రూంమ్‌లో మొత్తం ఎంతమంది వున్నారు?"

"నలుగురు."

"వాళ్ళ అడ్రసులు తెలుసా?"

"తెలీదు."

"వాళ్ళు ఎంత సేపు అయింది వెళ్ళిపోయి?"

"పావుగంట అయివుంటుంది?"

"రైలుకి వెళ్ళారా? బస్సుకా?"

"ఏమో తెలీదు."

"నువ్వేం చదువుతున్నావు?"

"నేను చదవడంలేదు. ఫిలిమ్ రిప్రజెంటెటివ్ గా పని చేస్తున్నాను."

"ఎక్కడ?"

"అనార్కలీ కంపెనీలో."

"నీ పేరేమిటి?"

"యమ్. మురళీ మోహన్."

"ఆ రూమ్‌లో వాళ్ళ పేర్లు తెలుసా?"

"నేను ఎక్కువగా రూమ్‌లో వుండను. అందరి పేర్లూ నాకు తెలీదు. చక్రవర్తి మాత్రం తెలుసు."

"ఎలా వుంటాడు అతను?"

"పొట్టిగా నల్లగా వుంటాడు."

ఇనస్పెక్టర్ అజీజ్ ప్రశ్నార్థకంగా అమరనాథ్

ముఖంలోకి చూశాడు ఏం చేద్దామన్నట్లుగా.

"నేను మీకు శ్రమయిచ్చాను సారీ!" అన్నాడు అమరనాథ్.

"దట్సాల్ రైట్. మీరు ఎంతసేపైంది వాళ్ళని చూసి" అన్నాడు ఇనస్పెక్టర్.

"గంట కావచ్చు."

"వాళ్ళని చూసిన వెంటనే మాకు ఎందుకు ఫోన్ చెయ్యలేదు మీరు?"

"నేను ఫోన్ చేసే లోపల వాళ్ళు దాటిపోతే కష్టం కదా!"

"అదికాదు. మీరు ఇంట్లో వున్నారు గదా! వెంటనే స్టేషన్‌కి రాకుండా ఇంటికి ఎందుకు వెళ్ళారు?"

"ఇదే ఇనస్పెక్టర్ నేను చేసిన పొరపాటు. సరాసరి మీ దగ్గరికి వచ్చివుంటే వెంటనే దొరికిపోయేవాళ్ళు" అన్నాడు అమరనాథ్ విచారంగా.

"వీళ్ళు స్టూడెంట్స్ అని యితను చెప్తున్నాడు. మీరేమో దోపిడీ దొంగలని అంటున్నారు. మీరు సరిగా చూశారా? పొరబడ్డారేమో?" అన్నాడు ఇనస్పెక్టర్.

"లేదు. ఇనస్పెక్టర్ నాకు బాగా గుర్తు. వాడే. ఇప్పటికైనా మనం వెతికితే తప్పకుండా దొరుకుతాడు."

"ఎక్కడ దొరుకుతాడంటారు?"

"రైల్వే స్టేండ్‌లోగాని, బస్ స్టేషన్‌లోగాని వుంటాడు పదండి."

"సారీ అమరనాథ్ గారూ! అసలు రిటెన్ కంప్లెయింట్ లేనిదే మేము బయల్దేరగూడదు. అదీకాక మీరు ఎవరిని చూసి ఎవరనుకుంటున్నారోనని నాకు అనుమానంగా వుంది. క్లోజయిపోయిన కేసుని పట్టుకుని తిరిగితే

ఇక మా పనులన్నీ ఏం కావాలి."

అమరనాథ్‌కి ఇనస్పెక్టర్ మాటలు వింటుంటే బాధ కలిగింది.

"మీకంత నమ్మకం వుంటే ఆటోలో వెళ్ళి వెతకండి. అక్కడ ఆ దొంగలు వుంటే ఫోన్ చెయ్యండి. వెంటనే వస్తాం" అన్నా ఇనస్పెక్టర్.

అమరనాథ్ వుక్రోషంతో అలాగే అన్నాడు. రెండు గంటలసేపు రైల్వేస్టేషను, బస్ స్టేషన్ అంతా తిరిగి తిరిగి ఇంటికి వచ్చాడు ముఖం వ్రేలాడేసుకుని.

## 2

ఆ రాత్రి అమరనాథ్‌కి నిద్రపట్టలేదు. లేచి అటూ ఇటూ పచార్లు చేశాడు.

గతం జ్ఞాపకం వస్తోంది.

ఎంత అవమానం జరిగింది ఆ రోజు!

అమరనాథ్ కొడుకు పెళ్ళి గుంటూరులో జరిగింది. అతని కొడుకు బి.ఇ. చదివి ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసయ్యాడు. జూనియర్ ఇంజనీరుగా చేస్తున్నాడు.

గుంటూరులో రెండు అంబాసిడర్ కార్లలో సాయంకాలం ఆరుగంటలకి బయల్దేరారు కోడల్ని తీసుకుని. రెండు కార్లలోనూ ఎక్కువ ఆడవాళ్ళే వున్నారు.

పెళ్ళివాళ్ళు భోజనంచేసి బయల్దేరమన్నా వినిపించుకోలేదు. హైదరాబాద్ చేరేవరకు ఆలస్యమైపోతుందని హడావుడిగా అందర్నీ బయల్దేరదీశాడు అమరనాథ్. ఆయనగారి తత్వమే అంత. తను పట్టిన కుందేలికి మూడే కాళ్ళు అనే స్వభావం. అందుకే అంతా ఎదురు చెప్పకుండా బయల్దేరారు.

గురజాల వచ్చేసరికి అందరికీ కడుపుల్లో యెలుకలు

మూరాయి. ఆకలి దంచుతోంది. కాని యెవరూ మాట్లాడ లేదు.

మాచెర్ల వెళ్ళాక అందరికీ హోటల్లో భోజనాలు పెట్టిచాడు అమరనాథ్.

మళ్ళీ అంతా బయల్దేరేటప్పటికి పదకొండు దాటింది. కొంత సేపటికి కార్లు కొండల్లోకి ప్రవేశించాయి. ఆకాశం మబ్బుపట్టి వుంది. వెన్నెల లేదు. చీకటి.

ఒక మలుపులో పెద్ద చెట్టుకొమ్మ అడ్డం పెట్టివుంది. డ్రైవర్ సడన్ బ్రేక్ వేశాడు. వెనుక నుంచి వచ్చేకారు ముందు కారును గుద్దుకున్నంత పనయింది.

కార్లు ఆగగానే ఆరుగురు కుర్రవాళ్ళు కత్తులు తీసు కుని బయటకు వచ్చారు చెట్ల గుబురుల్లో నుంచి. డ్రైవ ర్లని బెదిరించి రెండు కార్లను రోడ్డునుంచి ప్రక్కకు తీసుకెళ్ళారు. కార్లు చెట్లు గుబురుల్లోకి వెళ్ళాయి.

అప్పుడు ఒకడు బ్యాటరీ లైటు వేసి అందర్నీ కారు దిగమన్నాడు. చుట్టూ వాళ్ళు నిల్చున్నారు కత్తులు పట్టుకుని.

ఆడవాళ్ళు భయంతో వణికి చస్తున్నారు. అందరి వంటిమీద నగలున్నాయి. సూట్ కేసులో పది వేలు క్యాష్ కూడా వుంది.

అమరనాథ్ కి బి. పీ. పెరిగిపోతోంది. కానీ ఏం చేసేటట్లు? ఆ కుర్రాళ్ళందరికీ పాతికేళ్ళలోపే వుంటుంది వయసు. అంత లేతగా వున్నాయి ముఖాలు.

పొడుగ్గా వున్న కుర్రాడు కత్తిపట్టుకుని "అమ్మలారా అందరూ తియ్యండి నగలు. తీసి ఈ సంచీలో వేసి పుణ్యం కట్టుకోండి. లేకపోతే మేం మిమ్మల్ని బల వంతంగా కత్తితో పొడిచి చంపాల్సి వస్తుంది. ఆ

తర్వాత మీ నగలు ఎటూ మా సంచిలోకి వస్తాయి. అనవసరంగా ఆలస్యం చెయ్యకండి" అన్నాడు.

"ఊఁ....తియ్యండి! బ్రతికుంటే మీ మొగుళ్ళు మళ్ళీ చేయిస్తారు నగలు. బాధపడకండి అమ్మలారా! అమ్మో! పెళ్ళికూతురా! తియ్యి తల్లీ సరికొత్త నెక్లెస్. ముక్కు చెవులవి వుంచుకో ఫర్వాలేదు. మరీ బోసిగా వుంటే బాగుండదు" అంటూ అతను పకపక నవ్వాడు.

ఆలస్యం చేస్తే ఆ క్రూరాళ్ళు ఆడవాళ్ళని ఇంకా అవమానకరమైనవి చేస్తే!

ఆ వూహే భరించలేకపోయాడు అమరనాథ్.

"నగలు తీసి ఇవ్వండి. భయపడకండి" అని అందరికీ చెప్పాడు అమరనాథ్.

ఆడవాళ్ళ దగ్గర నగలు, కారులో విలువైన సామాను, సూట్ కేసులో క్యాష్ తీసుకుని కారు టైర్లు కోసిపారేశాడు.

"ఇక దయచెయ్యండి! ఫర్లాంగు దూరంలో ఈ ముళ్ళలో నడిచి రోడ్డు చేరుకోండి. తారురోడ్డు వస్తుంది. ఆ రోడ్డుమీద ఈ రాత్రికి పడుకోండి హాయిగా!"

"బ్రదరూ! పెళ్ళికొడుకూ! నువ్వుమాత్రం ఏ పొదలోనో దూరిపోయి కార్యం చేసుకో, డోంట్ వేస్ట్ టైమ్!"

వాళ్ళు ఇష్టం వచ్చినట్లు వాగుతూ మాయమైపోయారు చీకట్లో!

అతికష్టం మీద ఏడుస్తూ, మూలుగుతుంటూ రోడ్డు మీదకు చేరుకున్నారు. ఒక లారీ పోతుంటే ఆపి సంగతంతా చెప్పుకున్నారు. వీళ్ళ ఏడుపు మొఖాలు చూసి అతను జాలిపడి ఎక్కించుకుని మాచెర్ల వరకూ తీసు

వెళ్ళాడు. అక్కడ పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు చేసి గుంటూరులో వియ్యంకుడికి ఫోన్ చేశాడు.

తెల్లవారిన తర్వాత రెండు కార్లలో వియ్యంకుడు వచ్చి అందర్నీ హైద్రాబాద్ చేర్చాడు.

రెండేళ్ళు గడిచింది.

దోపిడీ చేసిన దొంగలు దొరకలేదు.

అమరనాథ్ సంవత్సరం క్రితం రిటైరైపోయాడు సర్వీసు నుంచి.

ఏమీ పనిలేకపోవడంతో ఆ సంగతులే జ్ఞాపకం వస్తూ వుంటాయి.

దోపిడీ దొంగలను పోలీసులు యెందుకు పట్టుకోలేక పోయారో అర్థంకావడం లేదు అమరనాథ్‌కి.

'చిక్కినట్టే చిక్కి జారిపోయాడు రాస్కెల్' అను కున్నాడు.

'వాడే ఆ రోజు బ్యాటరీలైటు అందరికీ వేసి నగలు సంచిలో పోగు చేసుకున్నాడు. తన కళ్ళు మోసం చెయ్యవు. వాడే....వాడే! ఎలాగైనా వాడిని పట్టుకుని పోలీసులకు అప్పజెప్పాలి!'

అమరనాథ్‌కి నిద్రపట్టడం లేదు.

## 3

"నాన్నా! నీ కళ్ళు అలా ఎర్రగా వున్నాయేం?" అని అడిగింది ప్రేమలత.

అమరనాథ్ మాట్లాడలేదు,

"మీ నాన్న దొంగల్ని పట్టుకోవడానికి వెళ్ళుంటాడు. నిద్రలేక కళ్ళు ఎర్రబడ్డాయి" అంది రుక్మిణి నవ్వుతూ.

అమరనాథ్ భార్యవంక గుర్రుగా చూశాడు.

"చాల్లేవోయ్ పరిహాసాలు" అన్నాడు.

ప్రేమలతకు ఏమీ అర్థం కాలేదు.

"దొంగలేమిటే అమ్మా!" అంది.

"అప్పుడెప్పుడో మా అన్నాయి పెళ్ళికి దొంగలు దోపిడీ చేశారు గదా!"

"అవును. నేనప్పుడు రాకపోవడం మంచిదైంది. చక్కగా గుంటూర్లో నే వుండిపోబట్టి నా నగలు పోకుండా వున్నాయి."

"ఆ దొంగ యెవడో నిన్న మీ నాన్నకి కన్పించాటడ. రాత్రి పదింటివరకూ వెతికి వెతికి వచ్చాడు" అంది రుక్మిణి ఎగతాళిగా.

"అవునా నాన్నా!" అంది ప్రేమలత.

"ఆఁ.........దొరికినట్లే దొరికి జారిపోయాడమ్మా! ఎక్కడికి పోతాడులే! వాడిని పట్టుకోకపోతే నా పేరు అమరనాథ్ కాదు" అన్నాడు రోషంగా.

"ఆఁ....దొరుకుతాడు. వాడేం పిచ్చిపుల్లాయా దొరకడానికి. అంతా మీ నాన్న పిచ్చి కాకపోతే! ఎవడ్నో చూసి దొంగనుకుంటున్నాడేమో! దారి దోపిడీలు చేసే వాడు పట్నాల్లో తిరుగుతాడా ఎక్కడైనా!" అంది ఆమె.

అమరనాథ్ కి కోపం ముంచుకొచ్చింది.

"అవన్నీ నీకెందుకు? నేను వాడిని పోలీసులకు పట్టిస్తాను చూడు!" కోపంతో లేచిపోయాడు అక్కడ్నుంచి.

"రిటైరయ్యాక ఈయనగారికి రోషం పెరిగిపోయింది. ఆ బి.పి. మాత్రలు మా నేశారేమో!" అంది రుక్మిణి.

"నువ్వూరుకోవే! లేనిపోని గొడవ" అంది ప్రేమలత నవ్వుతూ.

"సరే నా కెందుకులే! నీకు కాలేజీ గూడా లేదుగా!

అయ్యా కూతుళ్ళిద్దరూ వెళ్ళండి దొంగని పట్టడానికి" అంది రుక్మిణి పరిహాసం చేస్తూ.

అమరనాథ్ డ్రెస్ చేసుకుని లక్ష్మిమేన్షన్కి వెళ్ళాడు.

అప్పుడు వుదయం పది గంటలయింది.

పైన రూములన్నీ తాళాలు వేసివున్నాయి. క్రింద కూడా యెవరూ లేరు.

ఒక ముసలాడు చుట్ట కాల్చుకుంటూ కూర్చున్నాడు. అమరనాథ్ని చూసి చుట్ట ఆర్పి లేచి నిల్చున్నాడు. యెవరనుకున్నాడో ఏమో!

"ఎవరూ లేరా?"

"లేరయ్యా!" అన్నాడు.

"నువ్వేం చేస్తావిక్కడ?"

"గదులు వూడుస్తానయ్యా! కారేజీలు తెస్తానయ్యా!"

"అచ్ఛా! తొమ్మిదో నెంబరు గదిలో ఎవరెవరున్నారో తెలుసా?"

"అళ్ళంతా పొయ్యారుగా బాబూ!"

"పోతే పొయ్యార్లే! నీకు తెలుసా?"

"ఆఁ" తల వూపాడు ముసలోడు.

"చెప్పు వాళ్ళ పేర్లు."

"చక్రవర్తయ్య తెలుసయ్యా. ఆయనే డబ్బిస్తాడు నాకు."

"మిగిలినోళ్ళు?"

"పేర్లు సరిగా రావయ్యా!" అన్నాడు ముసలోడు.

పేర్లు తెలియకపోవడం ఏమిటి ఇక్కడ వుండేవాడికి. వీడి తరహా చూస్తుంటే కావాలని దాచిపెడుతున్నట్లుంది. తనని చూడగానే ఎందుకు భయపడి లేచినట్లు?

"సరే! ఈ మేడ యెవరిది?"

"సేటుది."

"యెక్కడుంటాడు సేటు? ఇల్లు చూపిస్తావా?"

ముసలాడు తల వూపాడు.

రాష్ట్రపతి రోడ్డులోకి తీసుకెళ్ళాడు.

"ఇటెక్కడికి?"

"కొట్టుకి."

"ఇంటికి కాదా?"

"ఇప్పుడు టయాంలో ఇంట్లో వుండడయ్యా!"

ఒక ఇంజనీరింగ్ షాపులోకి తీసుకెళ్ళాడు.

"సమస్తే శేట్ జీ" అన్నాడు అమరనాథ్.

"నమస్తే .... నమస్తే .... అయియే .... బైటియే!" అంటూ మర్యాదచేశాడు శేటు కష్టమర్ అనుకుని.

అమరనాథ్ తను వచ్చిన పని చెప్పాడు.

శేట్ ముఖం చిట్లించుకుని "మేరే నైమాలోమ్ సాబ్! మేరే బేటాకి పూచో!" అన్నాడు.

"కహా హైతుమారీ బేటా?"

శేట్ టెలిఫోన్ నెంబరు ఇచ్చాడు.

అమరనాథ్ డైల్ చేశాడు.

అవతలనుంచి శేట్ కొడుకు మాట్లాడాడు. తనకు చక్రవర్తి అద్దె ఇచ్చేవాడని. మిగిలినవాళ్ళు యెవరో తనకు తెలియదని చెప్పాడు. అంతకంటే ఏమీ చెప్పలేనన్నాడు.

ఫోన్ చేసినందుకు డబ్బు వసూలు చేసి పంపాడు శేటు.

అమరనాథ్ నీరసంగా పయుల్దేరాడు.

# 4

కాలేజీకి సెలవలు. ప్రిన్సిపాల్ వుంటాడో లేదో అనుకుంటూనే వెళ్ళాడు అమరనాథ్. ప్రిన్సిపాల్ గది తీసివుండటంతో సంతోషించాడు.

గదిబైట అటెండర్ స్టూల్ మీద కూర్చుని బీడీదమ్ము కొడుతున్నాడు.

"లోపల ఎవరున్నారు?"

"అయ్యగారు ఒక్కరే!" అన్నాడు అటెండర్.

చీటి రాసిచ్చాడు.

అటెండర్ లోపలకెళ్ళి తిరిగివచ్చి "రమ్మన్నారు" అన్నాడు.

"గుడ్‌మార్నింగ్" అన్నాడు అమరనాథ్.

"ప్లీజ్ టేక్ యువర్ సీట్"అన్నాడు ప్రిన్సిపాల్.

అమరనాథ్ థాంక్స్ చెప్పి కూర్చున్నాడు.

"చెప్పండి" అన్నాడు ప్రిన్సిపాల్.

"చిన్న హెల్ప్ చెయ్యాలి."

"అడ్మిషన్ల గొడవే గదా! అప్పుడే తొందరేముంది సార్!" అన్నాడు నవ్వుతూ.

"నో....నో.... నేను అడ్మిషన్ గురించి రాలేదు."

"మరి?" ప్రశ్నార్థకంగా చూశాడు.

"చక్రవర్తి అని ఒక కుర్రవాడి అడ్రస్ గురించి వచ్చాను."

"ఏం చదువుతున్నాడు."

"బి.కామ్."

"ఏ ఇయ్యరు?"

"తెలీదు సార్!"

"ఇయ్యర్ తెలియకపోతే కష్టంగదా!"

"ప్లీజ్! మీరెలాగైనా అతని అడ్రసు సంపాదించి పెట్టాలి. చాలా ముఖ్యమైన పని వుంది" బ్రతిమాలుతూ అన్నాడు.

"ఏమిటి? పిల్లనివ్వాలను కుంటున్నారా!"

అమరనాథ్ వెర్రి నవ్వొకటి నవ్వాడు.

ప్రిన్సిపాల్ క్లర్క్‌ని పిలిచి ఆ పని ఒప్పజెప్పాడు. పావుగంటలో చిన్న స్లిప్ మీద అతని అడ్రస్ నోట్ చేసుకుని వచ్చాడు క్లర్క్.

"బి.కామ్‌లో చక్రవర్తి పేరుతో ఇంకా ఎవరైనా వున్నారేమో వెరిఫై చేశావా?" క్లర్క్‌ని అడిగాడు ప్రిన్సిపాల్.

"లేదు సార్! ఇతను బి.కామ్ ఫైనల్ ఇయ్యర్. ఆ పేరుతో ఇంక ఏ స్టూడెంటూ లేడు" అన్నాడు క్లర్క్.

ప్రిన్సిపాల్ ఆ స్లిప్ అందించాడు అమరనాథ్‌కి.

జి. చక్రవర్తి,

కేరాఫ్ యస్. వెంకటాచలం,

చిక్కడపల్లి.

ప్రక్కనే ఇంటి నెంబరు వుంది.

'హమ్మయ్య సిటీలోనే వున్నాడన్నమాట' అనుకున్నాడు అమరనాథ్ సంతృప్తిగా.

ప్రిన్సిపాల్‌కి క్లర్క్‌కి థాంక్స్ చెప్పి ఆటోలో చిక్కడపల్లికి వెళ్ళాడు.

ఇంటి నెంబర్ సులభంగానే దొరికింది.

కాలింగ్ బెల్ నొక్కాడు.

పాతికేళ్ళ పడుచు తలుపు తీసింది.

ముసలాయన్ని చూసి చుట్టమని అనుకుందో ఏమో "రండి....రండి...." అంది.

"వెంకటాచలంగారు వున్నారా?" అని అడిగాడు అమరనాథ్.

"వెంకటాచలం ఎవరు?" ఆశ్చర్యపోతూ అడిగింది ఆమె.

అమరనాథ్ తికమకపడ్డాడు.

"ఈ ఫ్లాట్ లో వెంకటాచలంగారు లేరా?" అన్నాడు.

"నాకు తెలీదండి. మేం ఆర్నెల్ల నుంచి వుంటున్నాం."

"అయితే ఇంతకుముందు వుండేవాడా?"

"తెలీదండి."

"మీవారెక్కడ పనిచేస్తారు?"

"స్టేట్ బ్యాంక్ లో."

"మీవారికి తెలుసేమో?"

"ఏమోనండి? పోనీ ఇల్లుగలవాళ్ళని అడగండి." అంది ఆమె.

"ఎక్కడుంటారు వాళ్ళు?"

"క్రింద పోర్షనే" అంది ఆమె.

అమరనాథ్ క్రిందకు దిగాడు. ఆమె ఏమనుకుందో ఏమో అతనితో దిగివచ్చి "పిన్నిగారూ! పిన్నిగారూ!" అని పిలిచింది.

క్రింద పోర్షన్ తలుపు తెరుచుకుంది.

కుక్క ఒకటి భౌ....భౌ....మంటూ దూకింది.

అమరనాథ్ కంగారుపడి వెనక్కి వేశాడు అడుగులు.

"డాలీ!... ఏయ్ డాలీ!" అని గదమాయించింది ఇల్లుగలావిడ.

కుక్క తోక వూపుకుంటూ వెనక్కి తగ్గింది.

ఇల్లుగల్లావిడ ఎర్రగా గుమ్మడిపండులా వుంది. స్లీవ్ లెస్ జాకెట్ వేసుకుంది. పెదవులకు లిప్ స్టిక్ పూసుకుని ముఖానికి దట్టంగా మేకప్ కొట్టుకొని పదహారేళ్ళ పడుచులా అలంకరించుకుంది. గ్రీన్ నైలాక్స్ చీరలో ఆ నలభై ఏళ్ళ అందగత్తెను చూశాక అమరనాథ్ కళ్ళు ఇబ్బందిపడ్డాయి.

"ఏం కావాలి?" అడిగింది పిన్నిగారు.

"వెంకటాచలంగారని పెపోర్షన్ లో వుండేవారు..."

అమరనాథ్ పూర్తిగా చెప్పకముందే "ఖాళీచేసే శారుగా! ఆర్నెల్లు పైనే అయ్యింది" అంది పిన్నిగారు.

"ఆయన ఎక్కడ పనిచేసేవాడో మీకు తెలుసా?"

"తెలుసు."

అమరనాథ్ ప్రాణం లేచివచ్చింది.

"ఆయన మెంటల్ స్పెషలిస్టు. విశాఖపట్నం ట్రాన్సఫర్ అయ్యింది" అంది పిన్నిగారు.

అమరనాథ్ ప్రాణం పొయ్యింది.

"ఏమిటీ వైజాగ్ వెళుతున్నారా?" ఆశ్చర్యంగా అడిగింది రుక్మిణి భర్తని.

"అవును."

"ఏమిటి అంత అర్జెంట్?"

"మా ఛీఫ్ ఇంజనీర్ కూతురు పెళ్ళి."

రుక్మిణి పకపక నవ్వింది.

"రిటైరై పోయాక ఇంకా మీ ఛీఫ్ ఏమిటండీ!"

"బాగుంది. రిటైరైతే అనగూడదా!"

"ఇప్పుడు వెళ్ళకపోతే ఏం?"

"బాగుండదు."

"ఎప్పుడు పెళ్ళి?"

"ఎల్లుండి."

"మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"పెళ్ళవగానే! నాకేం పనివుంది అక్కడ?"

"ఏమండీ!"

"వూఁ...."

"పెళ్ళికి నేనూ వస్తానండీ."

అమరనాథ్ గుండెల్లో రాయిపడింది.

"నువ్వెందుకు?"

"పెళ్ళికి వస్తానంటే నువ్వెందుకు అంటారేమిటి? మీ ఛీఫ్ ఇంజనీర్ మన కులం వాడేగదా! మన అమ్మాయికి ఏదైనా సంబంధం వుందేమో చూస్తాను."

"అమ్మాయికి సంబంధం వైజాగ్ వెళ్ళి చూడాలా? సిటీలోనే బోలెడున్నాయ్! టిజల్టు రానీ ముందు."

"సంబంధం సర్లెండి. నేను వైజాక్ ఎప్పుడూ చూళ్ళేదు. చూసినట్టు వుంటుంది. పెళ్ళికి వెళ్ళినట్టూ వుంటుంది. దారిలో సింహాచలం, అన్నవరం చూసి రావొచ్చు. ఇంకెప్పుడు చూస్తాం? వయసు అయిపోతుంటే!"

అమరనాథ్ తల పట్టుకుని కూర్చున్నాడు.

"నవ్వొద్దులే ఇప్పుడు. మా ఫ్రెండ్స్‌తో కలిసి వెళ్తున్నా. తర్వాత చూద్దాం" అన్నాడు.

ఆమె రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

అమరనాథ్ నవ్వుకుంటూ సూట్‌కేసుతో రోడ్డు మీదకువచ్చి ఆటో ఎక్కాడు.

విజయవాడవరకూ బస్‌లో వెళ్ళాడు. అక్కడ కోరమండల్ ఎక్స్‌ప్రెస్ దొరికింది.

అతను హాస్పిటల్‌కి వెళ్ళేసరికి ఓ.పి.లో మెంటల్ పేషెంట్లను చూస్తున్నాడు వెంకటాచలం. అందర్నీ చూసేసరికి పన్నెండు దాటింది. అప్పుడు వెళ్ళి కల్సుకున్నాడు.

"చక్రవర్తి నా బ్రదరిన్లా! ఇంటి దగ్గర సరిగా చదవడం లేదని మా మామగారు గొడవచేస్తే హైదరాబాద్‌లో జేర్పించాను. ఫైనల్ ఇయ్యర్‌లో నాకు ఇక్కడికి ట్రాన్సఫర్ అయ్యింది. ఫ్రెండ్స్‌తో కలిసి సికింద్రాబాద్‌లోనో ఎక్కడో రూమ్‌లో వుంటున్నానని లెటర్ రాశాడు. హాస్టల్లో దొరక లేదట. ఇంతకీ వాడితో ఏం పని మీకు? ఏదైనా మాచ్ కోసమా?"

డాక్టర్ వెంకటాచలం నాన్‌స్టాప్‌గా మాట్లాడేశాడు.

"చక్రవర్తితో నాకు పనిలేదు. చక్రవర్తి ఫ్రెండ్ ఒకడున్నాడు. అతన్ని గురించి ఎంక్వాయిరీ చెయ్యాలి. అందుకు!" అన్నాడు అమరనాథ్.

"మాచ్ విషయమేగా! ఫ్రెండ్స్‌కి బాగా తెలిసి వుంటాయిలెండి ఇటువంటి విషయాలు. మీరు మా చక్రవర్తికి పిల్లనివ్వాలనివచ్చేరేమోనని హడలిపోయాను. ఎందుకంటే వాడికి మా అమ్మాయిని ఇవ్వాలనుకుంటున్నాం. మీరు పోటీకి వచ్చి ఎక్కువ కట్నం ఇస్తానంటే మా మామ సై అంటాడు. వట్టి కక్కుర్తి మనిషి లెండి."

"మీరు డాక్టర్లు. మీకంటే నేను ఎక్కువ కట్నం ఎలా ఇస్తానులెండి."

"ఎవరైనా మీ ఇంజనీర్ల తర్వాతే!"

"ఇంజనీరైతే మాత్రం ఏం ఆదాయం వుంది?"

"భలేవారే! ఎక్కడెక్కడి డబ్బు ప్రాజక్టులకే ఇస్తున్నారుగా గవర్నమెంట్. దేశంలో డబ్బుచాలక వరల్డు బ్యాంక్ నుంచి గూడా తెచ్చి మీ దోసిట్లో పోస్తున్నారు. అసలు గవర్నమెంట్ ఖజానా అంతా మీ స్వంతం. హ .... హ ...." అని నవ్వుతున్నాడు వెంకటాచలం.

'ఈ డాక్టరు తక్కువ తింటున్నట్లు' అని లోలోపల తిట్టుకుంటూ "మీవాడి అడ్రెస్ చెప్తే నేను సెలవు పుచ్చుకుంటాను" అన్నాడు అమరనాథ్.

"శ్రీశైలం డామ్ అంతా ఇసుకతో కడుతున్నారంటగా! పగిలిన డామ్ ఫోటో పేపర్లో వేశారండి" అన్నాడు వెంకటాచలం నవ్వుతూ.

"పొరపాట్లు ఎవరికైనా వస్తుంటాయి డాక్టర్ గారూ! మీవాళ్ళు మొన్న నశింభానుకి కళ్ళు పోగొట్ట లేదా! ఆపరేషన్లు చేసి కత్తెర్లు, టవళ్ళు పొట్టలో పెట్టి కుట్టేసిన డాక్టర్ల సంగతి రోజూ పేపర్లో వేస్తున్నారుగా మీరు చూడ్డంలేదా?" అన్నాడు అమరనాథ్ కుతకుత వుడికిపోతూ.

"భలేవారండి మీరు! .... భలే దెబ్బ కొట్టారే! ఎంతైనా మనం.... మనం .... భాయి.... భాయ్!...." అన్నాడు డాక్టర్ వెంకటాచలం.

అమరనాథ్ ఇబ్బందిగా నవ్వాడు.

వీళ్ళిద్దరి చలోక్తులు వింటూ నవ్వుకుంటున్నారు దగ్గరలోనే కూర్చున్న హౌస్ సర్జన్లు, నర్సులు.

"మా మామయ్య వ్యవసాయం చేస్తుంటాడు. వంద ఎకరాల ఆసామిలెండి. గాజులపాలెం వెళ్తే యెవరైనా చెప్తారు రామసుబ్బయ్యగారంటే."

"గాజులపాలెమా?"

"అవును సార్!"

"యెక్కడ ఆ వూరు?"

"మీకు తెనాలి తెలుసా?"

"తెనాలి తాలూకా నే!"

"థాంక్స్."

"ఇంజనీరు గారూ! భోజనం చేసి వెళ్లురుగాని వుండండి."

"నో థాంక్స్!" అన్నాడు అమరనాథ్.

# 6

"పేరు గూడా తెలియని వాడికి పిల్లనివ్వాలనుకుంటున్నారా?" పకపక నవ్వాడు చక్రవర్తి.

"పేరు తెలుసు. కాని గుర్తులేదు. పెద్ద వయసు కదా మతిమరుపు యెక్కువై పోయింది" అన్నాడు అమరనాథ్ చిరునవ్వు నవ్వుతూ.

"వాడి పేరు అర్జునరావు."

"మంచివాడేనా?"

"అతను నా స్నేహితుడు. మంచివాడని చెప్పక చెడ్డవాడని చెప్తానా?" నవ్వాడు చక్రవర్తి.

చక్రవర్తి చెల్లెలు రెండు గ్లాసులతో కాఫీ తెచ్చి అందించింది.

"మీరు ఏది చెప్పినా మాకు సంతృప్తిగానే వుంటుంది" అన్నాడు.

"అర్జునరావు గురించి మీకు అంతా తెలుసా?"

"అతని గురించి నాకేమీ తెలియదు. పేరుగూడా మర్చిపోయేగదా ఇంత దూరం వచ్చాను. మీరు చెప్పాలి అంతా!" అమరనాథ్ అతను నమ్మేటట్లు అబద్ధాలు చెప్పాడు.

"వాడికి తల్లిదండ్రులులేరు."

"మంచిదేగదా! కట్నాలూ లాంఛనాలు అని గొడవ వుండదు" నవ్వాడు అమరనాథ్.

"అవుననుకోండి. కాని వాడి మేనమామ ఈ పెళ్ళి జరగనిస్తాడని నాను నమ్మకం లేదు."

"ఏంకి?"

"ఆయన తన కూతుర్ని ఇవ్వాలనే వీడిని చదివిస్తున్నాడు."

"అలాగా?" నిరుత్సాహపడినట్లు నటించాడు అమరనాథ్.

"రెండేళ్ళ క్రితం వీడు కాలేజీలో చేరాక ఒక సంవత్సరం డబ్బు ఇచ్చాడు. తర్వాత పెళ్ళి చేసుకోమని బలవంతంచేశాడు. కాని వీడు బి.కామ్. పూర్తిచేసిగాని పెళ్ళిచేసుకోనని వాళ్ళ మావకి నచ్చజెప్పాడు. ఒప్పుకోలేదు వాళ్ళ మావ. వీడు కాలేజీ మానేశాడు ఒక సంవత్సరంపాటు. తర్వాత వీడు యెవరో కాంట్రాక్టరు దగ్గర పనిచేశాడు. కొంత డబ్బు కూడబెట్టుకున్నాడు. మళ్ళీ వచ్చి కాలేజీలో చేరాడు. వాళ్ళ మావ గూడా దిగివచ్చి డబ్బు ఇవ్వసాగాడు."

రెండేళ్ళ క్రితం వీడు చదువు మానేసి ఒక ముఠా తయారుచేసుకుని దారి దోపిడీలు చేసివుంటాడు. డబ్బు కూడాక బుద్ధిమంతుడిలా కాలేజీలో చేరాడన్నమాట. వీడు ఏదో కష్టపడి డబ్బు సంపాదించుకుని కాలేజీలో చదువుకుంటున్నట్లు నాటకం ఆడుతున్నాడన్నమాట. వీడి బండారం బైటపెట్టాలి. పళ్ళునూరాడు అమరనాథ్.

"అయితే వాళ్ళ మామ తన పిల్లను ఇచ్చే వుద్దేశ్యం లేకపోతే యూ ఆర్ లక్కీ!" అన్నాడు చక్రవర్తి.

"డైరెక్టుగా వాళ్ళ మామనే కన్సల్టు చేస్తాను. ఆయన అడ్రెస్ తెలుసా మీకు?"

"ఆయన తెలీదా మీకు?"

"లేదు."

"సిటీలోనే వుంటాడు."

"సిటీలోనా? మరి అతను మీ రూమ్‌లో యెందుకు వుంటున్నాడు?"

"వాళ్ళ మామగారి ఇల్లు చాలా దూరం. అదీగాక చదువుకోవడానికి వీలుగా వుంటుందని మాతో వుంటున్నాడు."

అమరనాథ్‌కి నీరసం ముంచుకొచ్చింది. అయితే అతగాడు సిటీలోనే వుంటున్నాడన్నమాట. చంకలో పిల్లని పెట్టుకుని వూరంతా తిరిగినట్టు తను సిటీలోనే వున్నవాడి కోసం ఎక్కడెక్కడో తిరుగుతున్నాడు.

"విజయవాడ రోడ్డులోనే పద్మనాభ ఆటోగ్యారేజి వాళ్ళ మామదే. ఆయన పేరు పద్మనాభం" అన్నాడు చక్రవర్తి.

# 7

గాజులపాలెంనుంచి తెనాలి, తెనాలినుంచి విజయవాడ చేరుకునేటప్పటికి చీకటి పడింది. విజయవాడలో వున్న చెల్లెలుగారింటికి వెళ్ళి ఆ రాత్రికి విశ్రాంతి తీసుకుని మర్నాడు ఉదయమే హైదరాబాద్ చేరుకున్నాడు. బస్సులో కిటికీ దగ్గరే కూర్చుని సైన్‌బోర్డుల వంక చూస్తూ కూర్చున్నాడు పద్మనాభ ఆటోగ్యారేజి ఎక్కడుందా అని.

పెయింట్ వెలిసిపోయిన పద్మనాభ గ్యారేజి అనే సైన్‌బోర్డు కనిపించింది. కండక్టర్ని రిక్వెస్టు చేసి బస్సు

దిగాడు.

గ్యారేజి ఆవరణ పెద్దదే. లారీలు, టాక్సీలు, మోటారుసైకిళ్లు, ఆటోలు రిపేరు కోసం వచ్చినవి చాలా వున్నాయి.

మెకానిక్‌లు రిపేరుచేస్తూ తమ పనిలో వున్నారు. కాకీబట్టలు వేసుకున్న నడివయస్సు మనిషే పద్మనాభం అయివుంటాడని అమరనాథ్ అనుకున్నాడు. లావుగా ఫైల్వాన్‌లా దృఢంగా వున్నాడు మనిషి. మీసాలు బొద్దుగా పెంచాడు. కళ్ళు ఎర్రగా వున్నాయి అతనికి.

"రండి సార్!... రండి" అతనే పలకరించాడు అమరనాథ్‌ని.

రేకుల షెడ్‌లో పెయింట్ వెలిసిపోయిన ఐరన్ ఫోల్డు కుర్చీ చూపించాడు అతను. దానిమీద కూర్చుంటే ప్యాంట్‌కి ఆయిల్ మరకలు అంటుకుంటాయేమోనని సందేహం కలిగింది అతనికి. కాని తప్పలేదు. ఇబ్బందిగా కూర్చున్నాడు.

"అర్జునరావు గురించి మాట్లాడదామని వచ్చాను" అన్నాడు.

అర్జునరావు పేరు వినగానే అతని ముఖం సీరియస్‌గా మారిపోయింది. ఆవేశం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది అతనిలో.

"మీరు పద్మనాభంకదా! మీ మేనల్లుడు అర్జునరావు" అన్నాడు అమరనాథ్ అతను మాట్లుడక పోవటంచూసి.

"వాడి సంగతి యెత్తకండి నా దగ్గర. వాడుట్టి దొంగ వెధవ" అన్నాడు పద్మనాభం కోపంతో.

"ఆ మాట నిజమే" అన్నాడు అమరనాథ్.

"వాళ్ళమ్మ పోయాక నేను పెంచాను వాడిని.

యెంత డబ్బు ఖర్చుపెట్టి చదివించానో లెక్కలేదు. పిల్లనిస్తానని అంటే చాలు ఏడుపు ముఖం పెడతాడు. యెందుకులెండి అదంతా! వాడితో మీకేం కావాలి" అన్నాడు పద్మనాభం.

"అరుణరావు మీ ఇంట్లోనే కదా వుండేది."

"పరీక్షలు అయ్యాక ఇంటికొచ్చాడు. అదివరకు ఎక్కడో దోస్తులతోపాటు వుండేవాడు లెండి."

"ఇప్పుడు వున్నాడా? మీ ఇల్లు ఎక్కడ?" ఆతృతగా అడిగాడు అమరనాథ్.

"ఇప్పుడు లేడు. వాడికి అసలు కాలు నిలుస్తేగా! బద్మాష్ ముండాకొడుకు" తిట్టాడు పద్మనాభం.

"సాయంకాలానికి వస్తాడా!"

"చెప్పానుగా వచ్చి రెండ్రోజులున్నాడు. పెళ్ళి మాట ఎత్తాను. ఇప్పుడు చేసుకోనన్నాడు. నాకు కోపం వచ్చి నాలుగు తగలనిచ్చాను. ఇంకెన్నాళ్ళు వేస్తాడు వాయిదాలు. అసలు వాడికి ఢోకాయిచ్చే వుద్దేశం వుందనుకుంటాను. తెలుస్తూనే వుందిగా. ముందు బి.కామ్. అంటే సరే అన్నా. ఇప్పుడేమో ఇంకా చదవాలంటున్నాడు. ఎమ్.కామ్. వీడి బాబు ముల్లె వుందా నా దగ్గర. తన్ని తగలేశాన. వీడి బాబులాంటి సంబంధం తేస్తాను నా కూతురికి" మీసాలు మెలేస్తూ అన్నాడు పద్మనాభం.

"అయితే అతను ఎక్కడికి వెళ్ళాడంటారు?"

"దేవుడికి తెలియాలి. మళ్ళీ ఇటు వస్తే కీళ్ళు విరగదీస్తానన్నాను" కోపంతో కాండ్రించి వూశాడు పద్మనాభం.

ఇంతలో ఎవరో చిన్న కారుని తోసుకుంటూ వస్తే

అటు వెళ్ళాడు.

అమరనాథ్ రోడ్డెక్కి ఆటో కేకేసి కూర్చున్నాడు నీరసంగా.

## 8

"వాడి పేరు తెలుసుకున్నాను. అర్జునరావు. వాళ్ళ మేనమామ పద్మనాభం. విజయవాడ రోడ్డులో పద్మనాభ ఆటో గ్యారేజీ అతనిదే. మొత్తానికి దొంగ సిటీలోనే వున్నాడు. ఎప్పుడో దొరక్కపోడు" అన్నాడు అమరనాథ్.

"ఎలా తెలుసుకున్నారు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్ అజీజ్.

ఆ రోజునుంచి జరిగినదంతా చెప్పాడు.

"ఓపికగా పరిశోధన మొదలు పెట్టారన్నమాట. బాగుంది" అన్నాడు అజీజ్ నవ్వుతూ.

"కుర్రవాడిగా వున్నప్పుడు వై.వి. రావుగారి డిటెక్టివ్ రెగ్యులర్‌గా తెప్పించి చదివేవాడిని. టెంపోరావు, కొమ్మూరి నవలలన్నీ కొనేవాడిని. మా నాన్న తిట్టేవాడు డబ్బు తగలేస్తున్నానని. మళ్ళీ రిటైరైనాక అపన చదువుతున్నాను" నవ్వుతూ అన్నాడు అమరనాథ్.

"అయితే యెప్పటికైనా మిమ్మల్ని దోచిన దొంగను మీరే పట్టుకోవాలి."

"ష్యూర్ నేనే పట్టుకుని తీరతాను. వాడు సిటీలోనే తిరుగుతున్నాడు. నాకూ పనిలేదు. నేనూ తిరుగుతూనే వుంటాను. ఎప్పుడో నా కళ్ళల్లో పడకపోడు. అప్పుడిక తప్పించుకోలేడు. వెంటనే నేను మీ కంట్రోల్ రూమ్‌కి ఫోన్ చేస్తాను. ఆలస్యం చెయ్యకుండా ఫోర్స్ పంపండి.

దొరికిపోతాడు" అన్నాడు అమరనాథ్ ఆవేశంగా.

"ఓ యస్ నేను ఇక్కడ వున్నా లేకపోయినా ఇంజనీర్ అమరనాథ్ గారు ఫోన్ చేస్తే వెంటనే వెళ్ళమని మా వాళ్ళకి చెప్తాను. సరేనా!" అన్నాడు అజీజ్.

"థాంక్స్" అన్నాడు అమరనాథ్.

"కాని నాకొక విషయం ఆశ్చర్యంగా తోస్తోంది."

"ఏమిటి?"

"ఒకసారి దొంగతనానికి అలవాటుపడ్డవాడు తనంతట తను మానేయడం అరుదు. అర్జునరావు బి.కామ్. చదువుతున్నాడని చెప్తున్నారు. అతను రెండేళ్ళ క్రితం దోపిడీ చెయ్యడం ఆశ్చర్యంగా వుంది. చేసినవాడు గిల్టీ కాంక్షస్‌తో చాటుమాటుగా తిరుగుతాడుగాని మళ్ళీ మనముందు తిరగలేడు. ఎవరైనా గుర్తుపడతారని భయపడతాడు" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఇది అరుదైన కేసు అనుకోండి. అర్జునరావుకి చదువు మీద చాలా ఇంట్రెస్టు వున్నట్లు నా పరిశోధనలో తెలిసింది. మేనమామ చదువుకీ పెళ్ళికి ముడిపెట్టినప్పుడు అతని చదువు ఆగిపోయింది. ఆ పిరియడ్‌లోనే అతను ఒక సంవత్సరం పాటు కాలేజీ డిస్ కంటిన్యూ చేశాడు. అప్పుడే ఒకటో రెండో దోపిడీలు చేసి డబ్బు సంపాదించాక ఆ వృత్తి మానేసి వుండొచ్చు. అతను తీవ్రవాది కూడా అయివుండొచ్చు. చెప్పలేం!" అన్నాడు అమరనాథ్.

ఇన్స్పెక్టర్ అజీజ్ తలవూపాడు ఏదో ఆలోచిస్తూ.

"సారీ! మిష్టర్ ఇన్స్పెక్టర్! మీ టైం వేస్టు చేసినట్లున్నాను. సీ.యూ!" అన్నాడు అమరనాథ్ కుర్చీలో నుంచి లేచి.

"నో.... నా పెట్రోల్!" నవ్వాడు ఇన్స్పెక్టర్ కరచాలనం చేసి.

ఇనస్పెక్టర్ని కలుసుకుని ఇంటికి వెళ్తూ పరధ్యానంగా రోడ్ క్రాస్ చేస్తున్న అమరనాధ్‌ని ఒక మోటార్ సైకిలిస్టు యాక్సిడెంట్ చేశాడు. అమరనాధ్ వెంటనే స్పృహ తప్పిపోయాడు. మోటారు సైకిలిస్టుకి మైనర్ ఇంజరీస్ తగిలాయి. అతనికి ఫస్టుఎయిడ్ చేసి పంపేశారు. ముసలాయనదే తప్పు అని బ్రేక్ ఇన్స్పెక్టర్ అభిప్రాయపడ్డాడు.

మర్నాడు పుదయిం అమరనాధ్‌కి తెలివి వచ్చింది. ఇన్స్పెక్టర్ అజీజ్ అంతకుముందే ఆయన్ని గుర్తుపట్టి ఇంటికి కబురు చేశాడు. ప్రేమలత, రుక్మిణి హాస్పిటల్‌కి వచ్చారు. అమరనాధ్ తెలివిలోకి వచ్చి భార్యతోను కూతురుతోను మాట్లాడుతున్నాడు.

ఆయనకి యాక్సిడెంట్ చేసిన మోటారు సైకిలిస్టు ఆయనకి ఎలావుందో పాపం చూసిపోదామని వచ్చాడు.

"నమస్తే!" అన్నాడు అతను.

అమరనాధ్ అతని ముఖం చూసి కొయ్యబారిపోయాడు.

అతనే అర్జునరావు. దోపిడీ దొంగ. తమ దగ్గర బంగారం, డబ్బు దోచుకున్న క్రూరుడు.

"మీరు రోడ్ క్రాస్ చేస్తున్నారు. నేను హారన్ కొట్టాను. సడన్ బ్రేక్ కూడా వేశాను. కాని లాభం లేకపోయింది. మీరు ఏదో పరధ్యానంలో వున్నారనుకుంటాను" అర్జునరావు యాక్సిడెంట్ గురించి మాట్లాడుతున్నాడు.

అమరనాథ్ కలా? నిజమా? అన్నట్లు అతనివంక చూస్తున్నాడు.

అతని బుర్రలో ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి. ఇతన్ని పోనివ్వకుండా పోలీసులకు పట్టించేది ఎలా? అని.

అమరనాథ్ నెమ్మదిగా లేచాడు బెడ్ మీదనుంచి. భార్య వారించినా వినలేదు. దూరంగా కేస్ షీటు చూసి మందులు ఇస్తున్న నర్స్ దగ్గరికి వెళ్ళాడు.

"సిస్టర్!" అన్నాడు.

ఆమె తలెత్తి చూసింది.

"సిస్టర్! నాకొక హెల్ప్ చెయ్యాలి."

"చెప్పండి" గట్టిగానే అంది.

"ష్! నెమ్మది. అదుగో అక్కడ నా బెడ్ దగ్గర వున్న వాళ్ళు వినకూడదు. సీక్రెట్."

నర్స్ నివ్వెరపోయింది.

"వెంటనే ఈ నెంబర్ కి డైల్ చేయండి" నెంబరు చెప్పాడు.

ఆమె నోట్ చేసుకుంది.

"ఏం చెప్పమంటారు?"

"ఇన్స్పెక్టర్ అజీజ్ పలుకుతాడు. లేదా ఎవరు మాట్లాడినా ఇంజనీర్ అమరనాథ్ మిమ్మల్ని వెంటనే ఇక్కడికి రమ్మన్నాడని చెప్పండి. దొంగ దొరికాడని చెప్పండి."

నర్స్ కి అంతా అయోమయంగా వుంది.

ఆమె తెల్లబోయి చూస్తుంటే "ప్లీజ్!" అన్నాడు అర్థింపుగా.

ఆమె వెళ్ళింది ఫోన్ చెయ్యడానికి.

అమరనాథ్ వెనక్కి వచ్చి బెడ్ మీద పడుకున్నాడు.

తనతో ఒక ముక్క కూడా మాట్లాడకుండా కొర కొర చూస్తున్న ముసలాయన్ని చూస్తుంటే అర్జునరావుకి నవ్వొస్తోంది. 'కోపం తగ్గలేదు ఓల్డుమాన్ కి' అనుకున్నాడు.

కాసేపటికి ఇన్స్పెక్టర్ అజీజ్ వచ్చాడు తన బలగంతోటి. అతన్ని చూస్తూనే అమరనాథ్ ముఖం వికసించింది.

"ఇన్స్పెక్టర్ వీడే ఆ దొంగ" అన్నాడు అమరనాథ్ గట్టిగా.

అర్జునరావు స్థాణువులా నిలబడిపోయాడు. ఇద్దరు పోలీసులు అతన్ని చెరొకవైపూ పట్టుకున్నారు.

"ఏమిటి ఇన్స్పెక్టర్?" అన్నాడు అర్జునరావు తేరుకుని.

"నిన్ను అరెస్టు చేస్తున్నాం."

"ఎందుకు?"

"మా చెల్లి దోపిడీ కేసులో నిన్ను గుర్తుపట్టాడు ఆయన."

"మా చెల్లి దోపిడీ కేసు ఏమిటి? ఆయన గుర్తుపట్టటం ఏమిటి?" తీవ్రంగా అన్నాడు అర్జునరావు.

"ఏమిటో తర్వాత తెలుస్తుంది. ముందు వీడిని వ్యాన్ లో పడేసి తీసికెళ్ళండి" అన్నాడు ఇన్స్పెక్టర్.

"నో...." అని పెద్దగా కేక పెట్టాడు అర్జునరావు.

పోలీసులు అతన్ని లాక్కుంటూ తీసుకెళ్లారు.

"ఏమిటి నాన్నా! ఇదంతా!" ప్రేమలత ఆందోళనతో అడిగింది.

"ఆ రోజు అన్నయ్య పెళ్ళినుంచి తిరిగివస్తుంటే వీడేనమ్మా మమ్మల్ని దోచుకుంది. ఈ దెబ్బతో వీడి

ముఠా అంతా బైటపడుతుంది" సంతృప్తిగా అన్నాడు అమరనాథ్.

ప్రేమలత అయోమయంగా తండ్రివంక చూసింది.

"రుక్మిణీ! నువ్వు గుర్తుపట్టావా వీణ్ని" అన్నాడు.

ఆమెకు గుర్తురావడంలేదు. ఆ సమయంలో ఆమె మానసికంగా బెంబేలు పడిపోయి వుంది. ఏమీ తెలియలేదు. అంతా చీకటి. ఆ చీకట్లో బ్యాట్రీలైటు వేస్తుంటే కళ్ళుపోయినట్లు అనిపించింది. ఈయన ఎలా గుర్తుపట్టారో అనుకుంది ఆమె.

"నాకు సరిగా గుర్తురావటంలేదు" అంది ఆమె.

"కొంపతీశావ్ ఫో! పోలీసులు అడిగినప్పుడు అలా చెప్పేవ్? జాగ్రత్త. అతనేనని గట్టిగా చెప్పాలి." కోప్పడ్డాడు భార్యని.

"నాన్నా! నువ్వు పొరబడుతున్నావేమో?" అంది ప్రేమలత.

"లేదు.... నాకు బాగా గుర్తు. కొంగ ముక్కు, ఆ ఎత్తు.... ఆ ముఖం అంతా అతనే. ఎన్ని రోజులైనా గుర్తుపట్టగలను" గట్టిగా అన్నాడు అమరనాథ్.

## 9

పోలీస్ అధికారుల ఎదుట గట్టిగా వాదిస్తున్నాడు అర్జునరావు.

"ఆయన చెప్పింది పచ్చి అబద్ధం సార్!"

"మా చెర్ల దోపిడీ కేసులో ఆయన చాలా డబ్బు, నగలు పోగొట్టుకున్నాడు. ఆయన నిన్ను గుర్తుపట్టాడు. ఇందులో అబద్ధం ఏముంది?"

"సార్! నేను దోపిడీ చేయాల్సిన అవసరం ఏమిటి? దోపిడీలు చేసేవాడినైతే సిటీలో ఎందుకు వుండేవాడిని."

"నువ్వు తీవ్రవాదివేమో?"

"నాకు ఎటువంటి రాజకీయ సంస్థలతోను సంబంధం లేదు సార్!"

"నువ్వొక సంవత్సరం చదువు మానేసేవు. అవునా?"

"అవును సార్!"

"ఎందుకు?"

"మా మామయ్య తన కూతుర్ని పెళ్ళిచేసుకుంటేనే గాని డబ్బు ఇవ్వనన్నాడు సార్!"

"ఆ సంవత్సరం ఎక్కడున్నావు?"

"సాగర్ ప్రాజెక్టులో రెడ్డిగారని ఒక కాంట్రాక్టరు దగ్గర మేస్త్రీగా పనిచేశాను. సంవత్సరం తర్వాత కొంత డబ్బు మిగిలింది. దాంతో వచ్చి మళ్ళీ కాలేజీలో చేరాను. అప్పుడు మా మామయ్య కూడా డబ్బు ఇవ్వడం ప్రారంభించాడు. చదువు సాగించాను."

"నువ్వు ఆ ప్రాజెక్టులో పనిచేస్తున్న కాలంలోనే ఈ దారి దోపిడి జరిగింది. ఆ సంగతి గమనించావా?"

"ఆ దోపిడీ ఎప్పుడు జరిగిందో నాకేం తెలుసు సార్! నాకు దాంతో ఏమీ సంబంధం లేదు."

"సంబంధం వుందో లేదో మేం తెల్చుకుంటాం."

"నేను రెడ్డిగారి అడ్రస్ ఇస్తాను. మీరు నా గురించి ఎంక్వయిరీ చేసుకోవచ్చు. నేను ప్రతిరోజూ డ్యూటీకి హాజరయ్యేవాడినో లేదో ఆయన చెప్తారు" అన్నాడు అర్జునరావు.

"ఇప్పుడు నువ్వు మీ మామయ్యగారి ఇంట్లోనే వుంటున్నావా?"

"లేను సార్!"

"ఏం?"

"నాకేమో ఇంకా చదువుకోవాలని వుంది. ఆయనేమో వెంటనే పెళ్ళి చేసుకోమని ప్రాణం తీస్తున్నాడు. నేను చేసుకోనన్నాను. ఆయనకి కోపం వచ్చి నన్ను కొట్టాడు. నేను ఇంట్లోనుంచి వచ్చేశాను."

"మరి ఎక్కడ వుంటున్నావ్?"

"నాజ్ ఆటో గ్యారేజిలో పని చేస్తున్నారు. నాకు మోటారు మెకానిజం తెలుసు. మావయ్య దగ్గర నేర్చుకున్నాను" అన్నాడు అర్జునరావు.

"చూడు మిష్టర్ అర్జునరావ్! నువ్వు చదువుకున్నవాడివి. డొంక తిరుగుడుగా కాకుండా సూటిగా సమాధానం చెప్పు. అమరనాథ్ గారు నువ్వే దోపిడీ దొంగవని ఎలా గుర్తుపట్టాడు? ఇది సినిమా కాదుగదా! కవల సోదరులు వుండడానికి?"

"సినిమాలో కవల సోదరులు వుండొచ్చు. కాని నిజ జీవితంలో మనిషిని పోలిన మనిషి వుండొచ్చు సార్!"

"దట్సాల్ రైట్. అది రేర్ కేస్. అమరనాథ్ మీరే దోపిడీ దొంగ అని అంత గట్టిగా చెపుతున్నాడు. డబ్బు పోగొట్టుకున్న వ్యక్తి అతను. మేము కేసు పెట్టక తప్పదు. నిజంగా నువ్వు ఆ రోజు జరిగిన దాడిలో గనుక వుంటే నిజం చెప్పెయ్! నీకు శిక్ష తగ్గుతుంది. నీ ముఠా వాళ్ళు ఎక్కడున్నారో ఆచూకీ చెప్పు. బహుశా వాళ్ళు తీవ్రవాదులై వుంటారు. అవునా!"

"నో సార్! నేను చెప్పింది మీరు నమ్మడంలేదు."

"నువ్వు చెప్పిందంతా నమ్మితే మేం పోలీసులం కాదు. తెల్లవారి లేస్తే నీలాంటి వాళ్ళని ఎంతమందిని చూస్తుంటామో లెక్కలేదు. నేరంచేసిన ఏ వెధవా వెంటనే ఒప్పుకోడు. ఇయ్యవలసినవి పుచ్చుకున్నతర్వాతే

బైటపడతారు. కొన్ని రోజుల హింస తర్వాత చెప్పే ఘటికులు కూడా వున్నారు."

"సార్! ఇన్స్పెక్టర్ గారూ! ఇదంతా ఆయన నా మీద కోపంతో చేస్తున్నాడు."

"నువ్వు యాక్సిడెంట్ చేశావని కోపమా? అందులో నీ తప్పు ఏముంది? తప్పంతా ఆయుందే కదా!" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఎంత చెప్పినా మీరు నమ్మడంలేదు కాబట్టి అసలు విషయం చెప్తున్నా వినండి. ఆయనకి నామీద కోపం వుండడానికి వేరే కారణం వుంది."

"ఏమిటి?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్.

"ఆయన కూతురు ప్రేమలత నేనూ ప్రేమించుకున్నాం. మా ఇద్దరి కులాలు ఒకటికాదు. పైగా ఆయన డబ్బున్నవాడు. ఆయన కొడుకులు ఇద్దరూ ఇంజనీర్లు. ఆయన పెద్దల్లుడు డాక్టర్. నేను ఆస్థిలేనివాడిని పైగా కులం కాదు. అందుకని ఆయన ఈ అడ్డుదోవ తొక్కి నా పరువు తియ్యాలనీ, నన్ని కేసులో ఇరికించాలని చూస్తున్నాడు" అర్జునరావు చెప్పాడు.

ఇన్స్పెక్టర్ బుర్ర గోక్కున్నాడు అదంతా విని.

నాజ్ ఆటో గ్యారేజి ప్రొప్రయిటర్ అబ్దుల్లా వచ్చి బెయిల్ మీద అర్జునరావుని విడిపించాడు.

# 10

'జూ' దగ్గర రెండు టిక్కెట్లు కొని రెడీగా వున్నాడు అర్జునరావు.

బస్సు దిగి వచ్చింది ప్రేమలత.

"ఇంత దూరం రమ్మని కబురుచేశావు ఎందుకు?" అంది వస్తూనే.

"ఖర్మ. అక్కడ పార్కుల్లో తిరుగుతుంటే ఎవరైనా చూస్తారని" నవ్వాడు అర్జునరావు.

"నేను మీ మావయ్యకి చెప్పాలని బయల్దేరుతుంటే నువ్వు పంపిన ఖబర్వాడు వచ్చి లెటర్ ఇచ్చాడు" అంది.

"నువ్వెళ్తే మండిపడివుండేవాడు మావయ్య. మా గ్యారేజి ప్రొప్రయిటర్ వచ్చి బెయిల్ మీద వదిలించాడు. మొత్తానికి మీ నాన్నది గొప్ప బ్రెయిన్. ఇందిరాగాంధీకి సలహాలు ఇవ్వాల్సినోడు" అన్నాడు అర్జునరావు.

"పోలీసులు కేసు పెడతారా? నాకు భయంగా వుంది అర్జున్" అంది ప్రేమలత.

"కేసు పెడితే ఏమవుతుంది? ఎలా నిలుస్తుందో నాకు అర్థంగావడంలేదు. నేను ఒక లాయర్ని కన్సల్టు చేసి వుంచానులే. దొంగ సొత్తు దొరకనప్పుడు కేసు నిలవదని చెప్తున్నాడు."

"మా నాన్న మన సంగతి ఎలా కనిపెట్టాడో అర్థం కావడంలేదు అర్జున్. నేను పొరపాటున గూడా ఎవరితోనూ అనలేదు గూడా!"

"ఆయనకి పనేముంది చెప్పు? రిటైరై పోయాడు. రోడ్లు సర్వే చేస్తుండి ఉంటాడు. ఏ పార్కులోనో, టాంక్ బండ్ మీదనో మనల్ని చూసి వుంటాడు. ఈ కాలం పిల్లలు చెప్తే వినరని నన్నొక దొంగగా క్రియేట్ చేసి కేసులో ఇరికిస్తే నువ్వు మనసు మార్చుకుంటావని పెద్ద ప్లాన్ వేశాడు ఓల్డ్ రోగ్!" కసిగా అన్నాడు అర్జునరావు.

"పేపర్లో నీ పేరు పడింది చూశావా? మా చెర్ల దారి దోపిడీలో దొంగ ఆచూకీ అని రాశారు" అంది ప్రేమలత.

"చూశాన్లే! నేను గూడా ప్రెస్ క్లబ్‌కి వెళ్ళి బ్రహ్మాండమైన స్టేట్‌మెంట్ రాసిచ్చాను."

"ఏమని?"

"ఆయన అతి తెలివి గురించి. కులాంతర వివాహం ఇష్టంలేని ఒక రిటైర్డ్ ఇంజనీరు కాబోయే అల్లుడిమీద అభాండం వేశాడని. దారి దోపిడీ కేసులో ఇరికించాలని ప్రయత్నిస్తున్నాడని" అన్నాడు.

"చంపేశావు ఫో. నా పేరు గూడా వేస్తారా పేపర్లో!"

"బ్రహ్మాండంగా వేస్తారు. అదొక కథలా బాక్స్‌కట్టి వేస్తారు. అర్జునలతల ప్రేమ కథ. ఇండియాలో అందరికీ మన కథ తెలిసిపోతుంది."

"మా బ్రదర్స్‌కి తెలిస్తే పెద్ద గొడవ జరుగుతుంది అర్జున్. ఏం చెయ్యాలి ఇప్పుడు. లేనిపోని గొడవ తెచ్చి పెట్టావు గదా!" భయంతో అంది ప్రేమలత.

"ఎందుకు అట్లా భయపడతావు? ఎప్పటికైనా అందరికీ తెలియాల్సిందేగదా!" ఆమె వీపుమీద తట్టి ధైర్యం చెప్పాడు అర్జునరావు.

"నాకెందుకో భయంగా వుంది అర్జున్. నాన్న ఇలా చేస్తాడనుకోలేదు."

"చేస్తే చేస్తాడు. ఎత్తుకు పై ఎత్తు వెయ్యాలిగాని భయపడితే సాధించేది ఏమీ లేదు."

"ఏం చెయ్యాలి ఇప్పుడు?"

"చెయ్యాల్సిందే చెయ్యాలి" నవ్వాడు అర్జునరావు.

## 11

ఉదయం డెయిలీ పేపరు చూస్తున్నాడు అమరనాథ్ కాఫీ త్రాగుతూ.

'ఫైర్ ఇంజనీర్ అఘాయిత్యం' అని బాక్సు కట్టి పడిన వార్త ఆత్రంగా చదివాడు. చదువుతూనే అతని ముఖం నల్లబడిపోయింది. బి.పీ. పెరిగిపోయింది.

"ప్రేమా!...." అని గావుకేక పెట్టాడు.

"ఏమిటలా అరుస్తున్నారు. అమ్మాయి ఇంట్లో లేదు. ఎవరో ఫ్రెండ్స్ ఇంటికి వెళ్తానని వెళ్ళింది" అంటూ వచ్చింది ఆయన భార్య రుక్మిణి.

"ఇది చూడు" అంటూ పేపరు విసిరికొట్టాడు.

అదంతా చదివి ఆమె నిర్ఘాంతపోయింది.

"ఏమిటండీ ఇదంతా? నిజమేనా?" అంది వెల వెల పోతున్న ముఖంతో.

'కథ ఇలా అడ్డం తిరిగింది ఏమిటి?' అని దిగులుతో పడక్కుర్చీకి అతుక్కుపోయాడు అమరనాథ్.

'ప్రేమ వాడిని ప్రేమించిందా?' గమ్మత్తుగా వుందే అనుకున్నాడు.

ఫోన్ దగ్గరికెళ్ళి రిసీవర్ ఎత్తి డైల్ చేశాడు.

"గుడ్ మార్నింగ్ మిష్టర్ అజీజ్!" అన్నాడు అవతల ఇన్స్పెక్టర్ పలకగానే.

"పేపరు చూశారా?"

"చూశాను సార్!"

"అదంతా కట్టుకథ ఇన్స్పెక్టర్."

"ఏది కథో అర్థంకావడం లేదు సార్!"

"నిజం చెప్తున్నా అసలు మా అమ్మాయీ, వాడూ ప్రేమించుకుంటున్న సంగతే నాకు తెలీదు. ప్రామిస్."

"మీ అమ్మాయి ఏమంటున్నది?"

"అడుగుదామని అనుకుంటే ఇంట్లో లేదు. ప్రొద్దున్నే యెవరో ఫ్రెండ్స్ ఇంటికి వెళ్ళిందట."

"ఫ్రెండ్స్ ఇంటికి కాదు. ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి ఉంటుంది."

"ఏమిటి సార్ మీర నేదికి?"

"అయ్యా! మీకున్న కోపంవల్ల ఆ కుర్రాడిని ఈ కేసులో పెట్టి ఇరికించటం ఏమీ బాగాలేదు."

"నో .... ఇన్స్పెక్టర్. నేను ఇరికించటం కాదు. ప్రామిస్‌గా చెప్తున్నా వాడే దొంగ."

"సారీ! అమరనాథ్ గారూ! మీ వంటి పెద్దవాళ్ళు ఇంత చీప్‌గా బిహేవ్ చెయ్యటం బాగాలేదు. ఈ రోజుల్లో ఇంకా మీరు కులాలు, మతాలూ అంటూ ప్రాకులాడ్డం కల్చర్ కాదు."

"ఇన్స్పెక్టర్ నన్ను మీరు అపార్థం చేసుకుం టున్నారు."

"బాగా అర్థమైందిలెండి. ఇంతకీ మీకు తెలియదన్న మాట."

"ఏమిటి?"

"మీరు చేసిన పనికి మీ అమ్మాయి బుద్ధి చెప్పాలను కుంటోంది."

"అక్కడుందా అది. ఫోన్ ఇవ్వండి దానికి" కోపంతో అరిచాడు అమరనాథ్.

"లేదు ఇక్కడ. వాళ్ళిద్దరూ గుళ్ళో పెళ్ళి చేసుకోవ డానికి సన్నాహాలు చేస్తున్నారని మాకు సమాచారం అందింది."

"నో....నో....ఇన్స్పెక్టర్! ఆ పెళ్ళి జరగడానికి వీల్లేదు. వాడు మా అమ్మాయిని మోసం చేస్తున్నాడు. వాడొక రోగ్. దొంగ....ప్లీజ్ ఈ పెళ్ళి ఆపండి."

"సారీ సర్! మీ అమ్మాయి మేజర్ అని మీకు

తెలుసుకుంటాను."

ఫోన్ పెట్టేసినట్టుక్లిక్‌మంది అవతల.

అమరనాథ్ డ్రెస్ వేసుకుని బయల్దేరాడు కూతుర్ని వెతకడానికి.

# 12

అర్జునరావు, ప్రేమలత పూలదండలు వేసుకుని టాక్సీ దిగారు. వధూవరులు పెళ్ళిచేసుకుని ఇక్కడికెందుకు వచ్చారా అని పోలీసులు ఆశ్చర్యంగా చూస్తున్నారు. తను పోలీస్ కమీషనర్ గారిని చూడాలనుకుంటున్నానని అర్జునరావు కోరాడు. అనుమతి లభించింది.

వధూవరులిద్దరూ వెళ్ళి పోలీస్ కమీషనర్ గారికి నమస్కారం చేశారు.

"సార్! మేమిద్దరం ప్రేమించి పెళ్ళిచేసుకున్నాం. రాత్రి యాదగిరి గుట్టలో మా పెళ్ళి జరిగింది. కాని మా మామగారికి ఈ పెళ్ళి ఇష్టంలేదు. నన్ను దారిదోపిడీ కేసులో ఇరికించాలని చూస్తున్నాడు. అది విఫలమైతే పగ సాధించాలని చూస్తాడు. మాకు రక్షణ కావాలి" అన్నాడు అర్జునరావు.

"మీ కేసు నాకు తెలుసు. ఫర్వాలేదు మీ ఇద్దరూ మీ మామగారింటికి వెళ్ళండి" అన్నాడు కమీషనర్.

"లేదు సార్! ఆయన కాలాంతకుడు. మంచిగా కనిపిస్తూనే దొంగ దెబ్బ తీస్తాడు. ఆయన్ని నమ్మలేం సార్!"

"మిస్టర్ అర్జునరావ్! నువ్వు ఆయన్ని అపార్థం చేసుకుంటున్నావ్!"

"నేనా సార్!"

"అవును. మీరిద్దరూ ప్రేమించుకున్న సంగతే ఆయనకి

తెలియదు."

"అంతా నాటకం సార్!"

"కాదు నిజం. ఇదుగో ఈ ఫోటో చూడు" అంటూ డ్రాయర్‌లోనుంచి ఒక కవరుతీసి అందులో ఫోటో అందించాడు.

ఇద్దరూ ఆ ఫోటో చూశారు.

"అర్జున్! అంతా నీలాగే ఉన్నాడు" ఆశ్చర్యపోతూ అంది ప్రేమలత.

అర్జునరావు నివ్వెరపోయాడు అది చూసి.

"యెవరు సార్ ఇతను."

"వాడే దోపిడీ ముఠా నాయకుడు. మూడేళ్ళనుంచి దొరక్కుండా తప్పించుకుని తిరుగుతున్నాడు. తిరుపతి పోయే బస్సు దోచుకుంటూ పట్టుపడ్డాడు. వీడే రెండేళ్ళ క్రితం మీ మామగారిని కూడా దోచుకుంది. అమరనాథ్ గారు వచ్చి చూసి గుర్తుపట్టాడు. నిన్ను అనుమానించి నందుకు బాధపడ్డాడు."

"వాడే వీడా సార్!"

"అవును. చూస్తావా సెల్‌లో వున్నాడు. నీకు బ్రదర్ ఏమో ఆలోచించు" అన్నాడు కమిషనర్.

"నాకు బ్రదర్స్ ఎవరూ లేరు సార్" అన్నాడు అర్జునరావు.

ప్రేమలత 'హమ్మయ్య' అనుకుని తృప్తిగా గాలి పీల్చుకుంది.

—: సమాప్తం :—

# నిరపరాధి?

## వసుంధర

"మీకు ఫోన్ వచ్చింది—" అన్నాడు చిన్నారావు సంతోష్‌కుమార్‌తో.

చిన్నారావుది సంతోష్‌కుమార్‌కి ఎదురిల్లు. చిన్నారావు తండ్రి డాక్టరు. వాళ్ళింట్లో ఫోనుంది. డాక్టరుగారిది నలుగురికీ సాయపడే స్వభావం. అందుచేత వాళ్ళింటి ఫోన్ నెంబరు ఆ వీధిలో చాలా మందికి కూడా ఫోన్ నంబరయింది. చిన్నారావు వీళ్ళందరికీ వార్తాహరుడుగా పని చేస్తూంటాడు. అతడందుకు విసుక్కున్నట్లు ఎప్పుడూ కనబడదు.

చిన్నారావు టెన్త్‌క్లాసు చదువుతున్నాడు. చలాకీ అయిన కుర్రాడు. సంతోష్‌కుమార్ బీకాం ప్యాసైన నిరుద్యోగి. అందువల్ల ఆ యిద్దరికీ స్నేహానికి మంచి సమయం ఉండేది. చిన్నారావుకి సంతోష్‌కుమార్ తీరుబడి సమయాల్లో ఉచితంగా ప్రయివేటు చెబుతూ ఉండేవాడు.

"ఫోన్ ఎవరు చేశారు?" అనడిగాడు సంతోష్‌కుమార్ చొక్కా వేసుకుంటూ.

"శేషు అని చెప్తున్నారండి —" అన్నాడు చిన్నారావు.

"పద —" అన్నాడు సంతోష్‌కుమార్. ఇద్దరూ చిన్నారావింట్లో ఫోన్ ఉన్న గదిలోకి వెళ్ళారు. వీళ్ళను చూడగానే అక్కడే కూర్చుని పత్రిక చదువుకుంటున్న చంచల లేచి వెళ్ళిపోయింది.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను —" అన్నాడు సంతోష్‌కుమార్.

"అయ్యో — అదేం మాటండీ —" అంటూ అక్కడే ఆగిపోయింది చంచల.

చంచల ఇంటర్మీడియేట్ ఫైనలియర్ చదువుతోంది. పెద్ద అందగత్తె కాకపోయినా — అందరు పదెనిమిదేళ్ళ పాపల్లాగే ఈమె కూడా బాగుంటుంది. బట్టలు కాస్త ఖరీదైనవి కడుతుందేమో మరి కాస్త బాగుంటుంది. ఆ వయసులోని అందరు పిల్లల్లాగే — కాస్త వయసులోని మగాళ్ళని చూసినప్పుడల్లా ఆమె బుగ్గలు ఎరుపెక్కుతాయి. కళ్లు సిగ్గుపడతాయి.

సంతోష్‌కుమార్‌కి ఆ సిగ్గు ఇష్టం. అయితే వాళ్ళ పరిచయం అంతకు మాత్రమే పరిమితం.

"హలో — శేషూ — ఏమిట్రా విశేషాలు?" అన్నాడు సంతోష్‌కుమార్.

"చాలా ముఖ్యమైన విశేషమొకటుంది. నేను చెప్పిన చోటుకి వస్తావా?" అన్నాడు శేషు.

"ఇప్పుడేనా?"

"అవును. నీ కోసం ఎదురుచూస్తున్నాను —"

"ఏమిట్రా ఆ విశేషం?"

"ఫోన్‌లో చెప్పకూడదు...."

"అయితే సరే—ఎక్కడికి రమ్మంటావో చెప్పు—" అన్నాడు సంతోష్‌కుమార్.

"సుబ్బారావు పేటలో శివుడిగుడి పక్క కోమట్ల వీధిలో ఎడమపక్కనుంచి వరుసగా లెక్కపెట్టుకుంటూ ఎనిమిదో యింటికి వెళ్ళి సరాసరి లోపలకు తలుపులు తీసుకుని జొరబడు. నీకు నా దర్శనమవుతుంది" అన్నాడు శేషు.

"కర్మ—శివుడి గుడిదాకా వచ్చి ఆ దేవుణ్ణి దర్శించకుండా నీ దర్శనం చేసుకోవలసి వస్తోంది—"

"ఇప్పుడు విచారించినా—అప్పుడు సంతోషిస్తావు—"

"ఓకే—అయితే ఇప్పుడే బయల్దేరి వస్తున్నాను—" అన్నాడు సంతోష్‌కుమార్. అతను ఫోన్ పెట్టేసి చిన్నారావుకి థాంక్స్ చెప్పాడు. చంచలకు సారీ చెప్పాడు.

"అయ్యో—అదేంటండీ—" అంది చంచల. ఆమె అలా అన్నప్పుడు చాలా బాగుంటుంది. అది వినడం కోసమే సంతోష్‌కుమార్ ఆమెకు విధిగా సారీ చెప్పాడు.

సంతోష్‌కుమార్ యింటికివెళ్ళి—"అమ్మా—నేనలా బైటకు వెళ్ళివస్తాను—" అన్నాడు.

"అప్పుడే ఏడు దాటింది. ఇప్పుడెక్కడికిరా—భోంచేసి వెడుదువుగాని—" అంది తల్లి.

"లేదమ్మా — అవతల శేషు నా గురించి ఎదురు చూస్తుంటాడు—" అన్నాడు సంతోష్‌కుమార్.

"శేషు వచ్చాడా—అయితే లోపలకు వచ్చి కూర్చోమను. అతనికి నేను కాఫీ యిస్తాను. ఈలోగా నీ భోజనం

అయిపోతుంది. ఆ తర్వాత మీరిద్దరూ ఎంత సేపు తిరిగినా ఫరవాలేదు—" అంది తల్లి.

"శేషు రాలేదమ్మా—ఫోన్ చేసి చెప్పాడు—" అన్నాడు సంతోష్‌కుమార్. అతను భోజనం చేయకుండానే యింట్లోంచి బయల్దేరాడు.

## 2

సరిగ్గా ఏడున్నరకు ఎవరో సంతోష్‌కుమార్ యింటి తలుపు తట్టారు. సంతోష్‌కుమార్ వదిన సరళ వెళ్ళి తలుపుతీసి—"ఓ—నువ్వా?" అంది.

"సంతోష్ ఉన్నాడండీ—" అనడిగాడతను.

"ఇంట్లో ఉన్నట్టులేదు—" అంది సరళ.

"ఎక్కడకు వెళ్ళాడో, ఎప్పుడొస్తాడో చెప్పగలరా?" అన్నాడతను.

"ఉండు. మా అత్తయ్య నడిగొస్తాను—" అంటూ లోపలకు వెళ్ళింది సరళ. కొద్దిక్షణాల్లో ఆమె సంతోష్‌కుమార్ తల్లిని వెంటబెట్టుకుని వచ్చింది.

"ఏమిటి బాబూ—శేషూ—నిన్ను కలుసుకునేందుకే మావాడు వెళ్తే—వాణ్ని కలుసుకుందుకు నువ్విక్కడికి వచ్చావ్?" అందావిడ కంగారుగా.

"నన్ను కలుసుకుందుకు వెళ్ళాడా? అంత అర్జంటు పనేమొచ్చింది చెప్మా!" అంటూ ఆలోచనలోపడ్డాడు.

"అలాగంటావేమిటి బాబూ—నువ్వు ఫోన్ చేశావని వాడు చెప్పాడు. భోంచేసి వెళ్ళరా అని చెబితే కూడా వినకుండా హడావుడిగా వెళ్ళిపోయాడు—" అంది సంతోష్‌కుమార్ తల్లి.

"నేను ఫోన్ చేశానని చెప్పాడా? అసలీరోజు నేను

ఎవ్వరికీ ఫోన్ చెయ్యలేదే?" అన్నాడు శేషు సాలోచనగా.

సంతోష్‌కుమార్ తల్లి కంగారుపడింది.

"కంగారుపడకండి—నేను డాక్టరుగారింటికి వెళ్ళి విషయం కనుక్కువస్తాను—" అన్నాడు శేషు.

అయితే జరిగిందేమిటో శేషు వూహించుకుంటున్నాడు. సంతోష్‌కు కొందరు అలగా స్నేహితులున్నారు. అలాగా అంటే అనాగరికులని కాదు. సంతోష్ తల్లి వాళ్ళను అలగా అంటుంది. షాపుల్లో కాపుసారా తాగేవాడికీ, బారుల్లో తాగి తందానాలాడేవాళ్ళకీ తేడా లేదంటుందావిడ.

అయితే సంతోష్‌కి బార్సుకి వెళ్ళటం యిష్టమే! కానీ కంపెనీ ఉన్నప్పుడు మాత్రమే వాటికి వెడతాడు. చూచాయగా యింట్లో ఆ విషయం తెలుసు. సాధ్యమైనంతవరకూ ఆ విషయంలో అతన్ని అదుపులో ఉంచాలని చూస్తున్నారు. ఈ రోజుల్లో బార్స్‌కి వెళ్ళటం పాపనేకానీ, తప్పుకాదనీ, ఎంత చెప్పినా ఆవిడ వినదు. అందువల్ల ఎప్పుడైనా యెవరైనా బార్స్‌కి ఆహ్వానిస్తే సంతోష్ శేషు పేరు చెబుతూంటాడు.

శేషు అంటే ఆ ఇంట్లో ప్రత్యేకమైన గౌరవముంది. అతను చదువులోనేగాక ప్రవర్తనలో కూడా బుద్ధిమంతుడు. ఆతను బార్సుకి వెళ్ళడు. ఎరిగున్నవాళ్ళ చాలామంది ఇళ్ళలో అతడి గురించి చెప్పుకుంటారు. హాయిగా కాపురం చేసుకోవాలని కలలుగనే అతడి బంధువుల పిల్లలు చాలామంది అతడితో వివాహానికి ఉవ్విళ్ళూరుతున్నారు.

శేషు కూడా సంతోష్‌లాగే నిరుద్యోగి. ఉద్యోగం

వచ్చేదాకా పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యమతడికి లేదు.

తన పేరు చెప్పి సంతోష్ యెక్కడికో బార్‌కి వెళ్ళి ఉంటాడని అనుకుంటూ శేషు యెదురింటికి వెళ్ళాడు.

అతను వెళ్ళేసరికి అక్కడ చంచల ఒక్కర్తే వుంది. ఆమెను చూస్తూ అతను—"మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను—" అన్నాడు.

"అయ్యో—అదేంటండీ—" అందామె.

ఆమెకది ఊతపదం. దాని గురించి శేషు, సంతోష్ చెప్పుకుని నవ్వుకుంటుంటారు. వీలైనప్పుడల్లా ఆమెచేత ఆ పదం అనిపించటం ఆ మిత్రులకు సరదా.

"ఇందాకా మీ యింటికి సంతోష్ వచ్చాడటగా?"

"అవును—మీరు ఫోన్ చేసి పిలిస్తే వచ్చారాయన!"

"నేనేనని మీకెలా తెలుసు?"

"అయ్యో—అదేంటండీ— పేరు చెప్పారుగా?" అంది చంచల.

"యెవరో కావాలని పేరు అబద్ధం చెప్పి ఉంటారు. సంతోష్ వచ్చాక తన అసలు పేరు చెప్పి ఉంటాడు—"

"అయ్యో—అదేంటండీ—ఆయన హలో—శేషూ అనే మాట్లాడారు కూడా!" అంది చంచల.

"ఓ విషయం చెప్పమంటారా—అతనికి నేను ఫోన్ చేయలేదు—" అన్నాడు శేషు.

"అయ్యో — అదేంటండీ!" అంది చంచల ఆశ్చర్యంగా.

"అదే మరి! అతనిప్పుడెక్కడికి వెళ్ళాడో తెలియదు" అన్నాడు శేషు.

చంచల క్షణం ఆలోచించి—"ఆయనెక్కడికి వెళ్లారో నేను చెప్పగలను—" అంది.

"యెలా?" అన్నాడు శేషు ఆశ్చర్యంగా.

"నా చెవులు చాలా సున్నితం. ఫోన్‌లో అవతలి వాళ్ళేం మాట్లాడుతున్నారో రిసీవర్ లేకపోయినా చెప్పేయగలను. అందుకే నాన్నగారు నన్నీ గదిలో కూర్చోమంటూంటారు. ఆయనకు చాలా పరధ్యానం. ఫోన్‌లో అవతలివాళ్ళు మాట్లాడేది వింటూ ఆయన ఆలోచనలో పడిపోతూంటారు. అప్పుడు నేను ఆయనకు అవతలవాళ్ళు మాట్లాడింది చెబుతుంటాను. ఇందాక సంతోష్‌కుమార్ గారితో ఫోన్‌లో ఆ శేషు అన్నాయన ఏం చెప్పారో అంతా నేను విన్నాను-" అంది చంచల.

"ఫోన్ చేసింది శేషు కాదండీ- నేనే కదా శేషుని-"

"ఆయనకు ఇదే పేరులో ఇంకెవరైనా స్నేహితు లున్నారేమో—" అంది చంచల.

"పాయింటే— కాని అతని స్నేహితులంతా నాకు తెలుసు. అతడికి నేనొక్కడినే శేషుని—" అని క్షణం ఆగి— "దానికేంలెండిగానీ — ఫోన్‌లో అతడి కేమని చెప్పారో చెప్పండి—" అన్నాడు శేషు.

"సుబ్బారావు పేటలోని శివుడి గుడిపక్క కోమట్ల వీధిలో ఎడమపక్కనుంచి వరుసగా లెక్కపెట్టుకుంటూ యెనిమిదో యింటికి వెళ్ళి సరాసరి లోపలకు తలుపులు తోసుకుని చొరబడు. నీకు నా దర్శనమవుతుంది—" అంది చంచల.

"ఏమన్నారా?" అన్నాడు శేషు అప్రయత్నంగా.

"అని ఫోన్‌లో అతను సంతోష్‌కుమార్ గారికి చెప్పాడు—" అంది చంచల.

శేషు నవ్వేసి—"మీకు హిస్టరీలో నూటికి యెనభై పైగా మార్కులు వస్తాయనుకుంటాను—" అన్నాడు.

"మీకెలా తెలుసు?" అంది చంచల ఆశ్చర్యంగా.

"జ్ఞాపకశక్తి ఒక్కటే హిస్టరీలో మార్కులు తెగల్గుతుంది. అదిసరేలెండి—ఓ చిన్న తెల్లకాగితం యిస్తారా?" అనడిగాడు శేషు.

"యెందుకూ?" అంది చంచల ఆశ్చర్యంగా.

"నాకు లెక్కల్లో బాగా మార్కు లొస్తాయి కానీ హిస్టరీలో రావు. ఇప్పుడు మీరు చెప్పిన అడ్రసు అప్పుడే మర్చిపోయాను. రాసుకుంటేగానీ గుర్తుండదు—"

ఆమె అతడికి తనే రాసిచ్చింది.

"చాలా థాంక్సండీ మీ సాయం మరవలేను—" అన్నాడు శేషు అక్కణ్ణించి కదులుతూ.

"అయ్యో—అదేంటండీ—" అంది చంచల.

శేషు నవ్వుకుంటూ బయటకు వచ్చేసి—"సంతోష్‌కు థాంక్స్ చెప్పుకోవాలి. పాపం ఈ రోజు చాలాసేపు సరదాగా మాట్లాడింది—" అనుకున్నాడు.

## 3

"ఎనిమిది—" అనుకున్నాడు సంతోష్‌కుమార్. అతనా వీధిలో ఒకో యింటినే లెక్కపెట్టుకుంటూ ఎనిమిదో యింటిముందు ఆగాడు.

అది చిన్న పెంకుటిల్లు. వీధిలోకి రెండు అరుగులున్నాయి. రెండు అరుగులకీ మధ్య మెట్లున్నాయి.

సంతోష్‌కుమార్ మెట్లెక్కి తలుపు తోశాడు. వెంటనే తెరుచుకున్నాయి.

ఎదురుగా కాస్త దూరంగా ఓ కుర్చీ—అందులో ఓ వ్యక్తి కూర్చొని వున్నారు.

"నువ్వా?" అన్నాడు సంతోష్‌కుమార్ ఆశ్చర్యంగా.

"తలుపులు దగ్గరగా వేసి—ఆ కుర్చీలో కూర్చో—"

అన్నాడా వ్యక్తి. సంతోష్ అలాగే చేశాడు.

"నేను శేషు పేరు ఎందుకు చెప్పానో తెలుసా? ఇక్కడికి నిన్నెవరు పిలిచారో ఎవ్వరికీ తెలియకూడదు. నువ్వు తలుపులు తోసేవరకూ శేషునే చూస్తానను కున్నావు కదూ" అన్నాడతను.

"అవును. కానీ నీ విషయం రహస్యంగా వుండాలని ఎందుకనుకున్నావు?" అన్నాడు సంతోష్.

అతను నవ్వి—"అదొక్కటే కాదు. ఈ ఇల్లు కూడా నాదికాదు. ఇందులోకి నేను ప్రవేశించినట్లు ఎవ్వరికీ తెలియదు—" అన్నాడు.

"అదేమిటి?" అన్నాడు సంతోష్ ఆశ్చర్యంగా.

"ఈ యింట్లో అద్దెకుంటున్నతని భార్యాబిడ్డలు నెళ్ళాళ్ళగా ఊళ్ళోలేరు. అతనేమో నాలుగురోజుల క్రితం ఊరికెళ్ళాడు. వెళ్ళేముందు ఇంటి తాళం చెవులు తన స్నేహితుడికిచ్చాడు. అతడి దగ్గర నేనవి కొట్టేశాను. ఆ విషయం అతడికి తెలియదు. తెల్లవారుజామున ఇంటి తాళంతీసి ఎవరూ చూడకుండా ఇంట్లో ప్రవేశించాను", అన్నాడతను.

"ఎందుకిదంతా?" అన్నాడు సంతోష్ ఇంకా ఆశ్చర్యంనుండి తేరుకోకుండా.

"ఇంకా చెబుతా విను. ఇంట్లోంచి బయటకు వెళ్ళే టప్పుడు కూడా—దొడ్డిదారి ఒకటి చూసుకున్నాను. నేనీ యింట్లోంచి బైటకు వెళ్ళటం ఎవరికీ తెలియదు—" మళ్ళీ అన్నాడతను.

సంతోష్ కుతూహలంగా వింటూ—"ఇంకా చెప్పు!" అన్నాడు.

"చాలాకాలంగా నాకో సరదా ఉంది. అందుకే

నిన్ను పిలిపించాను—" అన్నాడతను.

"నువ్వు నన్ను సస్పెన్స్‌లో కాల్చేస్తున్నావు—" అన్నాడు సంతోష్.

అతను సంతోష్‌కుమార్‌కి తన చేతులు చూపించి—"చూశావా—యెక్కడా నా వేలిముద్రలు దొరకవు. రెండు చేతులకూ గ్లౌవ్స్ తొడుక్కున్నాను. థ్రిల్లింగా లేదూ?" అన్నాడు.

"చాలా థ్రిల్లింగ్‌గా వుంది. ఇంక విషయమేమిటో చెప్పు—" అన్నాడు సంతోష్‌కుమార్.

"సింపుల్‌గా చెప్పాలంటే నేనో హత్య చేయాలను కుంటున్నాను—" అన్నాడతను.

"హత్యా?" అన్నాడు సంతోష్ తెల్లమొహంవేసి.

"అందుకే యింత పకడ్బందీగా ఏర్పాట్లు చేసు కున్నాను—" అన్నాడతను.

"అసలు నువ్వు హత్య చేయడమెందుకు?"

"పట్టుబడని హంతకుడిగా జీవించాలన్న కోరిక తీరడానికి హత్య ఒక్కటే సాధనం నాకు" అన్నా డతను.

"అదేం కోరిక?" అన్నాడు సంతోష్.

"ఇలా అడుగుతావని నాకు తెలుసు. అందుకే నిన్ను పిలిచాను. నేనో హత్య చేస్తాను. వెళ్ళిపోతాను. తర్వాత హత్య విషయం అందరికీ తెలుస్తుంది. పోలీసులు, డిటెక్టివ్‌లు బయల్దేరతారు. పరిశోధన ప్రారంభిస్తారు. యెవ రెవరినో అనుమానిస్తారు. కేసు నడుస్తూనే ఉంటుంది. కానీ ఏమీ తేలదు. ఇవన్నీ నేను వింటూ చూస్తూ ఉంటాను. పొరపాటున కూడా ఎవ్వరూ నన్ను అనుమా నించలేరు. యెందుకంటే హత్యకు మోటివ్ లేదు కాబట్టి.

అలాంటి పరిస్థితిల్లో ఎంత థ్రిల్లింగ్ గా ఉంటుందంటావ్?" వున్నాడతను.

"నాకేం అలా అనిపించటంలేదు. తీరికూర్చుని హంత కుడివనిపించుకోవడంవల్ల ఏం సాధిస్తావ్?"

"ఉల్లిపాయ పకోడీలు రోడ్డుమీద వేసి అమ్మినవాడు నాలుగేళ్ళలో మేడలు కడుతున్నాడు. అది దోపిడీ. వేలిముద్ర వేయలేనివాడు రాజకీయ నాయకుడై మన్ని పాలిస్తున్నాడు. అది దౌర్భాగ్యం. ఇలాంటి వారి మధ్య బ్రతుకుతున్నప్పుడు ఇలాంటి థ్రిల్సేకదా మనకు ఆనందాన్ని కలిగించేవి! మనమంతా దోపిడీదారుల్నీ, వయవంచకుల్నీ సహిస్తున్నాం. అలాంటప్పుడు హంతకుల్ని మాత్రం ఎందుకు సహించలేము? సహించాలి. సహించి తీరాలి. మొదటి హత్య విజయవంతమైతే ఇలాగే ఇంకా హత్యలు చేసుకుంటూ పోతాను. అంటే నాకు హత్యల హాబీపైన ఆసక్తి ఉన్నదన్నమాట!" అన్నాడతను.

"అంతా బాగానేవుంది. ఇందులో నా ప్రమేయ మేముంది?" అన్నాడు సంతోష్‌కుమార్.

"చెప్పనా?" అంటూ అతను లేచి నిలబడ్డాడు— ఏదో రహస్యం చెప్పబోతున్నట్లుగా సంతోష్‌కుమార్ మీదకు వంగాడు. అతనేం చెప్పబోతున్నాడో అన్నట్లు సంతోష్‌కుమార్ కూడా ముందుకు వంగాడు.

సరిగ్గా అప్పుడే ?యటనుంచి తలుపులు తేరుచు కున్నాయి. ఇద్దరూ చటుక్కున వెనక్కి తిరిగారు.

"చంచల చాలా కరెక్టుగా చెప్పిందే—" అన్నాడు శేషు ఆ యిద్దర్నీ చూస్తూ.

సంతోష్ ఆశ్చర్యంగా—"అరే! నువ్విక్కడికి వచ్చేవేం?" అన్నాడు.

"డాక్టరు గారమ్మాయి చంచల ఫోన్‌లో సంభాషణ స్పష్టంగా వినగలదట. మెడ్నైట్కి వస్తున్నట్టుంటావని ఆమె చెప్పింది—" అన్నాడు శేషు. తర్వాత అక్కడున్న వ్యక్తికేసి చూసి—"ఇతనెవరు?" అన్నాడు.

"తర్వాత చెబుతాను. ముందు తలుపు గడియవేసి రండి—" అన్నాడతను.

శేషు తలుపు గడియవేసి వచ్చాడు. ఆ వ్యక్తి—"యిప్పుడు నాకు మరింత సరదాగా ఉంది. నేను చేయబోయే హత్యకు ప్రత్యక్ష సాక్షి కూడా ఉంటాడు. కానీ ఏమీ చేయలేడు—" అంటూ జేబులోంచి రివాల్వర్ తీశాడు.

శేషు, సంతోష్‌కుమార్ రివాల్వర్ వంక ఆశ్చర్యంగా చూశారు.

"ముందు నేను—ఓ చేత్తో నోరుమూసి—రెండో చేత్తో కత్తితో పొడిచి చంపాలనుకున్నాను. కానీ అందుకు వీలుపడలేదు. ఇది సైలెన్సర్ అమర్చిన రివాల్వర్. యిప్పుడు సంతోష్‌కుమార్ చస్తాడు. శేషు చూస్తాడు—" అంటూ చటుక్కున రివాల్వర్ పేల్చాడు. సంతోష్ కుమార్ దీనికి సిద్ధపడి ఉన్నట్టులేదు. అతను కేక కూడా పెట్టకుండా కుప్పలా కూలిపోయాడు.

"సంతోష్!" అంటూ శేషు అటు వెళ్ళబోయాడు.

"మిస్టర్ శేషూ! అడుగు ముందుకు వెయ్యబోయే ముందు ఒక్క క్షణం ఆలోచించు. ఈ గదిలో ఓ హత్య జరిగింది. హతుడితో నీకు పరిచయముంది. ఈ గదిలో నేను మసలినా నాకు సంబంధించిన ఆధారాలేమీ లేవు. హత్య జరుగుతుందని తెలుసు కాబట్టి నేనా జాగ్రత్తలన్నీ తీసుకున్నాను. యిప్పుడు నేను బైటకు వెళ్ళిపోతున్నాను.

కా నేపటిదాకా నువ్వు బైటకురాకు. తర్వాత నీ దారినే నువ్వు గప్ చిప్ గా వెళ్ళిపో. పోలీసులు నిన్నే అనుమానించే అవకాశాలెక్కువుంటాయి—" అన్నాడు.

"యెవరు నువ్వు?" అన్నాడు శేషు.

"నా గురించి తెలుసుకొని లాభంలేదు. నన్ను హంతకుడిగా పట్టివ్వాలని ప్రయత్నించకు. అందువల్ల మరో హత్య జరుగుతుంది తప్పితే ప్రయోజనంలేదు—" అన్నాడు ఆ వ్యక్తి. తర్వాత అతను గదిలోంచి దొడ్డిదారిన బయటకు వెళ్ళిపోయాడు.

శేషుకి క్షణంపాటు ఏం చేయాలో తోచలేదు. తన మిత్రుడిలో యింకా ప్రాణం ఉంటుందేమోనని అతడికి ఆశ కలిగింది. ఎట్టి పరిస్థితుల్లోనూ అతడినలా వదిలేసి పోవడం న్యాయం కాదనిపించింది. అతను తెగించి సంతోష్‌ను సమీపించి చూశాడు. మనిషిలో ఎక్కడా చలనంలేదు. శ్వాస ఆడటంలేదు. సంతోష్ చచ్చిపోయాడన్న దాంట్లో సందేహం లేదు. ఆ దుర్మార్గుడు సంతోష్‌ని నూటిగా గుండెల్లోకి కాల్చి చంపాడు.

శేషు బుర్ర చురుగ్గా పనిచేయసాగింది. తనీ యింటికి వెళుతున్నట్లు చంచలకు తెలుసు. తనిక్కడకు వచ్చిన ఆధారాలున్నాయి. పోలీసులవద్ద యెలాగూ తన పేరు బయటపడక తప్పదు. ముందుగా తనే ఈ విషయం పోలీసులకు చెప్పడం మంచిది. కానీ పోలీసులకు చెప్పే ముందు....

# 4

"నువ్వు చెప్పింది చాలా విచిత్రంగా వుంది. యెవ్వరూ నమ్మరు—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"అందుకే పోలీసులకంటె ముందుగా మీ దగ్గరకు

వచ్చాను. నేను నిరపరాధిని. నన్ను మీరే రక్షించాలి" అన్నాడు శేషు. అతడి శరీరంలో అప్పుడే సన్నని వణకు ప్రారంభమైంది.

"రాజమ్మా—ఒకసారి అంతా చదువు—" అన్నాడు వెంకన్న. అతడి అసిస్టెంట్ రాజమ్మ శేషు చెప్పినదంతా తను రాసిన నోట్సు చదివింది. వెంకన్న సీతమ్మను కూడా చదవమన్నాడు. ఆమె కూడా చదివింది. ఇద్దరి నోట్సూ ఒక్కలాగే వున్నాయి.

వెంకన్న తలపంకించి—"నేను నమ్మలేకపోతున్నాను. నువ్వేదో దాస్తున్నావు—" అన్నాడు.

"అక్షరం పొల్లుపోకుండా అంతా నిజమే చెప్పాను. నన్ను నమ్మండి—" అన్నాడు శేషు.

వెంకన్న ఫోన్ ఎత్తి పోలీసులకు హత్య గురించి చెప్పాడు. తర్వాత శేషువంక తిరిగి—"శవం పోలీసుల చేతిలో పడుతోంది. నీకై నువ్వు పోలీసుల వద్దకు వెళ్ళటం మంచిది. నేనే నిన్ను వాళ్ళ దగ్గరకు తీసుకు వెడతాను. నువ్వు చెప్పింది నిజమే అయితే నేను నిన్ను రక్షించగలుగుతాను—" అన్నాడు.

శేషు మౌనంగా తలవంచి—"హంతకుణ్ని కళ్ళారా చూశాను. యెక్కడ చూసినా గుర్తుపట్టగలను—" అన్నాడు.

తర్వాత పనులు చకచకా జరిగిపోయాయి. పోలీసులు శేషు ఇచ్చిన రిపోర్టు నోట్ చేసుకున్నారు. అతణ్ని కస్టడీలోకి తీసుకుందామనుకున్నారు. కానీ వెంకన్న హామీ పైన వదిలిపెట్టారు. వెళ్ళేముందు వెంకన్న—"హంతకుడు రెడీమేడ్‌గా వున్నాడు గదా అని ఈ శేషుని మీరీ కేసులో ఇరికించడానికి ప్రయత్నించకండి.

అతడికి నా రక్షణ వుంది. అతడు హంతకుడు కాదని నేను విశ్వసిస్తున్నాను. అదే విశ్వాసంతో మీరూ పరిశోధన ప్రారంభించండి—" అంటూ ఇన్స్పెక్టర్ని హెచ్చరించి మరీ వచ్చాడు.

సంతోష్‌కుమార్ హత్యావార్త విని తలిదండ్రులు షాక్ తినేశారు. ఇంటిల్లిపాదీ శోకసముద్రంలో మునిగి పోయారు. శేషుద్వారా జరిగింది విన్నారు. అతడితో పాటే వారింటికి వెళ్ళిన వెంకన్న—"ఇప్పుడు మీరు విచారించి లాభంలేదు. హంతకుణ్ని పట్టుకోవడంలో నాకు సాయపడండి—" అన్నాడు.

అయితే వెంకన్నకు సాయపడే ఓపిక సంతోష్ కుమార్ అన్నకు తప్ప మరెవ్వరికీ ఉన్నట్లులేదు. వెంకన్న అతణ్ని సంతోష్‌కుమార్ స్నేహితుల గురించి అడిగాడు.

"వాడి స్నేహితులకు లెక్కలేదు. ఒక్క శేషు తప్ప మిగతా వాళ్ళెవ్వరూ మంచివాళ్ళు కారు. మా యింటికి కొచ్చేది అతనొక్కడే—అతను తప్ప ఇంకెవ్వరూ మాకు సరిగ్గా తెలియరు—" అన్నాడు సంతోష్‌కుమార్ అన్న పద్మనాభం.

పనికొచ్చే సమాచారమేదీ వెంకన్నకు అక్కడ లభించలేదు. అతను శేషుని తీసుకొని మారు వేషంలో వరుసగా నాలుగు రోజులు బార్‌కి వెళ్ళాడు. సంతోష్ కుమార్ వెళ్ళే బార్ ఆ ఊళ్ళో అదొక్కటే!

నాలుగో రోజున శేషు—దూరంగా బీరు తాగుతున్న ఓ వ్యక్తిని చూపించి—"అతనే హంతకుడు—" అన్నాడు.

వెంకన్న ఆశ్చర్యపడి ఓసారి ఆ వ్యక్తివంకా శేషు వంకా మార్చి మార్చి చూశాడు. శేషు కళ్ళు ఆనందంతో

మెరుస్తున్నాయి. ఆ వ్యక్తి వెంకన్నకు అపరిచితుడు కాదు. అతడు ప్రభాకరం. వెంకన్నకు స్నేహితుడి తమ్ముడతను. వెంకన్న స్నేహితుడు జనార్దనం చాలా పర్యాయాలు తన తమ్ముడు ప్రభాకరం గురించి చెప్పాడు.

ప్రభాకరం బుద్ధిమంతుడు. కానీ చిల్లర తిరుగుళ్ళున్నాయి. చెడు సావాసాలు కూడా వున్నాయి. మనిషికి డబ్బు పిచ్చి వుంది. డబ్బుకోసం ఏమైనా చేయాలనీ, ఎలాగో అలా చాలా డబ్బు సంపాదించాలనీ కలలు కంటున్నాడు. అతడు గ్రాడ్యుయేటు. నిరుద్యోగి. అన్నకు భారంగా వున్నాడు.

అతణ్ని బుద్ధిమంతుడని ఎందుకనాలంటే—అతను అన్నా వదినలను గౌరవిస్తాడు. అన్న యెదురుగా సిగరెట్టయినా తాగడు. తను సంపాదించేదాంతో అన్నా వదినెలను సుఖపెట్టాలని కూడా మనస్ఫూర్తిగా అనుకుంటున్నాడు. ఒకరోజు పేకాటలో రెండువందలు నెగ్గి వదినకు చీర కొన్నాడు. ఆ విషయం తెలిసినపుడు జనార్దనం చాలా బెంగపడ్డాడు. పేకాటలో రెండువందలు ఓ రోజు నెగ్గాడంటే చాలా రోజులు అంతలేసి మొత్తాలు పోగొట్టుకుంటూ కూడా ఉండాలిగదా—వాడికా డబ్బు ఎలా వస్తోంది?

వెంకన్నకు ప్రభాకరం గురించి అంతా గుర్తుకొచ్చింది.

"బాగా చూడు. ఆ గళ్ళ చొక్కా అతణ్ని గురించేగా నువ్వు చెబుతున్నావు?" అన్నాడు వెంకన్న.

"అవును—" అన్నాడు శేషు.

వెంకన్న అతణ్ని బాగా గుర్తుపెట్టుకుని—"సరే—నువ్వెళ్ళు—నా పని నేను ప్రారంభిస్తాను—" అన్నాడు. శేషు వెళ్ళిపోయాడు.

శేషు చెప్పినంత మాత్రాన ప్రభాకరం హంతకుడై పోడు. అసలు శేషు నిజమే చెబుతున్నాడా? అన్నది మొదటి అనుమానం. శేషు నిజమే చెబుతున్నాడనుకుంటే—అది నలుగురూ నమ్ముతారా అన్నది రెండవ అనుమానం.

ఒక హత్యలో శేషు అనుమానితుడు. హంతకుడి పక్కనే అతడున్నాడన్న ఆధారాలున్నాయి. కానీ ఆ హత్య తను చేయలేదనీ ప్రభాకరం చేశాడనీ శేషు అంటున్నాడు. ప్రభాకరం హత్యాస్థలంలో ఉన్నాడన్న ఆధారం కూడా ఏమీ లేదు. అసలీ ప్రభాకరానికీ సంతోష్‌కుమార్‌కీ సంబంధమెలా ఏర్పడిందో తెలుసుకోవాలి.

వెంకన్న చకచకా నడుచుకుంటూ ప్రభాకరాన్ని సమీపించి—"హలో!" అన్నాడు.

"హాయ్—" అన్నాడు ప్రభాకరం.

"నీతో అర్జంటుగా మాట్లాడాలి. బయటకువస్తావా?" అన్నాడు వెంకన్న.

"ఏం మాట్లాడతావ్?" అన్నాడు ప్రభాకరం.

"డబ్బు. నీకు పదివేల రూపాయలు లాభించే బేరం-" అన్నాడు వెంకన్న.

ప్రభాకరం వెంటనే వెంకన్ననుసరించాడు. ఇద్దరూ కలిసి ఓ పార్కులో దూరారు.

"నాక్కావలసింది సూటిగా చెబుతాను. నువ్వో మనిషిని హత్యచేసి పెట్టాలి. అడ్వాన్సు అయిదువేలు—"

ప్రభాకరం ఆశ్చర్యంగా వెంకన్నవంక చూసి— "నువ్వెవరితో మాట్లాడుతున్నావో? నేను కిరాయి హంతకుణ్ని కాను. హత్యలంటేనే భయపడే సామాన్యుణ్ణి.

అయినా నేను హత్యలు చేస్తానని ఎవరు చెప్పారు నీకు?" అన్నాడు.

"నా మనుషులు నగరంలో అనుక్షణం నీవంటివాళ్ళ కోసం గాలిస్తూనే ఉంటారు. ఎంతో తెలివిగా నువ్వు చేసిన ఓ హత్య వాళ్ళ కళ్ళబడింది. నాకు సందేశం అందింది—" అన్నాడు వెంకన్న.

"అయితే నీకో సలహా. నువ్వు నీ మనుషుల్ని నమ్మకు. నాలాంటి వాళ్ళను నమ్ముకుంటేనే కొంత ప్రయోజనం. డబ్బు ఖర్చు లేకుండానే నేను నీకో సాయం చేయగలను-" అన్నాడు ప్రభాకరం.

వెంకన్న ఆత్రుతగా—"ఏమిటో చెప్పు—" అన్నాడు.

"ఇటీవల ఎంతో తెలివిగా హత్యచేసిన ఒక మనిషి పేరు, చిరునామా కూడా నాకు తెలుసు. కావాలంటే ఆ వివరాలిస్తాను. వెళ్ళి నీ అదృష్టం ప్రయత్నించుకో—" అన్నాడు ప్రభాకరం.

వెంకన్న ఆత్రుతగా నోట్ బుక్, పెన్ పట్టుకున్నాడు.

ప్రభాకరం శేషు వివరాలిచ్చాడు.

## 5

రెండు రోజులు నీడలా వెన్నంటి ప్రభాకరం గురించి వెంకన్న కొన్ని వివరాలు తెలుసుకున్నాడు.

అతను ఉదయం పదింటికి ఇల్లు వదిలి మళ్ళీ ఏ అర్ధరాత్రో ఇల్లు చేరుకుంటాడు. లక్షాధికారి బంగారయ్య ఇంట్లో అతను చాలాఎక్కువసేపు ఉంటాడు. బంగారయ్య కూతురు కనకంతో అతను కాస్త చనువుగా ఉన్నట్లు వెంకన్నకు అర్థమయింది. ఆ వయసు పిల్లలమధ్య ఆ మాత్రం చనువు అపార్థాలకు దారితీయడంలో పెద్ద

సందేహం లేదు. అయితే బంగారయ్య ఈ విషయం పట్టించుకున్నట్లు లేదు.

కనకానికి తండ్రి బంగారయ్య పోలిక రాలేదు. అలాగని ఆమె దీ తల్లి పోలికా కాదు. ఒకప్పుడు బంగారయ్య ఏమీ లేనివాడనీ—జీవితంలో ప్రగతి పథాన్నధిరోహించడానికి అతడు పెట్టుబడిగా భార్య శరీరాన్ని కూడా ఉపయోగించుకున్నాడని చాలామంది చెప్పుకుంటూంటారు. అందువల్ల కనకం సౌందర్యం ఎవరికీ ఆశ్చర్యాన్ని కలిగించదు. అయితే ఆశ్చర్యం కలిగించేవల్లా ఆమె బుద్ధులు.

కనకానికి క్లబ్బులకు వెళ్ళి పేకాడ్డం సరదా. బార్స్‌కి వెళ్ళి తాగడం సరదా. మగాళ్ళతో కలిసి కాబరే డాన్సులు చూడ్డం సరదా. కానీ ఆడపిల్లకు, అందులోనూ వయసులో ఉన్నది—మీదు మిక్కిలి అందగత్తె అయినప్పుడు ఇలాంటి సరదాలు శీలాంతకం కాగలవు. ఆడదానికి శీలాంతకమంటే ప్రాణాంతకమని విజ్ఞుల అభిప్రాయం.

అలాగని కూతుర్ని కట్టిపడేయడమూ కష్టం. రహస్యంగానైనా ఆమె తాననుకున్న పని చేసివస్తుంది. అందువల్ల ఇంకా నష్టం.

బంగారయ్య బాగా ఆలోచించి ప్రభాకరాన్నెన్నుకున్నాడు. ఓ రోజున ఉద్యోగం కోసం ప్రభాకరం బంగారయ్యను చూడబోయాడు. డబ్బుకోసం అతడే పనైనా చేస్తాడని గ్రహించిన బంగారయ్య అతన్ని తన కూతురికి బాడీగార్డుగా ఎన్నుకున్నాడు.

"అది ఎక్కడికి కావాలంటే అక్కడికి తీసుకెళ్ళు. ఏం చెయ్యమంటే అది చెయ్యి. ఎంత డబ్బు ఖర్చయినా

నేను భరిస్తాను. ఎవరూ దాని వంటిమీద చెయ్యి వెయ్య కూడదు. నువ్వు కూడా చెయ్యి వేయడంమించి ముందుకు వెళ్ళకూడదు! దాని బలహీనత కనిపెట్టి దానిని వశపర్చు కున్నావో—తర్వాత సర్వేమయ్యావో ఎవరికీ తెలియ కుండా పోతావు—" అన్నాడు బంగారయ్య.

ఆ రోజునుంచీ అతను కనకానికి బాడీగార్డయ్యాడు.

వాకబుచేయగా వెంకన్నకు తెలిసిన కథ ఇది. మరి ప్రభాకరం కనకంతో ఏంచేస్తున్నాడో, ఎలా ఉంటు న్నాడో తెలుసుకోవడం కష్టం.

ప్రభాకరం చాలా తెలివైనవాడు. అతను ఎక్కడా ఎవరితోనూ హత్య గురించి మాట్లాడటంలేదు. అతడికి సంతోష్‌కుమార్ పరిచయమెలాగయిందో తెలుసుకోవటం కష్టంగా వుంది వెంకన్నకు.

బాగా ఆలోచించి ఆలోచించి నరుక్కురావాలను కున్నాడు వెంకన్న. అతడు తన అసిస్టెంటుకు కనకం గురించి వాకబు చేయమని చెప్పాడు. వాళ్ళు తమ స్నేహితురాండ్ర సహాయంతో కనకం గురించి వాకబు చేశారు. అన్నింట్లోకీ ముఖ్యమైన విశేషమేమిటంటే కనకానికి మగాళ్ళ పిచ్చి. అందమైన మగవాళ్ళ పొందు కోసం ఆమె తహతహలాడుతూంటుంది. బంగారయ్య కూతురికి బాడీగార్డుని నియమించడానికి ఇది కూడా ఓ ముఖ్యకారణం.

"అయితే కనకం మీద వల విసరాలి—" అన్నాడు వెంకన్న.

"ధర్మారావు అందుకు బాగా పనికొస్తాడు—" అంది సీతమ్మ.

ధర్మారావు సీతమ్మ బాయ్ ఫ్రెండ్స్‌లో ఒకడు. అతను చూపులకు నవమన్మథుడిలా ఉంటాడు.

ధర్మారావు ఓ రోజున క్లబ్బులో కనకాన్ని పలకరించాడు.

"హాయ్—గ్లాడ్ టూ మీట్యూ—" అంది కనకం ఆనందంగా చేయిసాచి.

ధర్మారావు ఆమె చేతిని అందుకుని గట్టిగా నలిపాడు. కనకం పరవశించింది తప్పితే బాధపడలేదు.

ధర్మారావు తన వివరాలు చెప్పి—"ఈ క్లబ్బులో కాలం వృధాచేస్తారెందుకు? సరదాగా ఎక్కడికైనా వెళ్ళి కబుర్లు చెప్పుకుందాం!" అన్నాడు.

కనకం సంతోషంగా తల వూపింది. ఈలోగా పక్కనే ఉన్న ప్రభాకరం కలగజేసుకుని—"మిస్టర్ ధర్మారావ్! ఆడపిల్లలతో సరదాగా కబుర్లాడాలనుకోవడం వంటికి మంచిదికాదు—" అన్నాడు.

"హల్లో—నువ్వెవ్వరు?" అన్నాడు ధర్మారావు ఆశ్చర్యంగా.

"మిస్ కనకానికి కావలసినవాడిని. కాబోయేవాడిని" అన్నాడు ప్రభాకరం.

"అలాగా—అయితే అయాం సారీ—" అన్నాడు ధర్మారావు. అతను కనకానికి కూడా సారీ చెప్పుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

కనకం ప్రభాకరంవంక గుర్రుగా చూసి—"నువ్వు ఏం చేశావో తెలుసా?" అంది.

"నా విద్యుక్త ధర్మం నిర్వహించాను—" అన్నాడు ప్రభాకరం తాపీగా.

"నీ విద్యుక్తధర్మం—నా మనసుకు బాధపెట్టే పనులు

చేయడమేనా?"—అంది కనకం.

"రోగంతో ఉన్నవాడికి మందు చేదుగానే వుంటుంది. అంతమాత్రాన అది చెడ్డదికాదు. నీ విషయంలో నా డ్యూటీ కూడా అంతే!" అన్నాడు ప్రభాకరం

"అతనితో కాసేపు కబుర్లు చెప్పడం తప్పా?" అంది కనకం.

"చాలామంది మగాళ్ళు మోసగాళ్ళు. అసలే నువ్వు అమాయకురాలివి. తియ్యటి మాటలతో నిన్ను మోసం చేస్తారు. ఒకసారి వాళ్ళ మాటల్లో పడిపోయావంటే ఆ తర్వాత భగవంతుడు కూడా నిన్ను రక్షించలేడు—" అన్నాడు ప్రభాకరం.

"అంటే?"

"అంటేనా? ముసలి పులి బంగారు కంకణం చూపించి ఊబిలోకి ఓ పేదవాణ్ని ఆహ్వానించి—అప్పుడు వాణ్ని హాయిగా ఆరగించిందట. నీకూ అలాంటి గతి పట్టకూడదు" అన్నాడు ప్రభాకరం.

"నాకలాంటి గతి ఎందుకు పడుతుంది? నాకు డబ్బుంది—" అంది కనకం.

"నువ్వు చెడు తిరుగుళ్ళు తిరిగావంటే—మా నాన్న నిన్ను వదిలేస్తాడు. అప్పుడు నీ దగ్గర డబ్బుండదు. మగాళ్ళంతా వేటకుక్కల్లా తరిమి సానివాడలకు తరిమివేస్తారు. అప్పుడు నీ శరీరం కుళ్ళిపోతుంది...." అని ఇంకా ఏదో అనబోతూండగా కనకం కంగారుగా—"ఇంక ఆపేసెయ్—" అంది.

"నేను చెప్పడం ఆపేస్తాను. కానీ నువ్వు నీ పద్ధతు లాపకపోతే జరిగేది అదే!" అన్నాడు ప్రభాకరం.

"నువ్వు మగాళ్ళ గురించి మరీ దారుణంగా

చెబుతావు. అంతా ఒక్కలా ఉంటారా? సంతోష్ కుమార్ కూడా అందరిలాంటి వాడేనా?" అంది కనకం చిరాగ్గా.

"సంతోష్‌కుమార్ — వాడెవరు?" అన్నాడు ప్రభాకరం.

"ఓహ్—నీకు సంతోష్‌కుమార్ తెలియదు కదూ!" అంది కనకం తడబడుతూ.

వారికి సమీపంలోనే ఉండి ఈ సంభాషణంతా వింటున్న డిటెక్టివ్ వెంకన్న చాలా ఆత్రుతపడి వెంటనే నిరుత్సాహపడ్డాడు. కనకానికి సంతోష్‌కుమార్ గురించి తెలుసు. అంటే చిన్న క్లూ దొరికింది.

ప్రభాకరం ఎక్కువగా తిరుగుతుండే కనకానికి సంతోష్ కుమార్ తెలుసు. అతడందరు మగవాళ్ళలాంటి వాడూ కాదన్నదామె. అంటే అతడి విలక్షణత్వాన్ని తెలుసుకునేటంతగా వారిద్దరికీ పరిచయం జరిగింది. కానీ సంతోష్ కుమార్ ఎవరో తనకు తెలియదని ప్రభాకరం అంటున్నాడు. ఇష్టంగానో అయిష్టంగానో కనకం కూడా ఆ విషయాన్ని అంగీకరిస్తోంది.

"ఏదో మిస్టరీ ఉంది!" అనుకున్నాడు వెంకన్న.

## 6

"ఒక్కసారి గాంధీపార్కుకి రావాలి— గేట్లోనే నీ కోసం ఎదురుచూస్తూంటాను—"

"ఎందుకు?" అంది కనకం.

"అన్నీ అక్కడే చెబుతాను—"

"అలాగే ప్రభాకరం—ఇప్పుడే బయల్దేరి వస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసింది కనకం.

అయిదు నిముషాల్లో ముస్తాబై బయల్దేరిందామె.

ప్రభాకరం బాడీగార్డుగా నియోగించబడ్డాక ఆ ఇంట్లో ఆమెపై బాగా ఆంక్షలు లేకుండా పోయాయి. బయట ఆమెకేం జరిగినా పూర్తిగా జవాబుదారీ ప్రభాకరానిది.

షెడ్లోంచి కారు తీసుకుని తనే డ్రైవ్ చేసుకుంటూ కారు గాంధీ పార్కు ముందు ఆపింది కనకం. అక్కడ గేట్లో ప్రభాకరానికి బదులు ధర్మారావు కనుల విందు చేశాడు.

"హాయ్—" అంటూ కారు దిగింది కనకం.

ధర్మారావు మౌనంగా ఆమెను విష్ చేసి లోపలకు నడిచాడు. ఇద్దరూ క్రోటన్స్ గుబురు వెనక్కు వెళ్ళి కూర్చున్నారు.

"మోసం చేశానని మీకు నాపై కోపం వచ్చిందా?" అన్నాడు ధర్మారావు.

"మగాళ్ళు ఆడాళ్ళని మోసం చేయడం మామూలే కదా—" అంది కనకం.

"కానీ నేను అందరి మగాళ్ళలాంటి వాణ్ని కాను-" అన్నాడు ధర్మారావు.

"అయితే ప్రభాకరం పేరుచెప్పి ఫోన్లో ఎందుకు పిలిచారు నన్ను?" అంది కనకం.

"మీతో మాట్లాడాలనిపించింది. అందుకు కారణం ...." అని ఆగాడు ధర్మారావు.

"నాకు తెలుసు. అందుక్కారణం నా అందం— అంతేగా...." అంది కనకం.

"కాదు. ఏమాత్రమూ కాదు. మీ ముఖంలోని అమాయకత నన్నాకర్షించడం నిజం. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నమాట నిజం. మీరంగీకరిస్తే మిమ్మల్ని పెళ్ళి

చేసుకోవాలనుకోడం నిజం—అయితే మీతో మాట్లాడా లనుకోడానికి కారణం మీ అందం కాదు—...."

"మ రేమిటి?"

"నా అలవాట్లు వేరు. నేను బార్సుకి వెళ్ళను. బీరు కూడా త్రాగను. ఒకరోజు బజార్లో మిమ్మల్ని చూశాను. అప్పుడు మీ ప్రక్కన ప్రభాకరం వున్నాడు. అతను మీతో వ్యవహరించే తీరునుబట్టి—వరుసకు ఏ బావో అయివుంటాడు అనుకున్నాను. మీ గురించి తెలుసుకోవా లనిపించింది. మిమ్మల్ని గురించి ఆఖరికి బారులో అడుగు పెట్టాను. అక్కడ....అక్కడ...." అని ఆగాడు ధర్మారావు.

"ఊఁ....అక్కడ...." అంది కనకం కుతూహలంగా.

"అక్కడ మీరు ప్రభాకరాన్ని వదిలిపెట్టి మరో యువకుడితో ఉత్సాహంగా కబుర్లు మొదలుపెట్టారు. మీ తీరు చూడగానే ఆ నూతన యువకుణ్ని మీరు ప్రేమిస్తున్నట్లు అర్థం చేసుకున్నాను. వెంటనే నా ఆశ నిరాశైపోయింది. మీ ప్రేమ చూరగొన్న ఆ అదృష్ట వంతుడి వివరాలు తెలుసుకోవాలనిపించింది. అతడి పేరు సంతోష్‌కుమార్. అవునా?" అన్నాడు ధర్మారావు.

"ఇదంతా మీరు నాకెందుకు చెబుతున్నారు?" అను మానంగా అడిగింది కనకం.

"ఆ సంతోష్‌కుమార్ ఇప్పుడు చచ్చిపోయాడు. మీ ప్రేమ పొందే అదృష్టంలేని ఆ దురదృష్టవంతుడు అన్యా యంగా ఎవరిచేతో హత్య చేయబడి అకాల మరణం పొందాడు. ఈ వార్త తెలియగానే నాకు విచారానికి బదులు సంతోషం కలిగింది. అప్పట్నించీ మిమ్మల్ని కలుసుకుందుకు ప్రయత్నిస్తూ నిన్నటికి నా కోరిక

ఈ దేర్యాన్ని కలిగాను. అయితే ప్రభాకరం నిన్న నా ఆశలన్నీ వమ్ము చేశాడు. అయితే నాలో ఆశ ఇంకా చావలేదు. అతనుండగా మీరు మాట్లాడ్డానికి భయ పడ్తున్నారనిపించింది. మీతో ఏకాంతంలో మాట్లాడి నిజం తెలుసుకోవాలనిపించింది. మీరు ఊఁ అంటే మీ నాన్నగారిని కలుసుకుంటాను. మీరు ఊఁ అంటే మీ శ్రేయోభిలాషిగా మిగిలిపోతాను"—అంటూ ధర్మారావు చనువుగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

కనకం అభ్యంతర పెట్టలేదు. ధర్మారావు మాటల నామె ఆరాధనా పూర్వకంగా వింటూ—"నాకు నిజం చెప్పటం తప్ప మరోటి చేతకాదు. ఇంతచక్కగా ఇంత వరకూ ఏ మగాడూ మాట్లాడలేదు. ఇలా మాట్లాడే మగాడు మోసగాడైతే నేంకాక—మధురమైన అతడి మాటలు వింటూ—లొంగిపోవడంలోనే ఆనందముం టుందని నాకనిపిస్తుంది—" అంది. ఆమె అతడికి మరి కాస్త దగ్గరగా జరిగింది.

ధర్మారావు ఇబ్బందిగా ముఖంపెట్టి—"మరి నువ్వు సంతోష్‌కుమార్‌ని ప్రేమించావు. ఇంత త్వరగా అతణ్ని మర్చిపోగలవా?" అన్నాడు. అతడి సంబోధన మారింది. అతడిచేయి ఆమె నడుమును తాకింది.

"వాడా?" అంది కనకం కోపంగా. ధర్మారావు స్పర్శకు పరవశంతో ఆమె కనులు మూతలుపడుతున్నాయి. "వాడొక పశువు. అహంకారి—"

ధర్మారావు ఆశ్చర్యపడి—"నువ్వు ప్రేమించిన సంతోష్‌కుమార్ గురించి నువ్వేనా యిలాగంటున్నది?" అన్నాడు.

కనకం చిరాగ్గా ముఖంపెట్టి—"వాడి సంగతి ఇప్పు

డెందుకు?" అంది.

ధర్మారావు సుతారంగా తన వేళ్ళను ఆమె నడుంపై నాట్యం చేయించాడు — "నువ్వు సంతోష్‌కుమార్‌ని ప్రేమించావని నాకు తెలుసు. అయితే ఇంత త్వరగా నువ్వు వాణ్ని మరచిపోతే— రేపు నా విషయంలోనూ అంతే జరుగుతుంది. అసలు జరిగిందేమిటో తెలియాలి కదా—"

కనకం ధర్మారావుకు వీలైనంత దగ్గరగా జరిగింది— "నేను వాడిరూపంచూసి మోసపోయాను. కానీ వాడసలు మగాడేనా అని నా అనుమానం. వాడు నాతో ప్రేమ తప్ప ఏమైనా మాట్లాడమని చెప్పాడు. తను నన్ను ప్రేమించలేదట. క్లబ్బులో పేకాడే ఆడాళ్లంటే వాడికి నచ్చదుట. తను మాత్రం క్లబ్బులకెళ్ళొచ్చు-" అందామె కసిగా.

"అంటే వాడు నిన్ను తీసిపారేశాడా?"

"ఆడదానికి అందం—కను ముక్కు తీరుకాదుట. ప్రవర్తన అట! తను బార్సుకి వెడుతూ తన ప్రియురాలు మాత్రం బార్సుకి వెళ్ళేది కాకూడదన్నాడు. తను క్లబ్బుల్లో పేకాడుతూ తన ప్రియురాలు క్లబ్బుల్లో పేకాడరాదన్నాడు. తను కాబరేలు చూడ్డానికె వెడుతూ తన ప్రియురాలు అవి చూడరాదన్నాడు. అలాంటివాణ్ని అలాంటివాణ్ని ...." కోపంతో, ఉక్రోషంతో కనకానికి మాటలు రాలేదు.

"అలాంటివాణ్ని చంపేసినా తప్పులేదు—"అన్నాడు ధర్మారావు.

"నేను అంతే చేయాలనుకున్నాను—" అంది కనకం.

"కొంపదీసి — నువ్వే వాణ్ని...." అన్నాడు

భయంగా, అనుమానంగా—ధర్మారావు.

"నేనా?" నవ్వేసింది కనకం— "నేను మగాడి చేతిలో చస్తానుకానీ మగణ్ణి చంపలేను. తాత్కాలికో ద్రేకంలో వాణ్ని చంపాలనిపించినా—తర్వాత అది మంచిపని కాదనిపించింది. అలాంటివాడు చచ్చిపోతే నాకేమిటి ప్రయోజనం? బ్రతికుంటే ఎప్పటికైనా నా ఉప యోగపడొచ్చుకదా? ఏదో రోజున మనసు మారి నన్ను ప్రేమించొచ్చుకదా—"

"అదేం మాట? ఈ రోజు నన్ను ప్రేమిస్తున్నావు—మనం పెళ్ళిచేసుకున్నామనుకో—ఆ తర్వాత కూడా ఇంకా పాతప్రేమికులను గుర్తించుకుంటావా?" అన్నాడు ధర్మారావు.

"అందులో తప్పేముంది? నేను స్వేచ్ఛా జీవిని. నా స్వేచ్ఛను అరికట్టనివాణ్నే నా భర్తగా చేసుకుంటాను. నా దగ్గర డబ్బుంది—" అంది కనకం నమ్మకంగా.

"మరైతే ఆ సంతోషకుమార్ ఎలా చచ్చాడు?"

"నాలాంటి అమాయకురాలి ఉసురూరికేపోతుందా? ఎవడో శేషుట—వాడి స్నేహితుడట. వాడికి బుద్ధిపుట్టి వాణ్ని చంపేశాడు. ఎందుకని అడక్కు—అది నాకు తెలియదు—" అంది కనకం.

"అడగను కానీ నే నేమనుకున్నానో తెలుసా? కోపంతో నువ్వు సంతోషకుమార్ని చంపమని ప్రభా కరాన్ని ఉపయోగించావేమోననుకున్నాను—" అన్నాడు ధర్మారావు.

"ప్రభాకరాన్నా?" అంది కనకం ఆశ్చర్యంగా. తర్వాత ఆమె కొద్దిక్షణాలు ఆగకుండా నవ్వి—"నా మీద చీమ పాకితే నేనే చంపుకోవాలి. చంపడమంటే

అంత భయం అతనికి!" అంది.

"అలాగా—" అన్నాడు ధర్మారావు.

"అనవసరంగా టాపిక్ మారింది. మంచి ప్రేమ కబుర్లు చెప్పు—" అంది కనకం.

7

"చాలా కష్టం మీద ఆమెను వదుల్చుకుని వచ్చాను—" అన్నాడు ధర్మారావు.

"కోత—అసలా పిల్లను బలవంతంగా ఏ హోటల్ గదికో తీసుకుపోయుంటావ్—" అంది సీతమ్మ.

"అవును మరి—నువ్వో స్తావు కదా అని అంతా అలాగే అనుకుంటావు—" అన్నాడు ధర్మారావు.

"జోక్స్ ఆపి విషయానికి రండి-" అన్నాడు వెంకన్న సీరియస్‌గా.

"సీతమ్మ ఏ అబ్బాయితోనైనా హోటల్ గదికి వెళ్ళిందన్న వాస్తవాన్ని బాస్ జోక్‌గా మార్చుకుని సంతోషిస్తున్నారు—" అంది రాజమ్మ.

వెంకన్న నవ్వలేదు — "కథ ఇప్పుడో కొలిక్కి-వచ్చింది—కొంచెం కొంచెమే విషయం తెలుస్తోంది. కాసేపు చర్చ జరగాలి—" అన్నాడు సాలోచనగా.

"మీరు మొదలుపెట్టండి—" అంది రాజమ్మ.

"కనకం బంగారయ్య కూతురు. ఆమె శీలవతికాదు. బంగారయ్య ఆమెకు బాడీగార్డుగా ప్రభాకరాన్ని నియమించాడు. ప్రభాకరం కనకాన్ని ప్రేమించి ఆమెపై ఆశలు పెంచుకున్నాడు. కనకం సంతోష్‌కుమార్ని ప్రేమించింది. సంతోష్‌కుమార్ ఆ ప్రేమను తిరస్కరించాడు. సంతోష్‌కుమార్ హత్యచెయ్యబడ్డాడు. ఆ హత్యాస్థలంలో శేషు ఒక్కడే ఉన్నట్లు ఆధారా

లున్నాయి. ప్రభాకరం సంతోష్‌కుమార్ని తన కళ్ళెదురుగానే హత్యచేసినట్లు శేషు అంటున్నాడు. ఇదీ మనకు తెలిసిన కధ. ఇంక మనం కొన్ని ప్రశ్నలకు జవాబు గురించి ఆలోచించాలి—

హత్య ఎందుకు జరిగింది?

సంతోష్‌కుమార్ కనకం ప్రేమను తిరస్కరించాడు. అలాంటప్పుడు ప్రభాకరానికి సంతోషకుమార్‌ని హత్య చేయాల్సిన అవసరమేమిటి? కనకాన్ని సంతోషపెట్టటం కోసం తీరికూర్చుని హంతకుడౌతాడా?

బంగారయ్య ప్రభాకరాన్ని ఎందుకు చేరదీశాడు? అతణ్ని తన ఇంటల్లుడిగా చేసుకునే ఉద్దేశ్యం నిజంగా ఉందా? బంగారయ్య ఈ హత్య చేయించి వుండే అవకాశముందా? ఉంటే అది ఎలాంటిది?

—ఒక్క ప్రశ్నకూ నాకు సరైన జవాబు తోచటం లేదు—" అని ఆగాడు వెంకన్న.

"నాకూ తోచటంలేదు—" అంది సీతమ్మ.

"నాకూ్కడా—" అంది రాజమ్మ.

వెంకన్న ధర్మారావువంక చూశాడు. జవాబు చెప్పడానికి అతను మొహమాటపడ్డాడు

సరిగ్గా అప్పుడే ఎదురుగా ఉన్న ఫోన్ మోగింది.

"హలో—" అన్నాడు వెంకన్న.

"నేను పద్మావతీదేవిని—" అంది అవతలి కంఠం.

వెంటనే సీతమ్మ, రాజమ్మ ఫోన్స్ కిందపెట్టేశారు.

ఎక్కణ్నించి ఫోన్‌వచ్చినా ముగ్గురూ ఒకేసారి తీసి వినటం అక్కడి రివాజు. అయితే వెంకన్నకు వంటింట్లో ఇంకో ఫోన్ కనెక్షన్ ఉంది. అతడి భార్య పద్మావతీదేవి అతడి ఆఫీసుగదిలోకి రాదు. అతడితో ఏం అవసరమున్నా

ఫోన్‌లోనే మాట్లాడుతుంది. తన భార్య దగ్గర్నుంచి ఫోన్ వచ్చినప్పుడు అసిస్టెంట్సు వినకూడదని వెంకన్న ఖచ్చితంగా చెప్పేశాడు. అయినా అప్పుడప్పుడు వాళ్ళు వింటూనే ఉంటారు. ఈ రోజు మాత్రం ధర్మారావు ఉండటంవల్లనో ఏమో — వెంకన్న చేత చెప్పించుకోకుండానే ఫోన్స్ పెట్టేశారు.

"ఏమిటి దేవీ—విశేషాలు!" అన్నాడు వెంకన్న.

"కంటింకా కాలేదు. ఎందుకో తెలుసా?" అంది పద్మావతిదేవి.

"ఒక్క పద్మావతీ చిత్తాల్ని తప్ప ఈ వెంకన్న ఈ ప్రపంచంలో ఎంతటి రహస్యాన్నైనా తెలుసుకోగలడు—"

అసిస్టెంట్సిద్దరూ ముసిముసిగా నవ్వుకున్నారు.

"అయితే చెబుతున్నాను వినండి. మీ కేసు చాలా ఆసక్తికరంగా ఉంది. కానీ దీనిగురించి మీరింతగా ఎందు కాలోచిస్తున్నారో తెలియటంలేదు—" అంది పద్మావతీదేవి.

"అంటే?"

"ఈ కేసులో ప్రభాకరం హంతకుడు. అందులో ఏమీ సందేహం లేదు. ఎటొచ్చీ అతడు హంతకుడని మీరు ఋజువు చేయలేమని భయపడుతున్నారు. అలాంటి ఋజువేదో సంపాదించాలి. హత్యకు కారణమేదో కనుక్కోవాలి. ఈ రెండూ చేయడానికి బదులు మీరు ఇతర విషయాల గురించి ఆలోచిస్తున్నారు—"

"అంటే మేము తప్పు దారిలో నడుస్తున్నామంటావా?"

"అనే అనాలి. హత్యకు కారణం అన్వేషించండి.

ఋజువు మీకు దొరక్కపోతే అప్పుడు నేను చూపిస్తాను"

వెంకన్న ఆశ్చర్యంగా—"హా మూర్ఛవచ్చుచున్నది—నా సతీమణి డిటెక్షన్ చేయుటయా?" అన్నాడు.

అవతలి ఫోన్ క్లిక్‌మన్నది.

"ఏం జరిగింది?" అన్నారు సీతమ్మ, రాజమ్మ కుతూహలంగా.

"ఈ కేసులో హంతకుడు ప్రభాకరమే ననటంలో సందేహంలేదు. హత్యకు కారణం అన్వేషించి తనకు చెబితే—హంతకుణ్ని పట్టిచ్చేస్తా తను ఇస్తుందిట—" అన్నాడు వెంకన్న.

"మేడమ్ చెప్పిందాంట్లో నిజముంది బాస్! ఎన్ని పక్కల్నుంచి వెతికినా శేషు సంతోషకుమార్‌ని చంప డానికి ఒక్క కారణం కూడా దొరకలేదు. అతడి వివ రాలన్నీ అతణ్ని బుద్ధిమంతుడిగా నిరూపిస్తున్నాయి. దాన్నిబట్టి అతడి కథనాన్ని నమ్మాలి మనం. ఆ ప్రకారం హంతకుడు ప్రభాకరం. కానీ ప్రభాకరం ఎక్కడా దొరకటంలేదు. చాలా తెలివిగా వ్యవహరిస్తున్నాడు. అతణ్ని హంతకుడని మనం నిరూపించలేకపోతే అతడికి తనపై నమ్మకం పెరిగిపోతుంది. ఇంకా హత్యలు చేసినా చెయ్యొచ్చు—" అంది రాజమ్మ.

"అన్నట్లు అతడు తమతో ఏం చెప్పాడో శేషు అన్నాడుగదా—తనే హంతకుడని తెలిసినా ఎవరూ తన జోలికి రాలేరట. ఒక విధంగా చెప్పాలంటే ఇది సవాల్. ఈ సవాల్‌ని మనం మౌనంగా స్వీకరించటమేనా లేక అతణ్ని—...." అని ఆగింది సీతమ్మ.

వెంకన్న ముఖం ఎ ర్ర బ డిం ది. అతను కాసేపు ఆలోచించి ఓ నంబరుకు ఫోన్ చేశాడు. అవతలనుంచి—

"హాలో బంగారయ్య స్పీకింగ్ —" అందో స్వరం.

"మిస్టర్ బంగారయ్య — నువ్వు ప్రభాకరంచేత సంతోషకుమార్‌ని చంపించావు. ఆ విషయం మాకు తెలిసింది. అందుక్కావలసిన ఋజువులు మా దగ్గరున్నాయి. కావాలంటే—పెద్ద పోస్టాఫీసు దగ్గర QMS పోస్టు డబ్బా దగ్గర సాయంత్రం ఆరింటికి నిలబడు. నేను నిన్ను కలుసుకుంటాను—" అన్నాడు వెంకన్న.

"సంతోషకుమార్ ఎవరో, హత్య ఏమిటో నాకు తెలియదు. నేను పోస్టు డబ్బాదగ్గరకు రాను. న్యాయానికి నిలబడే మనిషిని నేను. నీకు నామీద ఆధారాలుంటే అవి పోలీసులకు చూపించటం న్యాయం. అదే నీకు నా సలహా —" అన్నాడు బంగారయ్య. వెంకన్న చెప్పేది వినకుండా అవతల ఫోన్ పెట్టేశాడు.

"చాలా ఓల్డు ట్రిక్ వేశారు బాస్!" అంది సీతమ్మ జాలిగా.

"యూ ఆర్ రన్నింగ్ షార్టాఫ్ ఐడియాస్—" అంది రాజమ్మ.

అయినా వెంకన్న ఆశగా పోస్టు బాక్సు దగ్గర సాయంత్రం ఆరింటికి బంగారయ్య కోసం ఎదురు చూశాడు. బంగారయ్య రాలేదు. అతడి తాలూకు మనుషులెవ్వరు కూడా అతడికి కనబడలేదు.

రాత్రి పద్మావతీదేవి అతడిపై జాలిపడి — "ఇలా అయితే మీరు పరిశోధనలు ఎంతో కాలం కొనసాగించలేరు—" అంది.

"ఏమీ స్ఫురించటంలేదు దేవీ! ఒక నిరపరాధిని రక్షించటం కోసం నేనేం చేయాలో నీకైనా తెలిస్తే చెప్పు—" అన్నాడు వెంకన్న.

పద్మావతీదేవి నవ్వి—"చెవులే తప్ప కళ్ళులేని న్యాయస్థానాన్ని ప్రభాకరం మోసం చేయాలని పూనుకున్నాడు. కానీ మీకు కళ్ళున్నాయి. నిజం తెలుసుకుని మీరు న్యాయస్థానం చెవులకు ఆ నిజాన్ని చెప్పండి. ప్రభాకరం లాగే మీరూ న్యాయస్థానాన్ని మోసంచేయండి—" అంది.

"అంటే?"

పద్మావతీదేవి నవ్వింది.

# 8

"ఇన్స్పెక్టర్ రామ్మోహన్ గారేనాండీ?"

"అవును—నేనే ఇన్స్పెక్టర్ రామ్మోహన్ని—"

"ఇన్స్పెక్టర్ గారూ—నన్ను మీరు మన్నించాలి. పశ్చాత్తాపంతో నా శరీరం దహించుకుపోతోంది. మీరు పరిశోధిస్తున్న సంతోషకుమార్ హత్య చేసింది నేను. నా పేరు ప్రభాకరం. నేనెందుకు హత్య చేశానో చెబుతున్నా వినండి. బంగారయ్య కూతురు కనకాన్ని నేను ప్రేమించాను. ఆ అమ్మాయి కూడా నన్ను ప్రేమించింది. అయితే ఈలోగా సంతోషకుమార్ అనేవాడు తెలివిగా ఆమెను ట్రిక్ చేశాడు. ఆమె వాడి వలలో పడింది. వాడు తనకామె అంటే ఇష్టంలేనట్లు నటించి తన ఆకర్షణ ఇంకా పెంచుకున్నాడు.

బంగారయ్యకు చూచాయగా వాడిగురించి తెలిసింది. బాగా ఆలోచించి ఆయన తన కూతుర్ని వాడికే ఇవ్వడానికి నిర్ణయించుకున్నాడు. బంగారంలాంటి పిల్ల, బోలెడు ఆస్తి—ఆ సంతోషకుమార్ గద్దలా ఎగరేసుకోవటం నాకు నచ్చలేదు. వాడి మోసానికి నా కడుపు మండిపోయింది. అయినా వాణ్ని చంపాలని వెంటనే

అనుకోలేదు నేను. చిన్న హెచ్చరిక చేశాను. వాడు లక్ష్యపెట్టలేదు. వరుసగా ఫోన్ కాల్స్ చేశాను. లక్ష్యపెట్టలేదు.

ఆఖరికి ఓ రోజున సంతోషకుమార్ స్నేహితుడు శేషు అనేవాడి పేరుతో ఫోన్ చేసి నాక్కావలసిన చోటుకు రప్పించుకున్నాను. నా ఉనికి గురించి మూడో కంటివాడికి తెలియకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాను. అయితే హత్య జరిగే సమయానికి ఎలా వచ్చాడో అక్కడికి శేషు వచ్చాడు. నేను ఆశ్చర్యపడినా తమాయించుకొని నా దగ్గరున్న రివాల్వర్‌తో సంతోషకుమార్‌ని కాల్చిచంపి—శేషుని బెదిరించి అక్కణ్నించి పారిపోయాను.

శేషు నా గురించి పోలీసులకు చెప్పినా నమ్మరని నాకు తెలుసు. అంత పకడ్బందీగా ఏర్పాట్లు చేసుకున్నాను నేను—కానీ యిప్పుడు బంగారయ్య తన కూతుర్ని ఎలాగూ నాకివ్వడని తెలిసి మతి పోగొట్టుకున్నాను. నాకు లభించని వస్తువు కోసం నేను ఒక అమాయకుణ్ని చంపానని ఇప్పుడనిపిస్తోంది. నేను మీకు దొరుకుతానో దొరకనో చెప్పలేను. ఆ విషయం నేనింకా నిర్ణయించలేదు. నిరపరాధి అయిన శేషుని మాత్రం ముందు వదిలిపెట్టండి—"

రామ్మోహన్ ఆశ్చర్యంగా—"హలో—హలో—" అంటూండగా ఇవతలి పక్కనుంచి వెంకన్న ఫోన్ పెట్టేసి పబ్లిక్ టెలిఫోన్ బూత్ లోంచి బైటకు వచ్చాడు. ప్రభాకరం కంఠాన్ని తను చక్కగానే అనుకరించ గలిగాడు. పోలీసులిప్పుడు ప్రభాకరం గురించి అన్వేషణ ప్రారంభిస్తారు. ఈలోగా తను పద్మావతీదేవి సూచించిన

ఆధారానికి సంబంధించిన వివరాలు మరికొన్ని సేక రించాలి.

వెంకన్న బూత్ మారి మరోచోటనుంచి ఒకరిద్దరికి ఫోన్ చేశాడు. తనక్కావలసిన సమాచారం గురించి చెప్పాడు.

తర్వాత అతను ధర్మారావుకి ఫోన్ చేసి పోలీస్టేషన్ కి వెళ్ళమని చెప్పాడు. అతడి ఆదేశం ప్రకారం ధర్మారావు పోలీస్ స్టేషన్ కి వెళ్ళి ఇనస్పెక్టర్ రామ్మోహన్ ని కలుసు కున్నాడు.

"ఇనస్పెక్టర్ సాబ్! మరో హత్య విషయంలో ముఖ్యమైన సమాచార మందించాలని వచ్చాను—" అన్నాడు ధర్మారావు.

"ఏమిటది?" అన్నాడు రామ్మోహన్.

"సంతోష్ కుమార్ హత్యకేసులో అనుమానితుడు శేషు తప్ప మరెవ్వరూ లేరని పేపర్లో చదివాను. ఈ మధ్య నాకు కనకం అనే అమ్మాయితో పరిచయమైంది. ప్రముఖులు, ధనికులు అయిన బంగారయ్యగారి కుమార్తె ఆమె. మాటల సందర్భంలో ఆమె తనకు బాడీగార్డుగా వ్యవహరిస్తున్న ప్రభాకరం గురించి చెప్పింది. సంతోష్ కుమార్ హత్య జరిగిన రోజునించీ ప్రభాకరం ఏదోలా ఉంటున్నాడట. అప్పుడప్పుడు పిచ్చిపిచ్చిగా మాట్లాడు తున్నాడట. ఒకరోజున అతడామె చేయిపట్టుకొని— "నేను హంతకుణ్ని. నేను సంతోష్ కుమార్ని చంపాను-" అన్నాడట ఆమెతో. ఆమె భయపడిపోయింది. ఇవన్నీ ఆమె నాకు చెప్పింది. కానీ పోలీసులముందు చెబుతుందో చెప్పదో తెలియదు.

నిన్నటి దినం అతడా మెతో—"లాభం లేదు. పోలీసులకు నేను హంతకుడన్న నిజం చెప్పేస్తేగానీ నాకు మనశ్శాంతి ఉండదు. ఆ పని చేసేయాలి—" అన్నాడట. ఈ సమాచారం నాదాకా రాగానే నేనింక ఆగలేక పోయాను. వెంటనే ఈ హత్యకేసు పరిశోధిస్తున్న మీకు మొత్తం సమాచారం అందజేయాలనిపించింది. ఈ సమాచారాన్ని మీరు క్లూగా మాత్రమే తీసుకుని హంతకుణ్ని పట్టుకోండి. ఎంతో అవసరమైతే తప్ప మా పేర్లు బయటకు రానివ్వవద్దు—" అన్నాడు ధర్మారావు.

"చాలా చిత్రంగా ఉంది. శేషు తప్ప మరో ఆధారం లేని ఈ కేసులో హంతకుడు తనంతట తానే పట్టుబడటం చాలా ఆశ్చర్యంగా ఉంది—" అన్నాడు ఇనస్పెక్టర్ రామ్మోహన్.

ధర్మారావు వెళ్ళిపోయిన కొద్ది క్షణాలలో అక్కడికి నలుగురు కానిస్టేబుల్సూ, సబ్ ఇన్స్పెక్టర్ కృష్ణమూర్తి-ప్రభాకరాన్ని వెంటబెట్టుకొని వచ్చారు.

"వాటీజ్ దిస్ నాన్సెన్స్ ఇన్స్పెక్టర్-నే నేమిటి-సంతోష్‌కుమార్ హత్యచేశానని ఒప్పుకోవడమేమిటి? అంతా అయోమయంగా వుంది. నేను నిరపరాధిని. నాకేమీ తెలియదు-" అన్నాడు ప్రభాకరం గోల పెడుతూ.

"నీ కంఠం స్వయంగా విన్నాను. ఇప్పుడేగా అన్నీ ఒప్పుకొన్నావు. ఇంతలోనే నీ మనసు మారిందా?" అన్నాడు రామ్మోహన్ కఠినంగా.

"నే నేమీ ఒప్పుకోలేదు. నా మనసెప్పుడూ ఒక్కలాగే వుంది—" అన్నాడు ప్రభాకరం.

"సరే—ఈ రాత్రికి కస్టడీలో ఉండు. అన్నీ రేపు విచారిద్దాం—"అన్నాడు రామ్మోహన్.

"మిస్టర్ శేషూ! హంతకుణ్ని మీరు చూశానంటున్నారు. అతడెవరో మీకు తెలియదంటున్నారు. అతణ్ని మళ్ళీ చూస్తే గుర్తించగలనంటున్నారు. ఇప్పుడు మీకో అరడజను మంది మనుషుల్ని చూపిస్తాను. వారిలో హంతకుడెవరో గుర్తించగలరా?" అన్నాడు ఇన్స్పెక్టర్ రామ్మోహన్.

"వారిలో ఉంటే తప్పక గుర్తించగలను. వాడి ముఖం కళ్ళముందు ఫోటోలా ఎప్పుడూ మెదుల్తూనే ఉంటుంది నాకు—" అన్నాడు శేషు. అంతకుముందే తను ప్రభాకరాన్ని గురించి డిటెక్టివ్ వెంకన్నకు చెప్పిన విషయం అతను పోలీసులకు చెప్పలేదు.

తనముందు ప్రవేశపెట్టిన వ్యక్తుల్లో ప్రభాకరాన్ని చూసి—"అతడే హంతకుడు!" అన్నాడు శేషు.

ప్రభాకరం శేషుని చూసి తడబడ్డాడు.

శేషు ఆవేశంగా ఆరోజు జరిగినదంతా కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు.

"అబద్ధం—నాకేం తెలియదు. ఇదంతా కట్టుకథ—" అంటూ అరిచాడు ప్రభాకరం.

"మిస్టర్ ప్రభాకరం—అబద్ధాలు మాని ఇంక మీరు నిజం చెప్పాలి—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"నువ్వెవ్వరు?" అన్నాడు ప్రభాకరం.

"నా పేరు వెంకన్న. నేనో డిటెక్టివ్ను. నీ గురించి నాకు నేను కొంత ఆరా తీశాను. సంతోష్కుమార్ను నువ్వు హత్య చేసినట్లు తిరుగులేని ఆధారాలు చాలా ఉన్నాయి—" అన్నాడు వెంకన్న.

"ఏమిటవి?" అన్నాడు ప్రభాకరం అసహనంగా.

"ఏమిటూ? హత్యాయుధం...." అన్నాడు వెంకన్న.

"అది మీకు దొరికిందా?" అన్నాడు ప్రభాకరం. అతడి కళ్ళు ఏదోలాగున్నాయి.

"దొరకలేదు. కానీ అదే నిన్ను పట్టిచ్చింది!" అన్నాడు వెంకన్న.

"నన్ను పట్టివ్వడమేమిటి? నేను హంతకుణ్ని కాను-" అన్నాడు ప్రభాకరం.

"మిస్టర్ ప్రభాకరం సంతోష్‌కుమార్ రివాల్వర్‌తో హత్య చేయబడ్డాడు. హత్య జరిగినపుడు అక్కడున్న శేషుకు రివాల్వర్ దాచే సమయంలేదు. అసలతనికి రివాల్వర్ దొరికే దారిలేదు. రివాల్వర్ కారణంగానే పోలీసులు కూడా శేషును నిరపరాధిగా విశ్వసించారు. అయితే అతను చెప్పే అజ్ఞాత హంతకుడెవరు? అతడెవరో తెలుసుకునేవరకూ రివాల్వర్ సంగతి తేలదు. నీ సంగతి తేలేసరికి రివాల్వర్ విషయం గుర్తుకు వచ్చింది. బంగారయ్య దగ్గర రివాల్వర్స్ గురించి వివరాలు సంపాదించాము. లైసెన్సుడు రివాల్వర్సు ఆయనకు రెండున్నాయి. రెండాయన దగ్గర ఎందుకున్నాయో ఎలా వచ్చాయో అన్నది మనకు అప్రస్తుతం. ఆయన దగ్గర ఇప్పుడు ఒక్క రివాల్వర్ మాత్రమే ఉన్నది. రెండవది నీకిచ్చానని అంటున్నాడు. తన కూతురికి నువ్వు బాడీగార్డుగా ఉంటున్నావు. కాబట్టి ఎవరైనా బెదిరించడానికి నీ దగ్గర ఓ రివాల్వర్ ఉంటే మంచిదని ఇచ్చాట్ట. అది నువ్వు దుర్వినియోగం చేశావు. దాంతో సంతోష్ కుమార్‌ని హత్య చేశావు—" అన్నాడు వెంకన్న.

"అంతా మోసం—నాకేమీ తెలియదు—"అన్నాడు ప్రభాకరం.

"మరో ఋజువు చెప్పనా?" అన్నాడు వెంకన్న.

ప్రభాకరం ఇంకేం కథ వినాల్సొస్తుందో అన్నట్లు నిస్సహాయంగా వెంకన్నవంక చూశాను.

"నువ్వు సంతోషకుమార్‌ని బెదిరిస్తూ చేసిన ఫోన్ కాల్సన్నీ చంచల విన్నది—" అన్నాడు వెంకన్న.

"నేను సంతోషకుమార్‌ని బెదిరిస్తూ ఫోన్ కాల్స్ చేయడమేమిటి? ఆ చంచల వినడమేమిటి? అసలింతకీ చంచల అంటే ఎవరు?" అన్నాడు ప్రభాకరం.

"ఎదుటి వాళ్ళు ఫోన్‌లో మాట్లాడుకుంటే స్పష్టంగా వినగల శక్తి చంచలకున్నది. ఆమె సంతోషకుమార్ ఎదురింటి డాక్టరుగారమ్మాయి. నీనుంచి ఫోన్ కాల్స్ వస్తే ఆమె తమ్ముడు చిన్నారావు వెళ్ళి సంతోషకుమార్‌ని పిల్చుకువచ్చేవాడు. ఆమె ఎదురుగా సంతోషకుమార్ టెలిఫోన్‌లో నీ మాటలు వినేవాడు. అవన్నీ ఆమె విని ఓ పుస్తకంలో నోట్ చేసుకుంది. కనకాన్ని వదిలిపెట్టమని నువ్వతణ్ని తరచుగా హెచ్చరించటమేగాక ఆఖరికి ఓ రోజున చంపుతానని కూడా బెదిరించావు. నీ బెదిరింపు సంతోషకుమార్ లక్ష్యపెట్టలేదు. అంతే. నిజంగానే చంపేశావు—" అన్నాడు ప్రభాకరం.

"ఇదెక్కడి అన్యాయం డిటెక్టివ్ గారూ-నిజంగానే నేను నిరపరాధిని" అన్నాడు ప్రభాకరం.

"చంచల అద్భుత శక్తిని పోలీసులు కూడా పరీక్షించి ఆశ్చర్య పడ్డారు. రివాల్వర్ గురించి నువ్వు సమాధానం చెప్పుకోవలసి ఉన్నది—" అన్నాడు వెంకన్న.

"రివాల్వర్ గురించి బంగారయ్యా చెప్పింది అబద్ధం. ఆయన నాకు అది ఎన్నడూ ఇవ్వలేదు—ఆయనవద్ద రివాల్వర్ ఉంటుందని కూడా నాకు తెలియదు. రివాల్వర్

అవసరముంటుందని నాకు అనిపించలేదు ఎన్నడూ. రివాల్వర్ పేల్చటం కూడా తెలియదు నాకు—" అన్నాడు ప్రభాకరం.

"అన్నీ తెలుసు నీకు—" అంటూ వెంకన్న అరిచాడు.

"మిస్టర్ వెంకన్నా! మీరూరుకోండి. సాక్ష్యాలన్నీ బలంగా వున్నాయి. అతడిచేత నేరం ఒప్పించే పద్ధతి మాకు తెలుసు-" అన్నాడు ఇన్స్పెక్టర్ రామ్మోహన్.

వెంకన్న ప్రభాకరం కళ్ళలోకి సూటిగా చూసి—తల దించుకుని అక్కణ్ణుంచి బైటకు నడిచాడు.

# 10

"మీరు చాలా దిగులుగా ఉన్నారు—" అంది పద్మావతీదేవి.

"దిగులంటే దిగులేమరి! నీ మాట పట్టుకొని దొంగ సాక్ష్యాలు సృష్టించాను. పోలీసులే మాత్రమూ అనుమానించని ఒక వ్యక్తిపై హత్యా నేరం మోపాను. ఆ వ్యక్తి నిజంగా హత్యచేశాడన్న ఆధారం—నాకు తృప్తినిచ్చేది ఒక్కటంటే ఒక్కటి దొరికితే బాగుండునని చూశాను. ఆ ప్రభాకరం నేరం ఒప్పుకోవటంలేదు. ఎన్ని చెప్పినా, యెన్ని ఋజువులు చూపినా తనకేమీ తెలియదని గోలపెడుతున్నాడు. నేను చెప్పిన ఋజువులాధారంగా పోలీసులతణ్ని హంతకుడనుకుంటున్నారు. అదే నాకు బాధగా ఉంది. శేషు అనే మంచివాణ్ని కాపాడ్డం కోసం నేను ప్రభాకరం గొంతు అనుకరించి ఫోన్లో మాట్లాడాను. ధర్మారావు తప్పుడు రిపోర్టు ఇచ్చాడు. చంచల తప్పుడు సాక్ష్యం ఇచ్చింది...." అన్నాడు వెంకన్న ఇంకా దిగులుగానే.

"మరి బంగారయ్య రివాల్వర్ సంగతేమిటి? అది

తప్పడు సాక్ష్యం కాదుగదా—"

"తనకు దానిగురించే తెలియదంటున్నాడు ప్రభాకరం."

"హంతకుడు తెలుసునని అంటాడా—" అంది పార్వతీదేవి.

"ఏమో—దేవీ! ప్రభాకరం హంతకుడని శేషు చెబుతున్నాడు. అతను మంచివాడు. అతన్ని నమ్మాం, కానీ మనకూ్కడా ఇంకా వేరే బలమైన ఆధారాలుంటే నాకీ మానసిక క్షోభ ఉండేదికాదు—" అన్నాడు వెంకన్న.

అతను మజ్జిగా అన్నం తింటూండగా—అక్కడ టెలిఫోన్ మ్రోగింది.

"బాస్! మీగురించి ఓ మనిషి వచ్చాడు. అర్జంటుగా చూడాలంటున్నాడు—" అంది సీతమ్మ.

"యెవరతను?"

"ఏమో-మీరొచ్చేదాకా ఏమీ చెప్పనంటున్నాడు-"

వెంకన్న హడావుడిగా ఫోంచేసి తన ఆఫీసుగదిలోకి వెళ్ళి అక్కడ వ్యక్తిని చూసి—"అరే—జనార్దనం—నువ్వా?" అన్నాడు.

"అవును-నా తమ్ముణ్ని కష్టపడి అరెస్టు చేయించావటగా-" అన్నాడు జనార్దం.

"ఇందులో నా దేముంది? తప్పుచేశాడు. దొరికిపోయాడు...." అన్నాడు వెంకన్న.

"తప్పుచేసింది వాడుకాదు...."

"మరెవరు?"

"జరిగింది వింటావా?" అన్నాడు జనార్దనం—"నా తమ్ముడు క్లబ్బుల్లో తిరుగుతున్నాడని తెలిసేక నేను వాడినో కంట కనిపెడుతూ వచ్చాను. వాడు బంగారయ్య

కూతురికి బాడీగార్డుగా ఉంటున్నట్లు గ్రహించాను. అప్పుడోసారి బంగారయ్యను కలుసుకొని వాళ్ళిద్దరికీ పెళ్ళిచేస్తే బాగుంటుందని సూచించాను. ఆ విధంగా నా తమ్ముడి భవిష్యత్తు బాగుపడుతుందని నా ఊహ. బంగారయ్యా ఒప్పుకున్నట్లే కనబడ్డాడు.

"ఈలోగా సంతోషకుమార్ బెడదవచ్చింది. అతను తెలివిగా కనకాన్ని బుట్టలో వేసుకొన్నాడు. ఆమె దరి జేరాలనుకొన్నకొద్దీ తిప్పికొట్టి తనమీద ఆకర్షణ పెరిగేలా చేసుకొన్నాడు. కనకానికి అతడంటే పిచ్చి వ్యామోహం బయల్దేరింది. తండ్రికి చెప్పింది. బంగారయ్యకు నచ్చ లేదీ సంబంధం. నా తమ్ముడితో పోలిస్తే సంతోషకుమార్ కుటుంబం కాస్త గొప్పగా కనబడ్డది బంగారయ్యకు. ఆయన పిలిచి నాకు విషయం చెప్పేశాడు. నేను సంతోషకుమార్‌కు ఒకటి రెండుసార్లు ఫోన్ చేశాను. నాకు అర్థమయిందల్లా అతడికి కనకమంటే విముఖత లేదనీ-పెద్ద కట్నం గురించి ప్లాను వేస్తున్నాడనీ!

"అప్పుడే నేనో నిశ్చయానికి వచ్చాను—సంతోష్ కుమార్ నా తమ్ముడి భవిష్యత్తుకి అడ్డుగా నిలబడ్డాడు. అతడు లేకపోతే నా తమ్ముడు ఓ లక్షాధికారికి అల్లుడై సిరిసంపదులతో తులతూగుతాడు. హఠాత్తుగా నన్ను పిశాచం ఆవరించింది. కొన్నాళ్ళు జాగ్రత్తగా అన్నీ పరీక్షించి పథకంవేశాను. తమ్ముడికి తెలుసునో, తెలియదో కానీ—కనకం కూడా ఎప్పుడూ ఓ రివాల్వర్ ఉంచుకునేది. అదామె హాండ్ బ్యాగులో అడుగున ఉండేది. ఓ రోజున నేను దాన్ని కాజేశాను.

"అంతా పకడ్బందీగా పథకం వేసుకొన్నాను. నా తమ్ముడికీ నాకూ చాలా పోలికలున్నాయి. ఆ రోజు

నేను నా తమ్ముడిలా తయారై ఇల్లు వదిలిపెట్టాను. అసలు హత్య ఎవరూ చూస్తారని నేననుకోలేదు. ఆ అమ్మాయి చంచల కారణంగా అక్కడికి శేషు వచ్చి కేసులో ఇరుక్కున్నాడు. అప్పుడు నా బుర్ర మరింత చురుగ్గా పని చేసింది.

"నా జుట్టు నెరిసింది. నల్ల రంగులో అది పోయింది. నాకు మీసాలు లేవు. పెట్టుడు మీసాలు సంపాదించు కొన్నాను. గడ్డం ఏమాత్రం గీయకపోయినా తెల్లగా అసహ్యంగా ఉంటుంది. ఆ రోజు నున్నగా గడ్డం గీసాను. బాగా తెలిసినవారు తప్ప మరెవ్వరైనా నన్ను నా తమ్ముడనే అనుకొంటారు. అందుకే నా తమ్ముడిలా నటించటం కొనసాగించి హత్య పూర్తిచేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాను. శేషు ఆ తర్వాత నా తమ్ముణ్ణి చూడ గల్గటమే అరుదు. ఒకవేళ చూసినా నా తమ్ముడినుంచి అనుమానాస్పదమైన ప్రవర్తన లభించదు. ఇది అభేద్య కేసు. ఏ విధంగానూ నేరం బయటపడదన్న పూర్తి నమ్మకంతో ఉన్నాను.

"కానీ నువ్వు కేసును చేపట్టి తీగలాగి డొంకంతా కదిపావు. నేను ఎవడికోసం ఇదంతా చేశానో ఆ తమ్ముడు జైలు పాలయ్యాక, ఉరిశిక్ష పాలబడ్డాక నాకీ జీవిత మెందుకు? అనిపించింది. నేను చేసిన నేరానికి వాడు శిక్ష అనుభవించటం నా గుండెను కోసేస్తోంది. ఆ రంపపు కోత భరించలేక ఇలా వచ్చాను. హత్యకుపయోగించిన ఆయుధం—ఆ రోజు నేను వేసుకొన్న డ్రస్సు—జరిగిన విశేషాలు మొత్తం పొల్లుపోకుండా—ఆధారాలన్నీ ఇవ్వ గలను. ఆ అమాయకుణ్ణి రక్షించి—ఈ హంతకుడికి శిక్షపడేలా చేయి—"

అని అతను కూలబడిపోయాడు.

"మై గాడ్!" అనుకొన్నాడు వెంకన్న—ఇది అతడే మాత్రమూ ఊహించనిది.

"ఒక మనిషిని నమ్మి—ఓ వ్యక్తిపై కచ్చిత నేరాన్నారోపించటం ఎంతవరకూ సమంజసం?" అనుకున్నాడు వెంకన్న. జనార్దనం తన నేరాన్నొప్పుకోకపోతే—తన కారణంగా ఓ నిరపరాధి శిక్షననుభవించేవాడని అనుకోగానే అతడి వళ్ళు జలదరించింది.

— :ఐపోయింది: —

# మృత్యు క్షణాలు!

ఎమ్.వి.వి. సత్యనారాయణ

సునంద భర్తవంక చూసింది. ఆహ్లాదంగా నవ్వింది.

శివరామయ్య స్టీరింగ్ వీల్ మీద దృష్టివుంచే ఓరగా భార్యను చూశాడు. సొట్టలు పడుతున్న ఆమె బుగ్గలవంక అపురూపంగా చూస్తున్నాడు.

"కారు ఘాట్ రోడ్డు ఎక్కుతోంది. కాస్త దృష్టి అటు వుంచండి బాబూ!" అంది సునంద గారాబంగా.

"అప్సరసవి నువ్వు ప్రక్కన వుంటే ప్రమాదాలు జరగక ఏమవుతాయి?" పకపక నవ్వాడు శివరామయ్య.

"అయితే నన్ను యిక్కడే దింపెయ్యండి!"

"ఈ పరిస్థితిలో కారు ఆపినా ప్రమాదమే!"

ఆమె మనోహరంగా నవ్వింది.

"కాటేజ్ బుక్ చేయించాను. వారం రోజులవరకూ మనం విశాఖపట్నం తిరిగి వెళ్ళం! నీ హొయలతో నాకు స్వర్గం చూపిస్తావో...." కొంటెగా చూశాడు శివరామయ్య.

"పాండి బాబూ! సిగ్గులేని మాటలు!" అరచేతులతో మొహం కప్పుకొంది సునంద.

కారు నిట్టనిలువుగా వున్న కొండ ఎక్కుతోంది.

శివరామయ్య మాటలు ఆపి డ్రైవింగ్ మీదే దృష్టి నిలిపాడు.

సునంద కారులోంచి బయటకు చూస్తోంది. చుట్టూ విశాలంగా పరచుకున్న కొండలు! పచ్చటి ప్రకృతి కొండలమీదా లోయలలోనూ కనువిందుగా కనిపిస్తోంది. రకరకాల పూల మొక్కలు కొండల అంచుల్లో పెరిగి పచ్చదనంకి రంగులు అద్దుతున్నాయి. పక్షుల కిలకిలా రావాలతో బాటుగా ఎక్కడో జలపాతం దూకుతున్న చప్పుడు! లోయలలో మబ్బులు ప్రకృతితో సయ్యాట లాడుతున్నాయి.

సునందకు పరవశంగా వుంది. నగర జీవితంతో తనకి మొహం మొత్తిపోయింది. తన భర్త 'ఆకాశగంగ'కి ప్రయాణం అనగానే తాను ఎక్కడికో అనుకొంది. 'ఆకాశగంగకి' వెళ్ళే ప్రయాణం యింత మనోహరంగా వుంటుందంటే తాను ఎగిరి గంతేసి ఒప్పుకునేదే! ఆయనచేత అంతగా బ్రతిమాలించుకొనేదికాదు.

ఇంతా చూస్తే 'ఆకాశగంగ' విశాఖపట్టణానికి తొంభై మైళ్ళ దూరంలో ఉందట. భారత ప్రభుత్వపు టూరిజం శాఖ ఆకాశగంగ ప్రాంతాన్ని చక్కటి విహార ప్రాంతంగా తీర్చిదిద్దడానికి కోట్లు ఖర్చుపెట్టినట్టు భర్త చెప్పాడు. నిజమే అయుండాలి! లేకపోతే యింత కొండల మార్గంలో రోడ్డు ఎలా వేశారు?

ఆకాశగంగ ప్రాంతంలో విశాలమైన సరస్సూ, దానిలో, పడవలూ, దాని ఒడ్డున వేసవి విడిది

కుటీరాలూ....

ఊహించుకొంటేనే తన మనసు పులకరిస్తోంది. తన భుజంమీద చేయిపడి సునంద ప్రక్కకు తిరిగింది. భర్త తనవంకే ప్రేమగా చూస్తున్నాడు.

"ఘాంట్ రోడ్డు ప్రయాణమయిపోయింది! మరో అర మైలులో కాటేజెస్ ఎదురౌతాయి" అన్నాడు శివరామయ్య.

సునంద సంతోషంగా చూసింది.

"కారు ఆపారేం?" అడిగింది.

"ఒక్కసారి నువ్వు ఈ కొండలను పరవశంగా చూస్తోంటే నిన్ను నా కమెరాలో బంధించాలని...." అన్నాడు శివరామయ్య.

సునంద తటపటాయించింది. మెల్లగా కారు దిగింది. శివరామయ్య చుట్టూ చూచి చటుక్కున ఆమెను ఎత్తుకొన్నాడు.

సునంద కెవ్వుమన్నది.

ఆమె మనసు కీడు శంకిస్తోంది. నిర్మానుష్యం! ఈ ప్రదేశంలో తన భర్త తనను ఏంచేయబోతున్నాడు? తనని మధ్యలో ఎందుకు కారు దింపాడు? కొండలోయల్లోకి విసిరి పీడ వదిలించుకొంటాడా? తాను అతడికి చేసిన ద్రోహం ఏమిటి? తన భర్తకు స్త్రీలతో సంబంధాలున్నట్టు తాను చూచాయగా విన్నది. తనని అడ్డు తప్పించుకోవడానికి ఈ 'ఆకాశగంగ' ప్రయాణం ఒక మిష కాదు గదా!

"ఎందుకు సునందా అరుస్తావు? నేను నిన్ను రేప్ చేస్తోన్నట్టు?" వగరుస్తున్నాడు శివరామయ్య.

సునంద లావుపాటి స్త్రీ. ఇల్లు వదలిపెట్టని స్త్రీ

కావటంవలన కొవ్వుపట్టిన కండరాలు! సునంద సున్నగా ఏపుగా పెరిగిన అరటిచెట్టులాగా వుంది. అయినప్పటికీ కసరత్తు చేసినట్టు ఒళ్ళు నిగనిగలాడుతోంది.

"నన్ను.. నన్ను....ఏం చేయబోతున్నారు?" అడిగింది సునంద.

"స్వర్గం చూపిస్తాను" శివరామయ్య ఆమెను అందిన చోటనల్లా ముద్దులు పెట్టుకొన్నాడు. ఆమె దుస్తులు గాలికి ఎగిరిపోతున్నాయి. అవయవాలు అర్ధనగ్నంగా బయటపడుతున్నాయి.

శివరామయ్య ఆమె చెంగు నోట కరచాడు.

క్రింద ఘాట్ రోడ్‌లో వాహనం వస్తోన్న చప్పుడయింది.

సునంద అతడిని విడిపించుకొని కారువద్దకు పరుగెత్తింది.

శివరామయ్యకు నెత్తిన కుండెడు చల్లటి నీళ్ళు క్రుమ్మరించినట్టయింది. కాళ్ళు ఈడ్చుకొంటూ కారువద్దకు నడిచాడు.

సునంద రుసరుసలాడుతోంది.

శివరామయ్య కారు స్టార్టుచేశాడు.

రోడ్డు సాఫీగా వుంది. దారిప్రక్కగా విశాలమయిన బండరాళ్ళు. అల్లిబిల్లిగా పెరిగిన బఠాణీ పొదలు!

రియిర్ వ్యూ మిర్రర్‌లో వెనక్కి చూశాడు శివరామయ్య—వెనక ఓ కారు వస్తోంది. కారునిండా జనం ఉన్నారు. శివరామయ్య దీక్షగా వాళ్ళవంకే చూస్తున్నాడు.

అతడి కళ్లు మెరిశాయి.

సునంద యివేమీ పట్టించుకొనకుండా ముందుకు

చూస్తోంది. రోడ్డు వృత్తాకారంలో తిరుగుతోంది. దానికి ఆనుకొనే విశాలమైన సరస్సు వుంది.

ఇంత ఎత్తులో సహజమైన జలాశయం!

జలాశయానికి ఒక ప్రక్కగా వరుసలు వరుసలుగా కాటేజెస్. కారు పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది.

శివరామయ్యా కారు దిగాడు.

పార్కింగ్ ప్లేస్‌లో వున్న బాయ్ పరుగెత్తు కొచ్చాడు. తనవద్దనున్న లిస్టు చూశాడు. కారు నెంబర్ వంక పరిశీలనగా చూశాడు.

"శ్రీ & శ్రీమతి శివరామయ్యా" అన్నాడు వినయంగా.

శివరామయ్యా తలూపాడు.

"కాటేజ్ నెంబర్ పదహారు!" అన్నాడు అతడు తాళంచెవులు అందిస్తూ.

శివరామయ్యా సునందవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

సునంద అప్పటికే కారు దిగింది.

ఇద్దరూ కాటేజ్ పదహారు వైపు నడవసాగారు.

## 2

తలుపు తెరిచాడు శివరామయ్యా.

ఆమెను చూచి నోరావులించాడు.

లిలీ! మంచులో తడిసిన అచ్ఛమైన లిలీపువ్వులాగా వుంది.

"ఏం చేస్తోంది మీ పతివ్రత?" అడిగింది లిలీ.

"స్నానం!" అన్నాడు శివరామయ్యా గొంతు పెగల్చుకొని.

లలీని చూస్తోంటే అతనికి మాటలు కరువయ్యాయి.

లిలీ అయిదడుగులలోపు ఎత్తు వుంటుంది. సన్నగా వున్నప్పటికీ తీర్చిదిద్దిన అవయవాలు. తేనె రంగు కళ్లు,

కళ్ళచుట్టూ సన్నటిరేఖాల్లాగా కాటుక....ఒంటికి బిగుతుగా అతుక్కుపోయిన గౌనూ, గౌనులో లిలీ యవ్వనం ఎత్తులూ, మెడలోంచి దిగి ఎత్తు ప్రదేశాల మధ్య మాయమవుతోన్న స్టీల్ చెయినూ, కత్తిరించిన జాత్తూ, ఎర్రటి పెదిమలు లిలీ సొత్తులు.

"లిలీ! నీ గుండెల బరువు ఒక ఎత్తు, మిగతా శరీరం ఒక ఎత్తు...." నోరు చప్పరించాడు శివరామయ్య.

"ఆ మాట మీ పతివ్రతకి చెప్పనా?" లిలీ కొంటెగా నవ్వింది. భార్య ప్రసక్తి రాగానే శివరామయ్య చప్పబడి పోయాడు.

"అన్నట్టు నువు తిన్నగా యిక్కడికే వచ్చేశావేం?"

"ఏం భయిమా?"

"అబ్బే....మన వ్యవహారం...."

"సునందకి పరిచయం అయితే మన ఎపార్టుమెంటు మధ్య రాకపోకలు మరింత సులువవుతాయి."

"ఎలా?"

శివరామయ్య మాట ముగియకముందే బాత్ రూం తలుపు తెరుచుకొన్న చప్పుడయింది.

సునంద తల తుడుచుకుంటూ గదిలోకి వచ్చింది. గుమ్మంలో భర్తతో పాటు ఎవరో నిలబడి వుండటం చూచింది.

"ఎవరండీ బయటే నిలబెట్టి మాట్లాడుతున్నారు?" సునంద భర్తను సమీపించింది.

లిలీ పకపక నవ్వి, "గుడ్ మార్నింగ్ మేడమ్! నేను చెబుతూనే వున్నాను. మీ శ్రీమతిగారు ఏమీ అనరు. లోపలికి రానివ్వండి! అని. కాని మీవారు ఏకపత్నీ వ్రతులు! భార్యా విధేయులు!" అంది.

సునంద తెల్లబోయింది. అంతలోనే తేరుకొంది. లిలీకి గుడ్ మార్నింగ్ చెప్పింది.

"నేనూ, మా వారూ మీకు తెలుసా?" అడిగింది సునంద.

లిలీ తల అడ్డంగా త్రిప్పి, "విశాఖపట్నంలో మనం తరచు ఎదురౌతూ పోతోన్నప్పటికీ మనం పలకరించుకో లేదు. చూశారా! ఈ కొండలమీద మనం ఆత్మీయుల మయ్యాం!"

"మీది వైజాగా?"

"చూశారా, మీరుకూడా నన్ను బయటే నిలబెట్టి మాట్లాడుతున్నారు."

శివరామయ్య అంతసేపూ ఆమెనే చూస్తోన్నవాడల్లా చప్పున దారి యిచ్చాడు. సునంద నుదురు చిట్లించింది.

ఈమె ఎవరు? ఇంత కలుపుగోలుతనంగా మాట్లాడ టానికి కారణం ఏమిటి? ఈమెది నిజంగా విశాఖ పట్టణమా? ఈమెను తాను ఎక్కడా చూచినట్లులేదు. అయినా తాము యిక్కడ కాటేజ్ తీసుకున్నట్లు ఈమెకు ఎలా తెలుసు?

లిలీ గదిలోకి వచ్చింది.

"నా పేరు లిలీ.... ఈ లోకంలో లిలీ పువ్వులాగానే ఒంటరిని!" అంది సునందను పరీక్షగా చూస్తూ.

"కూర్చోండి!" సునంద కుర్చీలు చూపించింది.

లిలీ చటుక్కున కూర్చుంది.

"రిజిష్టర్లో కాటేజెస్లో దిగినవాళ్లు ఎవరా అని వెతికాను. విశాఖపట్నంనుండి వచ్చిన జంట మీరొక్కరే! శివరామయ్యగారంటే వైజాగ్లో పెద్ద బిజినెస్

మాగ్నెట్‌గా చెప్పుకోవడం విన్నాను. వారే మీరను కొంటాను!" అంది లిలీ చక్రాల్లాంటి కళ్ళు త్రిప్పి.

శివరామయ్య ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. కుర్చీలో కూలబడ్డాడు.

"మీరు విన్నది నిజమే!" అన్నాడు.

సునంద తన భర్తను కోపంగా చూస్తోంది.

పరాయి ఆడదాన్ని చూస్తే ఈయన ఎందుకలా మెలికలు తిరుగుతారు? కోపాన్ని పండ్లసందున బిగబెట్టి, "ఏమండీ బయటకు వెళ్ళి అరటిపండ్లు తీసుకురండి! లిలీ గారికి హార్లిక్స్ కలుపుతాను!" అంది.

శివరామయ్య లేచాడు.

లిలీ పకపక నవ్వింది. "వైజాగ్‌లో తప్ప బుట్టారండి! అక్కడి నేటివ్స్‌కి అతిథి సత్కారం అనే మాటే తెలియదు!"

శివరామయ్య నవ్వి బయటకు నడవబోయాడు.

"ప్లీజ్ నాకు యిప్పుడు ఏం వద్దు!" లిలీ లేచి సునంద చేతులు పట్టుకొంది.

"మీరు ఒకసారి నా కాటేజ్‌కి రండి! ప్లీజ్!" అంది.

సునంద తలూపి, "తర్వాత వస్తాను. కాటేజ్ నెంబర్ ఎంత?" అంది.

"ఈ కాటేజెస్ వరసకి అవతల చిట్టచివరది—నెంబర్ నలభై!" అంది లిలీ.

తల త్రిప్పి చూసింది లిలీ.

శివరామయ్య ఆమెవైపు దొంగ చూపులు చూస్తున్నాడు.

"బయటకు వస్తారా?" అడిగింది లిలీ.

శివరామయ్య తన భార్యవైపు చూశాడు.

సునంద అతడిని గమనించనట్టుగా నటిస్తోంది.

తన భార్యకు చెప్పి, శివరామయ్య లిలీ వెంట నడిచాడు.

గదిలోని టెలిఫోన్ గణగణలాడింది.

సునంద చిరాకుగా టెలిఫోన్ వున్న బల్లను సమీపించి రిసీవర్ ఎత్తింది.

"హలో.... ఈజిట్ కాటేజ్ నెంబర్ సిక్స్‌టీన్!" అవతల వినిపించింది.

"అవును."

"మీరెవరు మాట్లాడుతున్నారు?"

సునంద ఓపిక తెచ్చుకొని, "మీరు యెవరు?" అంది.

"శ్రేయోభిలాషిని! ప్రస్తుతానికి అంతే!"

"నేను సునందను. మావారు...."

"శివరామయ్యగారికి లిలీతో సంబంధం వున్నట్టు మీకు తెలుసా?"

"మీరు యెక్కడినుండి మాట్లాడుతున్నారు?"

"ఆకాశగంగ!"

"కాటేజ్ నుండా?"

"అది మీకు అనవసరం! మీకు కావలసిన విషయం చెప్పాను!"

"..........."

"లిలీ మీకు చెప్పినట్టు కాటేజ్ నెంబర్ నలభైలో దిగలేదు."

"మరి...."

"మీరు దిగిన కాటేజ్‌కి సరిగా వెనక!"

"వ్చ్...."

"ఇందాక ఆమెను దిగబెట్టడానికి వెళ్ళి శివరామయ్య ఆమెతో శృంగారం వెలగబెట్టుతున్నాడు తెలుసా!"

సునంద కోపంగా రిసీవర్‌లోకి చూసింది.

"ఈ కటిక నిజం మీకు కోపాన్ని కలిగిస్తోందేమో!"

"అయితే ఎందుకు చెప్పారు?"

"మీరంటే యిష్టం కాబట్టి!"

"నేను పెళ్ళయినదాన్ని!"

"మా ఆయనకో నీతి నీకో నీతి కాదు!"

"మగాడు గడ్డి కరుస్తాడు!"

"గడ్డికాదు — వెరైటీ!"

సునంద చటుక్కున ఫోన్ పెట్టేసింది.

# 3

లిలీ పకపక నవ్వుతోంది.

శివరామయ్య ఆమెవంక వింతగా చూశాడు. నగ్నంగా ఆమె శరీరం కదులుతోంది.

"నీకు మతిపోలేదుకదా! అనవసరంగా మా కాటేజ్‌కి వచ్చావు. సునందకి అనుమానం పుట్టించావ్ ...."

"నువ్వు నా వంక అలా తినెయ్యకుండా చూడవలసింది!"

"నీ అందాన్ని గాను దాచటంలేదు."

లిలీ బయటకు చూస్తోంది. కాటేజెస్ ప్రక్కనుండి కొండల మధ్యగా లోయ కనిపిస్తోంది. లిలీ కళ్ళు తళతళలాడాయి.

"మీ పతివ్రత లోయలోకి దిగుతోంది!" అంది లిలీ.

శివరామయ్య చటుక్కున లుంగీ పంచ కప్పుకొని లేచాడు.

సునంద లోయలోకి దిగుతోంది. ఆమె పమిటిచెంగు గాలికి ఎగురుతోంది.

"పద! ఆమెను వెంటాడుదాం! ఆత్మహత్య చేసు

కోటం లేదుకదా!" కంగారు పడ్డాడు శివరామయ్య.

లిలీ పకపక నవ్వింది. "ఆడదాని మన స్తత్వం మీకు అసలు వంట పట్టలేదు. ఆత్మహత్య చేసుకొనే ఆడది అంత ట్రిమ్‌గా అలంకరించుకోదు!"

"చూడు లిలీ!" అన్నాడు శివరామయ్య, ఆమె మీదకు గౌను విసిరి. ఆమె గౌను ఛాతీకి అడ్డంగా కప్పుకొని కిటికీలోంచి చూసింది.

లోయలోకి యెవరో మగాడు దిగుతున్నాడు. అతడి భుజం ఒక్కటే కనిపిస్తోంది. కాటేజ్ గోడ అడ్డం వస్తోంది.

"మీ పతివ్రత యెవరినో ఆకర్షించి తీసుకువెళ్తోంది!" అంది లిలీ.

శివరామయ్య పళ్ళు పటపట నూరాడు.

"వెధవను చంపేస్తాను!" నిప్పులు కక్కాడు శివరామయ్య.

లిలీ తన గుండెలతో అతడి వీపును రాస్తోంది.

"నువ్వు నాలో జ్వాల రేపినట్టుగా ఆమెలో మరెవరో రేపుతారు."

"ఇద్దరినీ కలిపి చంపేస్తాను!"

"పిచ్చి శివం! నీకు ఆమె శరీరంమీద మోజు లేనప్పుడు యెవరో ఆ శరీరాన్ని వాడుకొంటే నీకు యెందుకు కోపం?"

"అది నా పెళ్ళాం!"

"నన్ను కూడా జార్జి 'నా పెళ్ళాం!' అంటే...."

"లిలీ! ఈ రోజు నీకు ఏమయింది? ఆడ పక్షపాతం చూపుతున్నావు!"

"శివం! నీకు ఆమె వెనుక మూలుగుతోన్న ఆ స్త్రీ కావాలి.

అల్యూమినా ఫాక్టరీ తన పేరుమీదనుండి ఆమె నీకు బదిలీచేయాలి! అంతే! నువు ఆమెకు పెళ్ళి మొగుడివి. అంతే!"

శివరామయ్య మౌనంగా లోయలోకి చూస్తూండి పోయాడు.

సునంద మెట్లు దిగుతోంది.

మెట్లు ఆఖరయి సమతలమైన నేలవచ్చింది. సునంద మొక్కల దగ్గరకు నడిచింది. క్రింద విశాలమైన అరల్లాగా లోయ సుడులు తిరుగుతోంది. కొండ మలుపుతోబాటు పరచుకొన్న లోయ ఆ తర్వాత కనిపించటంలేదు. సునంద కళ్ళు నిశ్చలంగా చూస్తోన్నాయి.

ఆ ప్రక్కనుండి యెవరో లోయలో దిగుతున్నారు. సునంద అతడిని తదేకంగా చూస్తోంది. గడ్డిలోంచి రాళ్ళ మీదగా దిగుతున్నాడు.

కాలు జారితే....

అతడు సునందను క్షేమంగానే సమీపించాడు.

"మీ పేరు సునంద కదూ!" అడిగాడతడు.

సునంద ఆశ్చర్యంగా చూసి తలూపింది. అంతలోనే చటుక్కున గుర్తొచ్చినట్టు వెనక్కి తిరిగి లోయ పై భాగానికి చూసింది.

"మీ ఆయన యింతలో రాడు! లిలీ రానివ్వదు!" నవ్వాడు అతడు.

సునంద చురుకుగా చూసి, "మీరేనా నాకు ఫోన్ చేశారు!" అంది.

అతడు తలూపాడు.

"మావారు మీకు యెలా తెలుసు?"

"ఆరేళ్ళనుండీ తెలుసు. మీ దాంపత్య సౌఖ్యం

గురించి కూడా..."

"మా విషయంలో మీకేమిటి ఇంటరెస్టు?"

"ఐ లవ్ యూ...."

"షటప్!"

"ప్లీజ్ సునందా! నేనెవరినో నీకు తెలియకపోవచ్చు. యూనివర్సిటీలో నువు సైకాలజీ చదివే సంవత్సరమే నేను హావుస్ సర్జన్ చేస్తున్నాను. యూనివర్సిటీలో నీ అందం గురించి చెప్పుకొనేవాళ్ళు. మెడికల్ కాలేజ్ నుండి పని కట్టుకొనివచ్చి మీ లేడీస్ హాస్టల్ వద్ద కాచుకొందేవాడిని. ప్లీజ్ నిన్ను మరిచిపోలేకపోతున్నాను."

"సిగ్గులేదూ....నిన్ను....నాకు పెళ్ళయింది!"

"నీకు పెళ్ళయినా నీజిగి తగ్గలేదు...."

అతడి చెంప చెళ్ళుమంది. ఆమె చేతిలోని హాండ్ బాగ్ అటూ యిటూ వూగింది.

"చూడబోతే నీకు పిచ్చిలాగా వుంది! ఏమిటీ ప్రేలాపన!"

అతడు చటుక్కున ఆమె చెయ్యి అందిపుచ్చుకొని ముందుకు లాగాడు. సునంద ముందుకు తూలింది. అతడు ఆమెను బలంగా పెదిమలు చుంబించాడు. చకచక వెనక్కి తిరిగి లోయ పైభాగానికి ఎక్కుతున్నాడు.

సునంద విసురుగా తన పెదిమలు తుడుచుకొంది.

చెట్టుక్రింది నిస్త్రాణగా కూర్చుండిపోయింది. ఆమెకు మెదడు ఖాళీ అయిన వెండితెరలాగా వున్నట్టు అని పిస్తోంది.

తన భర్తకు తాను పనికిరాకుండా పోతోంది. తన కోసం అంగలార్చుకొనే యువకుడు 'ఆకాశగంగ'కి తనని వెంబడించుకు వచ్చాడు.

యెంతసేపు అలా కూర్చుందో ఆమెకే తెలియదు.

ఆలోచనలలోంచి తేప్పరిల్లి ఆమె లోయలోంచి బయటపడింది. కాటేజెస్‌కి వెళ్ళేదారిగాక సరస్సుకు వెళ్ళే దారి పట్టుకున్నది. విశాలమైన సరస్సు. కాటేజెస్ ఉన్నవైపు మాత్రమే సిమెంట్ బేస్ కట్టారు. బేస్‌కి ప్రక్కగా రెండు ఇనుప స్తంభాలున్నాయి. వాటిలో ఒకదానికి మోటార్ బోట్ కట్టివుంది. సరస్సులో ఒకటి తిరుగుతోంది. తక్కువ హార్స్ పవర్ వున్న మోటార్ బోట్ కావటంవలన అది మెల్లగా ప్రయాణిస్తోంది.

సునంద బోట్‌ను చూస్తూ తెల్లబోయింది.

బోట్‌ను లిలీ నడుపుతోంది.

తన భర్త శివరామయ్య డ్రైవింగ్ సీటు ప్రక్క సీట్లో కూర్చున్నాడు. ఐస్‌క్యాండీ తింటున్నాడు.

సునంద గిరుక్కున వెనక్కి తిరిగింది. పదహారో నెంబర్ కాటేజ్ ముందు ఆగింది. హేండు బాగ్‌లోంచి డూప్లికేట్ తాళంచెవి తీసి కాటేజ్ లోపలికి వెళ్ళింది.

సరిగ్గా ఆమె కోసమే అన్నట్టుగా టెలిఫోన్ మ్రోగింది.

"సునందా! ఐ లవ్ యూ!" వినిపిస్తోంది ఫోన్‌లో.

## 4

శివరామయ్య కాటేజ్ తలుపు తెరిచాడు. వెనక్కి చూశాడు.

లిలీ రోడ్డుమీద నిలబడి నవ్వుతోంది. గాలిలోకి ముద్దు విసిరి, తన కాటేజ్ వైపు నడవసాగింది.

శివరామయ్య ఆమెను అటు వెళ్ళనిచ్చి కాటేజ్ లోపలికి నడిచాడు. బట్టలు మార్చుకోబోయి తెల్ల బోయాడు.

సుంద బట్టలు దండెంమీద లేవు.

టేబులుమీద ఆమె సూట్ కేసుకూడా లేదు.

కాటేజ్ లో పిచ్చెత్తినట్టు తిరిగాడు శివరామయ్య. సునంద లేదు. యెక్కడికి వెళ్ళింది? ఆమె తన సూట్ కేసుతో వెళ్ళవలసిన పనేమిటి? శివరామయ్య బయటకు పరుగెత్తాడు. పార్కింగ్ ప్లేస్ లో కారు లేదు.

ఆ సమయానికి కారు ఘాట్ రోడ్డు దిగుతోంది.

సునంద నిదానంగా నడుపుతోంది కారు. ఘాట్ రోడ్డులో కారు నడపటం తనకి అనుభవం లేదు.... కారు స్లోప్ దిగి ప్లెయిన్ గ్రౌండుమీద అడుగు పెడుతోంది. సునంద ముందుకు చూస్తో నుదురు చిట్లించింది.

దారికి అడ్డంగా ఎవరో నిలబడివున్నారు.

సునంద పరకాయించి చూసింది.

తనని ఈ ఉదయం లోయలో కలుసుకొన్న వ్యక్తి!

సునంద అతడి దగ్గర వెళ్ళాక కారు ఆపింది.

"సునందా! నన్ను రానివ్వు! కలసి వెళ్ళిపోదాం!" అన్నాడు అతడు.

సునంద చెయ్యి చాపి ఫ్రంట్ డోర్ తెరిచింది.

అతడు లోపలకువచ్చి సునంద ప్రక్క కూర్చున్నాడు.

"ఆశ్చర్యం! నువు యింత త్వరగా బయలుదేరతావను కోలేదు!" అన్నాడు అతడు.

"ఏం?"

"కేవలం వాళ్ళిద్దరినీ మోటార్ బోటులో చూచినంత మాత్రాన ఇంతగా నువు ఇరిటేట్ అవుతావనుకోలేదు!"

సునంద పెదిమ కొరికింది.

"ఇంతకీ నువు యెవరితో చెప్పనేలేదు!"

"లంకంత వైజాగ్ లో ఒక కామేశ్వరరావును"

పకపక నవ్వాడు.

సునంద నవ్వి, "అనుకొన్నాను!" అంది.

"ఎలా?"

"ఉదయాన్నే నీ పిచ్చిచేష్ట చూసి!"

కామేశ్వరరావు గర్వంగా చూశాడు.

"లిలీ ఎవరు?"

"మా అల్యూమినా ఫాక్టరీలోనే పనిచేస్తోంది. మా వారి సెనో."

"నాకు ఒక విషయం అర్థం కావటంలేదు!"

"ఏమిటది?"

"వాళ్ళిద్దరూ ఇక్కడికి వచ్చి సుఖపడాలనుకున్నారు. పానకంలో పుడకలాగా నువ్వు ఎందుకు దప్పించినట్లు?"

"వాళ్ళ శృంగారం చూచి మురిసిపోవడానికి!"

"ఛీ.... పాడు!"

"ఆనందం అనుభవించటం ఒక ఎత్తూ, ఆ అనుభవం మరొకరు కళ్ళారా చూచి అసూయపడితే పరవశించటం మరో ఎత్తు...."

సునంద నిట్టూర్చింది.

"ఇంతకీ నువ్వు నా ప్రక్కకి తిరగటమే ఆశ్చర్యకరమైన పరిమాణం!"

"ఏం?" కొంటెగా నవ్వింది సునంద.

"చెంప దెబ్బకి ఇంకా నాకు పన్ను సలుపుతోంది."

"పళ్ళు రాలి క్రిందపడేవే!"

"మరి యెందుకు పడలేదట?"

"నీకు పళ్ళు రాలిపోతే నాకు ఏం లాభం?"

"అంతే."

సునంద నవ్వి, "నీతో నాకు విశాఖపట్నం వెళ్ళ

గానే పనివుంది!" అంది.

"నీ భర్తమీద గూఢచారి పని!"

"అవును!"

సునంద కారు వేగం పెంచింది.

"పల్లవరంలో ఆపు ఉదయంనుండి ఏమీ తినలేదు!"

"ఏం?"

"నీ ప్రేమ మత్తులోపడి...."

సునంద మాట్లాడలేదు. పల్లవరంలో కారు ఆగింది. రోడ్డు ప్రక్కగా తాటాకు పాకవుంది.

ఇద్దరూ దిగి పాకలోకి నడిచారు.

అది చిన్నసైజు హోటల్.

"రెండు పెసరట్ వుప్మా!" అరిచాడు కామేశ్వర రావు.

దూరంగా మోటారుసైకిలు వస్తోన్న చప్పుడయింది.

కామేశ్వరరావు చప్పున బయటకి వెళ్ళి చూశాడు.

శివరామయ్య మోటార్ సైకిలుమీద వస్తున్నాడు.

"సు నం దా! నా గురించి చెప్పక!" అంటూ కామేశ్వరరావు పాకకి రెండో ప్రక్కనుండి బయటకు నడిచాడు.

సునంద ఆశ్చర్యంగా చూస్తోంది.

శివరామయ్య మోటార్ సైకిలును కారు వెనకగా ఆపాడు.

## 5

లిలీ అతడి మీదకు తలగడ విసిరింది.

శివరామయ్య దాన్ని గాల్లోనే అంది పుచ్చుకున్నాడు.

లిలీ అరచేతులతో మొహాం కప్పుకుని ఏడుస్తోంది.

"లిలీ ప్లీజ్....నన్ను అర్థంచేసుకో! తప్పనిసరి పరి

సితుల్లో సునంద వెంట విశాఖపట్నం రావలసివచ్చింది!
అక్కడికె చూడు! పల్లవరంలో మోటార్ సైకిలు వుంచి
'ఆకాశగంగకి'. ఫోన్ చేసి ఆ ఫ్రెండను వచ్చి వాహనాన్ని
తీసుకువెళ్ళమని బ్రతిమలాడవలసివచ్చింది!"

"ఏం? అంత బాధ ఏం వచ్చింది?"

"ఆకాశగంగలో మనం శృతిమించి ప్రవర్తించాం!"

"దీనిలో శృతిమించటం ఏమిటి?

"ఆమె మీద నాకు ఏ మాత్రం యిష్టంలేకపోయి
నప్పటికీ నీతో అంత బహిరంగంగా తిరిగివుండకూడదు!"

"ఏం?"

"ఆమె వెనుక ఆ స్త్రీవుంది!"

"వుంటే?"

"దాన్ని ఏ అనాధశరణాలయానికో రాసిందనుకో!"

"ఎందుకు రాస్తుంది? రాయకుండా మనం చేసుకో
వచ్చును!"

"ఎలా?"

"చెబుతాను!"

శివరామయ్య ఆమెవద్ద తలవొంచి వంగాడు.

"సునందను చంపుతామని బెదిరించు!"

"ప్రమాదం! పోలీసులకు చెబుతేనో...."

"జార్జిని వుపయోగించుకొంటేనో...."

"నీ మొగుడా, ఎందుకు?"

"సునందను రేప్ చేస్తాడు! దానితో ..."

లిలీ చెంప చెళ్ మంది.

"అంత ఘోరంగా మాట్లాడక!" అరిచాడు శివ
రామయ్య.

లిలీ అతడిని ఉక్రోషంగా చూసింది.

"నేను నీకు లొంగిపోయాననే కదా, నీకు అంత లోకువ!" అంది లిలీ.

తలుపుమీద చప్పుడయింది.

"ఎవరు?" అరిచాడు శివరామయ్య.

"నేనే బ్రదర్, జార్జిని!"

శివరామయ్య విసురుగా తలుపు తెరిచాడు.

"నేను నీకు బ్రదర్ నేమిట్రా రాస్కెల్?"

జార్జి పకపక నవ్వి "నేను ఎంగిలిపడ్డ కూడు తింటున్నావు! నాకు బ్రదర్ గాకపోతే ఏమిటి?" అన్నాడు.

శివరామయ్య చేయి ఎత్తాడు.

లిలీ చప్పున పరుగెత్తి అతడి చేయి పట్టుకొంది.

## 6

"మాండు! నీ భర్త లిలీ యింట్లోంచి వస్తున్నాడు!" అన్నాడు కామేశ్వరరావు.

సునంద కోపంగా అరచింది.

"ప్లీజ్ నా భర్తగా వ్యవహరించక! పేరు పెట్టి పిలువ్!"

"అదేమిటి శివరామయ్య మొహం అలా వాడిపోయి వుంది!"

"లిలీ రానిచ్చివుండదు!"

"అదొక్కటే కారణం అయివుండదు. ఇంట్లోకి జార్జి కూడా వెళ్ళాడు!"

"అవును!"

ఇద్దరూ రోడ్డుమీదకు చూశారు.

శివరామయ్య కారు నడుపుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇళ్ళ నీడల్లోంచి ఇద్దరూ బయటకు వచ్చారు. లిలీ ఇంటివైపు అడుగులు వేశారు. ఇంటికి ప్రక్కగావున్న

కిటికీవద్దకు చేరారు.

"ఈ రోజు నన్ను నీ ప్రక్కకు చేర్చుకొన్నావు. కారణం ఏమిటి?" అడుగుతున్నాడు జార్జి.

"ఈనాడు నీమీద నాకు మోజు తిరిగింది. అంతే!"

జార్జి పకపక నవ్వాడు. "నీకు మోజు ఒక్కటే తక్కువ. డబ్బు అంటే పడిచస్తావ్! నామీద నీకు మోజు ఏమిటి?"

"సునంద తెలుసా నీకు?"

"ఎవరు—నీ ప్రియుడి పెళ్లాం! అవునా?"

"అవును!"

"ఆమెను నాకు యిస్తానంటాడా శివరాముడు నిన్ను తీసుకొని!"

"కాదు, ఆమెని రేప్ చేయాలి!"

"ఎక్కడ?"

"ఎక్కడేముంది? శివరామయ్య తన యింట్లోనే ఏర్పాటు చేస్తాడు...."

"రేప్ చేశాక?"

"నేను ఫోటోలు తీస్తాను!"

"తీసి నన్ను జెయిలుకి పంపుతావు. అటు సునంద నోరు మూసుకొని వుంటుంది. యిటు నేను ఆమెను రేప్ చేసిన నేరానికి కటకటాల వెనక్కి చేరుకొంటాను. నీకూ నీ ప్రియుడికీ అడ్డం వుండదు!"

"ఛ....ఛా....అలా ఎన్నటికీ జరగదు!" నమ్మకంగా అంటోంది లిలీ.

"రంకు నేర్చినమ్మ బొంకు నేర్చుతుంది!"

"జార్జ్! ప్లీజ్ నన్ను నమ్ము....శివరామయ్య చేత నీకు ఎంత కావలసివస్తే అంత యిప్పిస్తాను!"

"ప్చ్....అతడు ఒప్పుకోడు! ఇప్పుడే తెలిసిందికదా!"

"నేను ఒప్పిస్తాను ప్లీజ్! ఎంత కావాలి?"

"ఎంతయినా కావాలి!"

"పదివేలు!"

"నిన్న శివరామయ్యకి ధారాదత్తం చేసినందుకే పదివేలు!"

"పోనీ....ఇరవై వేలు!"

"వ్రూం!"

సునంద గుండెలు దడదడా కొట్టుకోసాగాయి. నిస్త్రాణగా కామేశ్వరరావు ఛాతీమీద వాలింది.

అతడు ఆమెను పొదివి పట్టుకొన్నాడు.

తలుపు తెరచుకొన్న చప్పుడయింది.

జార్జి రోడ్డుమీద వెళ్తున్నాడు. అతడు ఎటూ చూడటంలేదు.

## 7

బల్లమీది టెలిఫోను గణగణలాడింది. శివరామయ్య ఫోన్ ఎత్తాడు.

"శివరామయ్యగారున్నారా?" అవతలనుండి ఎవరో అడిగారు.

"నేనే. ఏం కావాలి?"

అవతల ఫోన్ పెట్టేసినట్టు క్లిక్‌మన్నది.

శివరామయ్య రిసీవర్‌లోకి కోపంగా చూశాడు.

యెవరో మగాడు! అతడికి తన పేరు యెందుకు కావలసివచ్చింది.

టేబులుమీద బెల్ నొక్కాడు.

ప్రక్కనే వున్న చిన్న గదిలోంచి లిలీ పరుగెత్తుకు వచ్చింది.

శివరామయ్య ఫోన్ వచ్చిన సంగతి చెప్పాడు.

"జార్జ్ ఫోన్ చేసి వుంటాడు!" అంది లీల.

"ఎందుకు?"

"మీరు ఇంట్లో లేకపోతే సునందను రేప్ చేయాలని!"

"లిలీ!" అరిచాడు శివరామయ్య.

లిలీ గది తలుపులవంక చూసింది. అవి యెప్పుడూ దగ్గరగా వేసివుంటాయి.

లిలీ మెల్లగా నవ్వింది. శివరామయ్యను సమీపించింది. అతడి గుండెలమీద చేయివేసి మెల్లగా రాసింది. అతడి చేయి అంది పుచ్చుకొని తన గుండెలమీద పెట్టుకొంది. చటుక్కున వంగి అతడి పెదిమలను ముద్దుపెట్టుకొంది. అతడి జుత్తులో వ్రేళ్ళు జొనిపి అప్యాయంగా నిమిరింది.

"లిలీ! నీకు యిది ధర్మంకాదు!"

"ఏం?"

"సునంద ఏ పాపం యెరగనిది!"

"యెవరో మగాడిని వలలో వేసుకు తిరుగుతోంది!"

"నిజమా?"

"అవును."

"యెవరు వాడు?"

"కామేశ్వరరావు. మన ఫాక్టరీలో ఒక గుమస్తా!"

"ఈజిట్?"

"అవును....జార్జి నిన్న వాళ్ళిద్దరినీ వెంటాడాడు!"

"అదే నిజమయితే వాడిని ఉద్యోగంలోంచి తొలగించుతాను."

"నువ్వు తొలగించినదంత మాత్రాన వాళ్ళ ప్రణయం ఆగదు!"

శివరామయ్య బల్లమీద గుద్దాడు.

# 8

సునంద వూపిరి బిగబెట్టి చూస్తోంది. తలుపుకివున్న మాజిక్ ఐ నుండి తన యింటి గేటూ, గేటు బయటిరోడ్డు కొంత భాగమూ కనిపిస్తున్నాయి. గేటు ముందునుండి జార్జి అటూ ఇటూ రెండుసార్లు తిరిగాడు.

కామేశ్వరరావు తనతో అన్నమాటలు కరెక్టు! జార్జి తనమీద అత్యాచారం చేస్తాడు. ఇంట్లో ప్రవేశించే వీలుకోసమే అతడు తన యింటిముందు పచార్లు చేస్తున్నాడు.

సునందకి నరాలు అదురుతున్నాయి.

జార్జి తన యింట్లో ప్రవేశించలేడు. అన్ని ప్రక్కలా అన్ని తలుపులకూ లోపలనుండి గొళ్ళెం పెట్టింది తాను. పట్టపగలు తలుపులు పగలగొట్టి అతడు లోపలకి రాలేడు. చప్పుడవుతుంది. ఇరుగుపొరుగు ఇళ్ళలో ఎవరో చూస్తారు!

అయినప్పటికీ తనకి ధైర్యం చాలటంలేదు!

సునంద వులిక్కిపడి గేటులోకి చూసింది.

జార్జి అటు యిటూ చూసి గేటులోంచి కాంపౌండులోకి వచ్చాడు. సిమెంట్ చప్టావదలి గడ్డిమీద నడుచుకొంటూ పోర్టికోలోకి వచ్చాడు.

తలుపు హాండిల్ మీద చెయ్యివేసి బలంగా నొక్కాడు. హాండిల్ కదలలేదు. తలపంకించాడు. ఇంటిని ఒకసారి చుట్టివచ్చాడు.

బోగన్‌విలియా మొక్క పై అంతస్తుకి ఎగప్రాకి వుండేది! అయితే దాన్ని ఎవరో తాజాగా నరికారు....

జార్జి అటూ యిటూ వున్న ఇళ్ళలోకి చూసి చటుక్కున వాటర్ పైప్ అంది పుచ్చుకున్నాడు.

అతడి చేతులు జిడ్డుగా అయాయి. ఎవరో పైపును

నూనెపూసి తడిపారు.

జార్జి నిట్టూర్చాడు.

సునంద యింట్లోనే వుంది. తనకి ఆ విషయం తెలుసు. లేకపోతే యిన్ని జాగ్రత్తలు తీసుకోదు.

తాను ఏం చేయాలి?

గేటు యెవరో తెరిచినట్టు చప్పుడు చేసింది.

కామేశ్వరరావు లోపలకు వస్తున్నాడు.

తాను కామేశ్వరరావును యెదుర్కొంటే?

అనవసరంగా అల్లరికావటం తప్ప ఫలితం వుండదు.

అసలు సునందకు యిన్ని జాగ్రత్తలు తీసుకోమని యెవరు చెప్పారు.

జార్జి ఆలోచిస్తూ యింటి వెనక్కి పరుగెత్తాడు.

# 9

సునందా అల్యూమినా ఫాక్టరీ ఆఫీసు భవనం.

భవనం గేటులోంచి శివరామయ్య కారు తోలుకొంటూ రోడ్డుమీదకు వచ్చాడు.

ఇండస్ట్రియల్ ఎస్టేట్ రోడ్డుమీద కారు పరుగెత్తు తోంది. దాన్ని దృష్టిలోంచి తప్పించుకుపోకుండా టాక్సీ దాన్ని వెంటాడుతోంది.

టాక్సీలో వెనక సీటులో సునందా కామేశ్వరరావు కూర్చున్నారు. వాళ్ళ కళ్ళు ముందు వెళ్తోన్న కారుమీదే వున్నాయి.

కారు రామ్మూర్తి పంతులు పేట రైల్వేగేటు దాటింది.

గేటు మూశారు.

టాక్సీ ఆగిపోయింది.

కామేశ్వరరావు చిరాకుగా చూశాడు. సునంద

నిట్టూర్చి సీటులో వెనక్కి వాలింది. ఆమె కళ్ళు కోపంతో యెరుపెక్కాయి.

"నువ్వు రాకపోతే నా పని ఏమయ్యేదో...." మెల్లగా గొణిగింది సునంద.

"ష్ ..." అన్నాడు కామేశ్వరరావు డ్రయివర్ వైపు వేలు కదిపి.

"రాత్రి అంతా నాకు నిద్రలేదు!" అంది సునంద ఆంగ్లంలో.

"ఏం?" అడిగాడు కామేశ్వరరావు.

ఇద్దరి గుసగుసలూ తనకి పట్టనట్టు డ్రయివర్ టాక్సీ దిగాడు.

"శివరామయ్య కలవరింతలు మొదలుపెట్టాడు. చంపేస్తానంటాడు. అంతలోనే బూతులు లంకించు కుంటాడు. నేను విడిగా మరో గదిలోకి పోయి పడు కున్నాను!"

"యెవరిని చంపుతాడు రాస్కెల్!"

"ఆ సీక్రెసం ఎవరు యెవరిని ఏం చేస్తారో...."

"ఏడిచాడు! ముందు వాడిని .." పళ్ళు పటపట లాడించాడు.

లెవెల్ క్రాసింగ్ గేటు తెరుచుకుంది.

డ్రయివర్ పరుగెత్తుకొచ్చాడు. టాక్సీ బయలుదేరింది.

"యెటు వెళ్ళాడో శివరామయ్య?" అన్నాడు కామేశ్వరరావు.

టాక్సీ రాజేశ్వరి థియేటర్ ముందునుండి పోతోంది. ఇద్దరూ రెండువైపులా చూస్తున్నారు.

ఇద్దరి కళ్ళలో నిరాశ!

"మన ఇంటికి పోదాం!" అంది సునంద.

కామేశ్వరరావు తలూపి, డ్రైవర్‌తో సునంద ఇంటి చిరునామా చెప్పాడు.

టాక్సీ ఆగింది.

"ఇంట్లోకి రా!" అంది సునంద.

ఆమె మొహం తెల్లగా పాలిపోయింది.

కామేశ్వరరావు టాక్సీని పంపేసి వచ్చాడు. ఇంటికి తాళం పెట్టి వుంది.

సునంద తాళం తెరిచింది.

ఇద్దరూ ఇంట్లోకి నడిచారు.

"సునందా! అనవసరంగా నువ్వు భయపడుతున్నావు. ఈ రాత్రికి నిన్ను నీ భర్త ఏం చేయడు? నాకు ఆ నమ్మకం వుంది!"

"నువ్వూ నాతో వుండిపో...."

"ఎలా? శివరామయ్య నన్ను చూస్తేనో...."

"ఏదో ఒక గదిలో దాస్తాను!"

అతడు నవ్వి, "కాలకృత్యాలూ, భోజనమూ, ఏదో వొక సమయంలో బయటపడతాను!" అన్నాడు.

"ఆఁ! ఒక పనిచేస్తాను. శివరామయ్యకు నిద్రమాత్రలు గ్లాసులో కలిపి దాహం ఇస్తాను!"

"దటీజ్ గుడ్! ఒక గార్డినల్ చాలు!"

పోర్టికోలో హారన్ వినిపించింది. సునంద చకచకా మెట్ల ప్రక్క గదిలోకి కామేశ్వరరావును నెట్టింది. తలుపు మూసింది. ఏమీ యెరగనట్టు లోపలి గదిలోకి వెళ్ళింది

"సునందా!" పిలిచాడు శివరామయ్య.

సునంద గదిలోంచి హాలు లోపలకు వచ్చింది. భర్త మొహంలోకి పరిశీలనగా చూసింది. అతడి మొహం మామూలుగా వుంది.

"సునందా! నన్ను నా ప్రవర్తనకు క్షమించు!"

సునంద నిర్ఘాంతపోయింది.

"నిజమే సునందా! నువు నన్ను నమ్మవ్. నేను దుష్టుడిని. నా ప్రవర్తనతో నిన్ను వుడికించాలని ప్రయత్నించాను" శివరామయ్య తన చెంపలను తానే వాయించుకొన్నాడు.

సునంద్ విడ్డూరంగా చూస్తోంది.

"మన సంసారానికి పట్టిన గ్రహణం ఈ నాటితో తొలగిపోతుందిలే!"

"యెలా?" అంది సునంద గొంతు పెగల్చుకొని.

"రేపు మనం ఇద్దరమూ ఆకాశగంగ వెళుతున్నాం!"

"యెందుకు?" పిడుగులు మీదపడినట్లుగా అదిరిపోయింది.

"మన మనసులను స్వచ్ఛంగా కడిగివేసుకోవడానికి!"

"............"

"ఇంతకాలం నా మనసు పెడదారి పట్టింది. నువ్వూ పెడదారిలో నడుస్తున్నావు. ఇద్దరమూ మనసులు విప్పి మాట్లాడుకుందాం! ఆ చల్లటి వాతావరణంలో పడవ షికారులో....మనం భౌతిక ప్రపంచాన్ని మరచి...."

"నేను రాను!"

"సునందా, ప్లీజ్!"

సునంద అరచేతులలో మొహం కప్పుకొంది.

## 10

సునంద గడియారం చూసుకొంది.

రాత్రి పదకొండయింది. ప్రక్క మంచంమీద శివరామయ్య గురకపెట్టి నిద్రపోతున్నాడు. ఆతడిని కదిపి చూసింది.

కదలలేదు. కామేశ్వరరావు ఒక మాత్ర వేయమంటే తాను రెండు మాత్రలూ వేసి అతడిని నిద్రపుచ్చింది.

మెల్లగా మంచం దిగి బయటకు నడిచింది. గది బయట గొళ్ళెం పెట్టింది. మెట్లక్రింద గదిని సమీపించింది.... తలుపు తెరిచింది.

కామేశ్వరరావు బయటికి వచ్చాడు.

ఇద్దరూ వంటగదిలోకి నడిచారు.

కామేశ్వరరావు తృప్తిగా తిన్నాడు.

హాలులోని గడియారం అరగంట కొట్టింది.

"విన్నావు గదా! ఆకాశగంగకి రేపు ప్రయాణం!" అంది సునంద.

"విన్నాను—నువు రానన్నావుగదా!"

"అన్నాను."

"ఆకాశగంగకి ప్రయాణం యెందుకు అన్నాడో తెలుసుకోవాలి!"

"ఎందుకేమిటి? అక్కడ నన్ను చంపుతాడు" సునంద గొంతు బొంగురుపోయింది.

"యెలా చంపుతాడో?"

"కారు బ్రేకులు తీస్తాడు. నేను కారుమీద ఒంటరిగా వెళ్ళవలసిన పరిస్థితులను సృష్టిస్తాడు!"

"అదీ కావచ్చును. అన్నట్టు సునందా! ఇందాక అతడు ఆఫీసునుండి తిన్నగా యింటికి రాలేదు. ఎక్కడికి వెళ్ళాడో తెలుసుకొంటే మనకి అతడి ఈ అకస్మాత్తు కార్యక్రమం గురించి తెలుస్తుంది!"

సునంద తలూపి గొళ్ళెంతీసి బెడ్‌రూంలోకి ప్రవేశించింది. శివరామయ్య ఆ సాయంకాలం వేసుకొన్న దుస్తులతో బయటికి వచ్చి తిరిగి గొళ్ళెం పెట్టింది.

ఇద్దరూ దుస్తులు వెతికారు.

షర్టు జేబులోంచి బిల్లులు బయట పడ్డాయి.

కామేశ్వరరావు వాటిని చదివాడు.

అర వైమీటర్ల కొబ్బరి తాడు, నాలుగు కేజీలచొప్పున నాలుగు ఇనుప దిమ్మలు.

"శివరామయ్యకి మతిపోయిందా?" అంది సునంద.

కామేశ్వరరావు నుదురు చిట్లించి, "మతిపోయింది అతడికి కాదు, మనకి!" అన్నాడు.

"నీ ఉద్దేశ్యం నాకు అర్థంగావటంలేదు."

"ఆకాశగంగలో వున్న సరస్సులో నిన్ను చంపి పారేస్తాడు. నీ శవం పైకి తేలకుండా నీ చేతులకి రెండు ఇనుపదిమ్మలూ, కాళ్ళకి రెండు ఇనుపదిమ్మలూ కడతాడు. నువ్వు చనిపోయినట్టు ప్రపంచానికి తెలిసే అవకాశంలేదు."

సునంద మొహం తెరిగి క్రిందపడిపోయింది.

# 11

"అదృష్టం సునందా! మనకి మరల పదహారో నెంబర్ కాటేజ్ కేటాయించారు. ఈసారి మనం కాటేజ్ వదల నక్కరలేదు" అన్నాడు శివరామయ్య తాళం తెరచి.

సునంద మాట్లాడలేదు.

నిన్న రాత్రి తానూ కామేశ్వరరావూ మాట్లాడు కున్నారు. తనకి స్పృహ తప్పింది. తనని హత్యచేయడానికి శివరామయ్య ఎటువంటి కుట్రపన్నాడో తల్చుకొంటే తన వొళ్ళు కుతకుతలాడుతోంది. తనకి స్పృహ వచ్చిన తర్వాత తానూ కామేశ్వరరావూ గారేజి షెడ్డుకివెళ్ళి ఆ కారు డిక్కీ తెరిచి చూశారు.

డిక్కీలో నాలుగు ఇనుపదిమ్మలూ, కొబ్బరీతాడుచుట్టా వున్నాయి.

ఆశ్చర్యం! ప్రపంచంలో ఇటువంటి మనుషులు కూడా వుంటారా?

శివరామయ్య మొహంలోకి చూసింది.

అతడి మొహం నిర్మలంగా వుంది. కల్మషం దాచుకున్న నైర్మల్యం!

సునంద మౌనంగా లోపలకు నడిచింది.

కామేశ్వరరావు తనకి పూర్తి ధైర్యం చెప్పకపోతే ఈ ప్రయాణానికి ఒప్పుకొనేదికాదు. అతడూ తనని వెంబడించుకొంటూ వచ్చాడు. మరో రెండు గంటలలో ఏదో ఒక కాటేజీలో దిగుతాడు. మారు వేషంలో వస్తాడు.

శివరామయ్య గుస్తులు మార్చుకొని సునందవైపు తిరిగాడు.

"లంచ్ ఏర్పాటు చేస్తాను. రూఫ్ గార్డెన్‌లో.... తయారవు" అంటూ బయటికి నడిచాడు.

సునంద స్నానంచేసి ముస్తాబయింది.

అద్దంలో తనని తాను చూసుకొంది.

తాను ఎంతగా అలంకరించుకొన్నప్పటికీ తన మొహంలో ప్రేతకళ పడివుంది. ప్రాణం మీద తీపి అటువంటిదేమో.

గంట పైగా అయింది. శివరామయ్య ఇంకా రాలేదు.

ఎక్కడికి వెళ్ళివుంటాడు?

తనని హత్యచేయడానికి పకడ్బందీగా ఏర్పాట్లు చేస్తున్నాడా?

లంచ్ ఏర్పాటుచేయడానికి యింత సేపు ఎందుకు?

సునంద కాటేజ్ లోంచి బయటపడింది.

చుట్టుప్రక్కల చూసింది. టూరిస్టులు ఎవరి గొడవలో

వాళ్ళున్నారు.

పార్కింగ్ ప్లేస్‌లోకి నడిచింది. శివరామయ్య కోసం వెతికింది. చటుక్కున తన కారును సమీపించింది. డిక్కీ ఎత్తి చూసింది.

ఇనుప దిమ్మలూ, కొబ్బరి డొక్క తాడూ తన వంక నిర్లిప్తంగా చూశాయి.

సునంద డిక్కీ మూసింది.

కాటేజ్‌కి వచ్చింది.

సరిగ్గా అప్పుడే టెలిఫోన్ మ్రోగుతోంది. సునంద పరుగెత్తింది.

అవతల కామేశ్వర్రావు పలికాడు.

"భయపడుతున్నావా?" అడిగాడు.

"అవును" అంది సునంద!

"భయపడక! నీకు నేనున్నాను."

"ఏమో, పరిస్థితులు!"

"నాన్సెన్స్!"

"శివరామయ్య బయటకు వెళ్ళి గంటంపావు అయింది!"

"ఇక్కడ రూఫ్ గార్డెన్‌లో వున్నాడు. చాల రష్‌గా వుంది. టేబులు బుక్ చేస్తాడు కాబోలు!"

"నువు యెక్కడినుండి మాట్లాడుతున్నావు?"

"కాటేజ్ నెంబర్ టూ. రూఫ్ గార్డెన్ ఈ ప్రక్కనే వుంది!"

సునంద నిట్టూర్చింది. "కారులో అవి వున్నాయి!"

"వాటి విషయం మర్చిపో...."

"నన్ను ఎలా కలుసుకుంటావు?"

"నేను నిన్ను వెంటాడుతూనే వుంటాను. సమయం చూసి కలుస్తాను."

"పెట్టేయనా?"

"ఊఁ!" అతతల క్లిక్‌మన్నది.

రెండు నిమిషాలలో శివరామయ్య వచ్చాడు.

అరగంటలో తమ భోజనాలు ముగించుకొన్నారు.

శివరామయ్య కాటేజ్‌కి వస్తూనే నిద్రలో పడ్డాడు.

సునంద తన హాండ్ బాగ్ లోంచి సీసా తీసింది. ద్రవం దూదిమీద వొంపింది.

అతడి ముక్కువద్ద పెట్టింది.

నిశ్చింతగా బయటకు నడిచింది.

కాటేజ్ నెంబర్ టూలో ప్రవేశించింది.

కామేశ్వరరావు ఆమెను కౌగలించుకొన్నాడు.

ఆమె బావురుమన్నది. అతడు ఆమె కన్నీటిని తుడిచాడు.

"ఛ! వాడికి భయపడక! వాడి అంతం నేను చూస్తాను" అన్నాడు.

"ఈ రాత్రికి అతడో.... నేనో...." ఆమె మరల జావురుమన్నది.

## 12

శివరామయ్య కళ్ళు తెరిచాడు. బద్ధకంగా వొళ్ళు విరుచుకొన్నాడు. గదిలోకి చూశాడు. సునంద బల్లముందు కూర్చుంది. ఆమె చేతిలో పుస్తకం వుంది. పుస్తకంలో లీనమయింది.

"సునందా!" పిల్చాడు శివరామయ్య.

సునంద తలత్రిప్పి చూసింది.

"టైం ఎంత అయింది?"

"సాయంకాలం అయిదు!"

శివరామయ్య చకచక మంచం దిగి బాత్ రూంలోకి

వెళ్ళాలను.

సునందకి పేజీలోని అక్షరాలు అలికినట్లు కని పిస్తున్నాయి.

తనకో తన భర్తకో మృత్యు ఘడియలు దగ్గరౌ తున్నాయి. తమ పథకం నిర్విఘ్నంగా అనుకూలజరుగు తుందా? తాను తన భర్త చేతిలో ంచి తప్పించు కుంటుందా? కామేశ్వరరావు సహాకారంతో తను అతడిని చంపగలుగుతుందా? ఎంత కాదనుకున్నప్పటికీ అతడు తన భర్త!

శివరామయ్య బాత్ రూంలోంచి బయట పడ్డాడు. ఈల వేసుకొంటూ బట్టలు తొడుక్కొన్నాడు.

"సునందా! నువ్వు ఎవరితో తిరుగుతున్నావో తెలుసా?" అన్నాడు శివరామయ్య అకస్మాత్తుగా.

సునందకి గుండెలు గుబగుబలాడాయి.

తన భర్త కామేశ్వరరావు గురించి ఎందుకు ప్రస్తా వించుతాడు? తనని హత్య చేయడానికి సమర్ధన చూపు తున్నాడా?

"నేను యెవరితోనూ తిరగటంలేదు!" కీచుమంది సునంద గొంతు.

"వాడి పేరు కామేశ్వరరావు. మన ఫాక్టరీ ఆఫీసులో ఒక బోడి గుమాస్తా."

సునంద నిర్ఘాంతపోయింది.

కామేశ్వరరావు తమ ఆఫీసులోనే పని చేస్తున్నాడా? మరి ఆ విషయం అతడు తనతో ఎందుకు చెప్పలేదు? కామేశ్వరరావు తనని మోసం చేస్తున్నాడా? శివ రామయ్య తరఫున పనిచేస్తున్నాడా? హత్యా పథకానికి అనుకూలంగా తనని శివరామయ్య వైపు తరుముతున్నాడా?

శివరామయ్య ఆమెవైపు చూచి చిరునవ్వు నవ్వాడు.

"సునందా! కేవలం అడగాలనే అడిగాను. అంతే! నా ఆదరణ నీకు కరువై నువ్వేదో మార్గం ఎంచుకున్నావు. ఆ విషయం నాకు తెలుసు. నేను నా కున్న అక్రమ సంబంధం విషయం వదిలించుకున్నాను. నువ్వు కూడా నమ్మకంగా నాపట్ల వ్యవహరించగలవ్!" శివరామయ్య బయటికి నడిచాడు.

"మరల ఎన్ని గంటలకు తిరిగిరావటం?" అడిగింది.

"ఏడున్నర—ఎనిమిది గంటలకు!" శివరామయ్య తల వొంచుకొని బయటికి నడుస్తూ, "వచ్చేటప్పుడు మల్లెపూలు తెస్తాను!" అన్నాడు.

సునంద టెలిఫోన్ వద్దకు పరుగెత్తింది.

కామేశ్వరరావు కాటేజ్ సెంటర్ పదహారుకు వచ్చాడు.

సునంద తలుపు మూసి వెనకగదిలోకి తీసుకువెళ్ళింది.

"యెవరిని నమ్మాలో నాకు తెలియటంలేదు!" అంది సునంద.

"అదేమిటి" అన్నాడు కామేశ్వరరావు. అతడు తన జేబులోంచి .45 కాలిబర్ పిస్తోలు తీశాడు. మాగజైన్ తెరిచాడు.

"నువు శివరామయ్య తరఫున పనిచేస్తున్నావు!"

"నేనా? ఎవరు చెప్పారు?"

"ఎవరో చెప్పలేదు. కేవలం నా అనుమానం!"

"వివరంగా చెప్పు!"

"నువు శివరామయ్య దగ్గర పనిచేసే గుమాస్తావట! ఆ విషయం ఎందుకు దాచావు?"

"అదా!అది నేను చెప్పుకోదగిన అర్హతకాదు కాబట్టి!"

"ఏం?"

"సునందా! ...వ్వాంటే ప్రాణం పెడతాను! నేను గుమాస్తానయితే నీకేం? కుబేరుడినయితే నీకేం?"

"నువ్వు శివరామయ్య తరఫున పని చేయటం లేదని నమ్మకం ఏమిటి?"

"పిచ్చిదానా ఈ రోజు నీకు ఏముంది? ఈ రాత్రి తొమ్మిది గంటలకు నీకు పీడలేకుండా చేయగలను! ఇప్పుడు నువు యెదురుతిరిగితే నేను చేసేదీ చేయగలిగేదీ ఏం వుంటుంది?" మాగజైన్‌లో గుళ్ళు లోడ్ చేసి సునందవైపు చేయి చాపాడు.

"ఏమిటిది? ఆ పిస్తోలు నాకు ఎందుకు?"

"నీవు జాగ్రత్తగా విను. పిచ్చి అనుమానాలు పెట్టుకోక! శివరామయ్య కాటేజ్‌లోకి రాగానే నువ్వు అతడిని పిస్తోలుతో కవర్ చెయ్యి. అతడి కాళ్ళూ చేతులూ కట్టేస్తాను!"

సునందకి పోయిన నమ్మకం తిరిగివచ్చింది. పిస్తోలు అందుకొంది.

"నిన్ను ఏ జలాశయంలో అయితే చంపాలని చూశాడో అదేచోట అతడు శవం అవుతాడు!"

"అంటే చంపి జలాశయంలో పారేస్తామా?"

"అవును! నీళ్ళు త్రాగి చనిపోతాడు శివరామయ్య."

"కేకలు పెడితేనో...."

"పెట్టడు! అప్పటికే అతడు శవమైవుంటాడు!"

"ఎలా?"

"బాత్‌రూంలో అతడిని టబ్‌లో చంపేస్తాం. నీటిలో చనిపోయినవాడు యాక్సిడెంటులో పోయాడో హత్య చేయటంవలన పోయాడో పోస్టుమార్టంలో

తెలియదు!"

సునంద నోరావులించి వింటోంది.

కామేశ్వరరావుకు హాత్యకు సంబంధించిన లోతు పాతులు బాగా తెలుసు!

"రాత్రివేళ సరస్సులో యెవరయినా వుంటేనో...."

"రాత్రిళ్ళు సరస్సులో యెవరూ తిరగటంలేదు. వాచ్ మాన్ ఒకడు వుంటున్నాడు. వాడిని కనిపెట్టాను. నా కాటేజ్ వెనక అరుగుమీద నిద్రపోతాడు. వాడికి కూడా క్లోరోఫాం వాసన చూపిస్తాం! దట్సాల్!"

తలుపు చప్పుడయింది.

కామేశ్వరరావు చటుక్కున బాత్ రూంలోకి దూరాడు. సునంద బల్లమీది పిస్తోలు అతడికే అందించింది.

ఏమీ జరగనట్టుగా వెళ్ళి తలుపు తీసింది.

శివరామయ్య లోపలకు వచ్చాడు. అతడి బట్టలు తడిగా వున్నాయి.

సమయం రాత్రి ఎనిమిదయింది.

"సునందా మొహం కడుక్కో! భోజనం కోసం వెళ్దాం!" అంటూ శివరామయ్య బల్లమీద తామరాకు పొట్లం పెట్టాడు. గదిలో మల్లెల వాసన.

సునంద అతడిని నెర్వస్ గా చూచింది. బట్టలు తడుపుకొన్నాడు. అంటే....

శివరామయ్య చురుగ్గా బాత్ రూంలో అడుగు పెట్టాడు. అతడి కళ్ళు పెద్దవయ్యాయి.

కామేశ్వరరావు తనకి పిస్తోలు గురిపెట్టి నిలబడ్డాడు.

"ఏమిటిది మతిపోయిందా?" అన్నాడు శివరామయ్య.

కామేశ్వరరావు పిస్తోలు సేఫ్టీకాచ్ తప్పించాడు.

శివరామయ్య చటుక్కున అతడిమీదకు చూశాడు.

కామేశ్వరరావు అందుకు సిద్ధపడినవాడల్లే కాలెత్తి అతడిని బలంగా డొక్కలో తన్నాడు. శివరామయ్య చటుక్కున కిందపడ్డాడు. కామేశ్వరరావు అతడి మీద పడి నొక్కిపట్టాడు.

సునంద త్రాళ్ళు తెచ్చింది. అతడిని కాళ్ళూ చేతులూ కట్టి మంచం మీదకు చేర్చారు.

శివరామయ్య కీచుగా అరుస్తున్నాడు.

"సునందా! ఏమిటిది? నీకు న్యాయంగా వుందా?"

"న్యాయమా?" పకపక నవ్వాడు కామేశ్వరరావు.

"సునందా! నీ కోసం మల్లెపూలు తెచ్చాను!"

"అవి లిలీ కోసం!"

"లి....లీ...." శివరామయ్య మాట్లాడకుండా అతడి నోట్లో గుడ్డ కుక్కాడు కామేశ్వరరావు.

"నువ్వు నన్ను యమయాతన పెట్టావు. నా కళ్ళ ముందే పచ్చిగా ప్రవర్తించావు. నా మీదకు జాగ్ను ఉసికొలిపావు! నిన్ను ఒక గంటలో చంపేస్తాం" అంది సునంద.

శివరామయ్య భయంగా చూశాడు. నోరు కదప బోయాడు.

"నీ చావు విషయం నీకు తెలిసింది. ఇప్పుడు నువ్వు అనుభవించే నరకయాతన చూడాలి నేను! అప్పుడే నాకు తృప్తి!"

శివరామయ్య గింజుకున్నాడు. కట్లు బలంగా వున్నాయి.

"ఏమీ లాభంలేదు. నిన్ను బాత్ టబ్ లో వున్న నీటిలో ముంచి చంపుతాం! తరువాత సరస్సులో

పారేస్తాం. సరస్సులో పడవ తిరగపడి చచ్చిపోయినట్టుగా సృష్టిస్తాం! అంతే!"

శివరామయ్య కళ్ళు దీనంగా వర్షిస్తున్నాయి.

"అన్నట్టు సునందా! బాత్ టబ్ లో సరస్సు నీటిని నింపాలి."

"ఎందుకు?"

"పోస్టుమార్టంలో పీడి కడుపులో సరస్సు నీరు దొరకాలి!"

"ఈ ఆలోచన నీకు యిప్పుడే వచ్చిందా?"

"అవును."

సునంద కామేశ్వరరావును చిరాకుగా చూచింది.

"నీరు ఎలా తీసుకురావడం?"

"బకెట్స్ తో."

"ఎవరైనా చూస్తే!"

"మన కాటేజికి దగ్గరలో ఎక్కడో యేదో అడ్డం పడినట్టు చెబుతాం!"

"రైట్!"

కామేశ్వరరావు బాత్ రూంలోంచి రెండు బకెట్లు తీశాడు. కాటేజ్ తలుపులు దగ్గరగా వేసి ఇద్దరూ సరస్సు వద్దకు వెళ్ళారు.

టూరిస్టులు భోజనాల హడావుడిలో వున్నారు.

బాత్ రూంలో టబ్ నిండేటప్పటికి తొమ్మిదయింది.

"సరస్సులో శవంతో వున్న పడవ తిరగబడుతుంది. నువ్వు పడవను పట్టుకు వ్రేలాడు. లేదా ఈత వచ్చును కాబట్టి అక్కడక్కడే గిరికీలు కొట్టు. శవాన్ని పడతోసే ముందు కేకలు పెట్టు. నీ రక్షణకు సరస్సుకి సంబంధించిన రక్షకదళం వస్తుంది!" అన్నాడు కామేశ్వరరావు.

"మరి నువ్వు...."

"నేను నీతోబాటు వుండి శవం నీటిలో పడగానే చీకట్లోకి ఈదుకుంటూ వస్తాను. ఒడ్డు ఎక్కిపోతాను. జాగ్రత్త! పడవను వదలకు!" అంటూ కామేశ్వరరావు శివరామయ్య తలవద్దకు చేరాడు.

సునంద శివరామయ్య కాళ్ళు సాయం పట్టింది.

శివరామయ్య ఏడ్చేస్తున్నాడు.!

సునందకి కళ్ళ నీళ్ళు తిరిగాయి. కామేశ్వరరావును పిచ్చిగా చూసింది. కామేశ్వరరావు ఆమెను కోపంగా చూశాడు.

నోట్లో గుడ్డ పీకి శివరామయ్యను బాత్ టబ్‌లో ముంచారు.

బుడబుడ శబ్దమయింది.

శివరామయ్య నీళ్ళు మింగుతున్నాడు.

సునంద కళ్ళు మూసుకుని బుడబుడలు లెక్కిస్తోంది.

మృత్యుక్షణాలు!

శివరామయ్య గింజుకుంటున్నాడు. కాళ్ళు టబ్ అడుగున తన్ని పెడుతున్నాడు. తల పైకెత్తబోయాడు.

కామేశ్వరరావు అతడి తలను అదిమిపెట్టాడు.

శివరామయ్యలో ప్రతిఘటన ఆగిపోయింది.

టబ్ అడుగున దీర్ఘ విశ్రాంతి తీసుకుంటున్నాడు.

# 13

కామేశ్వరరావు సమయం చూసుకున్నాడు.

తొమ్మిదిన్నర!

సునందతో కలసి బయటికి నడిచాడు. కాటేజీ తాళంపెట్టి వాచ్‌మాన్ పడుకునే చోటికి వెళ్ళాడు.

అతడు గురక పెట్టి నిద్రపోతున్నాడు.

అతడికి క్లోరోఫాం వాసన చూపించారు. సునంద బేతింగ్ డ్రస్సులోకి మారింది.

సరస్సువద్దా కాటేజెస్‌వద్దా టూరిస్టుల సద్దుమణిగింది.

ఇద్దరూ శవాన్ని టబ్‌లోంచి తీసి కట్లు విప్పారు. శవానికి దుప్పటి కప్పి కామేశ్వరరావు దాన్ని తన భుజానికి ఎత్తుకున్నాడు. కాటేజెస్ కీనీడల్లోంచి నడుస్తూ సరస్సులో కట్టిన బేస్ చేరుకున్నాడు. రాడ్స్‌కి రెండు మోటార్‌బోట్లు కట్టివున్నాయి. ఒక బోట్‌లో శవాన్ని పడుకోబెట్టి తాడు విప్పి బోట్‌ను స్టార్ట్ చేశాడు. సునంద బోట్‌లో కూర్చుంది.

బోట్ సన్నగా శబ్దం చేస్తూ సరస్సు మధ్యకు వెళ్ళింది.

ఇద్దరూ శవాన్ని ఎత్తి నీట్లోకి జారవిడిచారు. వెంటనే ఇద్దరూ బోట్ అంచు పట్టుకుని నీటిలోకి వాలి తమ బరువుతో బోట్‌ను తలక్రిందులు చేశారు.

సునంద వగరుస్తోంది.

కామేశ్వరరావు ఆమెను సందిట పట్టుకుని బోట్‌ను పట్టుకున్నాడు.

"అరువ్...." గుసగుసలాడాడు.

సునంద పిచ్చిగా అరుస్తోంది.

కాటేజెస్‌లో దీపాలు వెలిగాయి. సరస్సుమీద స్పాట్‌లైట్ తిరుగుతోంది. లైటుకాంతికి అందకుండా కామేశ్వరరావు చీకటి కోణాల్లోకి ఈదుతున్నాడు.

టూరిస్టులు సరస్సువద్దకు పరుగులు తీస్తున్నారు.

కామేశ్వరరావు తృప్తిగా చూశాడు.

సునంద గొప్పగా నటిస్తోంది.

వెర్రిగా అరుస్తోంది! గొంతు చించుకుని అరుస్తోంది!!

కామేశ్వరరావు వులిక్కిపడ్డాడు.

కామేశ్వరరావు కాలికి కొబ్బరిడొక్క తాడు తగిలింది. తాడు కొన ఒకటి సరస్సులో తేలుతోంది. కొనపట్టుకు లాగాడు. రాలేదు. క్రింద యేదో బరువు కట్టివుంది. కామేశ్వరరావు ఈదుతోనే కొసపట్టుకొని అతికష్టం మీద ఒడ్డుకు లాగాడు. నీటిలో కలకలి కదిలింది.

శివరామయ్య తెచ్చిన కొబ్బరి డొక్క తాడు!

కలకల కదిలినవి ఇనుపదిమ్మలు!

కామేశ్వరరావు ఒడ్డుకు పరుగెత్తి తన కాటేజ్‌లో ప్రవేశించాడు. సునంద యింకా అరుస్తోంది. రెండవ బోట్ సరస్సులోకి బయలుదేరింది.

* * *

తెల్లవారుజాము అయిదు గంటలు!

"సునందా!" పిలిచాడు కామేశ్వరరావు.

సునంద కళ్ళు ఎర్రగా వుబ్బివున్నాయి. పోలీస్ యింటరాగేషన్ అయ్యేసరికి ఈ వేళయింది. శవాన్ని పోస్ట్‌మార్టం కోసం తీసుకెళ్ళారు పోలీసులు.

"రాత్రి శివరామయ్య, తడిబట్టలతో వచ్చాడు కదా!" అడిగాడు కామేశ్వరరావు.

సునంద తలూపింది.

"సరస్సులో తాడూ ఇనుప దిమ్మలూ కనిపించాయి."

తన ప్రక్కలో బాంబు పడినట్టు చూసింది సునంద.

"పద! చూద్దాం!" కామేశ్వరరావు లేచాడు.

పడవ యాక్సిడెంటులో శివరామయ్య మరణించినట్టు నిర్ధారణ కావడంతో దీపాలతో ఆ ప్రాంతం పట్టపగలు లాగా వుంది.

సరస్సులో మెల్లగా కెరటాలు వస్తున్నాయి.

కామేశ్వరరావు ముందుకు ఒంగి తాడు అందు కున్నాడు. బలంగా ఒడ్డుకు లాగాడు. నీటి పైభాగానికి పువ్వుల గౌను తేలుతోంది. క్రమంగా మొహం నీటి భాగానికి వచ్చింది.

సునంద కెవ్వున అరచింది.

కామేశ్వరరావు వెనక్కి పడిపోయాడు.

లిలీ కళ్లు వాళ్ళని చూడటం లేదు. పగిలిన పత్తికాయ ల్లాంటి ఆ కళ్ళు ఉబ్బిపోయిన మొహంలో నిర్జీవంగా అతుక్కుపోయి వున్నాయి.

—ఐపోయింది—

# ఇంటి దొంగ

## టెంపోరావ్

ఒక పబ్లిషింగ్ కంపెనీకి మేనేజర్‌గా పనిచేసి రామారావు రిటైరయ్యాడు. మేడమీదున్న ఫ్లాట్‌లో అతడు తన కుటుంబంతో నివసిస్తున్నాడు.

ఆరున్నర అవగానే అతడు టి.వి. ఆన్ చేశాడు. హాల్లో 40 వాట్స్ బల్బ్ డిమ్‌గా వెలుగుతోంది. రామారావు, భార్య కనకం, ఆమె తల్లి రాజమ్మ కూర్చుని టి. వి. తిలకిస్తున్నారు.

వాళ్ళమధ్యనుంచి గుమ్మంవైపు నడుస్తూ ఉష ఆగింది. ఉష అతడి కడసారి కూతురు. బి. ఏ. ఫైనలియ్యర్‌లో వుంది.

"అమ్మా, నేను డాబామీదకు పోతున్నాను. సౌండు మరీ హెచ్చించకండి. పైన కూర్చుని చదవలేను" అందామె.

"వెళ్ళమ్మా, చదువుకో!" అన్నాడు రామారావు.

ఉష గుమ్మందాటి కుడివైపుకు తిరిగి వెళ్ళిపోయింది.

రామారావు కుర్చీలో వెనక్కి వాలి సిగరెట్ వెలిగించాడు. ఊటీలో జరిగిన ఫ్లవర్ షో దృశ్యాలు తెరమీద కదులుతున్నాయి.

సిగరెట్ పొగ వదులుతూ రామారావు చూస్తున్నాడు. వెనకనే కూర్చున్న భార్యవైపు తిరిగాడతను.

"అమ్మాయి కోసం కాఫీ చేసి ఫ్లాస్కులో పోశావుగా?" అడిగాడు.

"ఫ్లాస్కునిండా వుంది కాఫీ. కావలిస్తే మీరూ తాగొచ్చు" అందామె.

ఉషంటే అతడికెంతో ప్రేమ. ముగ్గురు కూతుళ్ళకు అతడు పెళ్ళి చేసేశాడు. బి. ఏ. పాసయ్యాక ఉషకి కూడా పెళ్ళి చేసేస్తే తన బాధ్యత పూర్తిగా తీరిపోతుంది!

నిమిషాలు గడుస్తున్నాయి. ఫామిలీ ప్లానింగ్ గురించి ఏదో చూపిస్తున్నారు. కొంచెం చూశాక అతడికి విసుగెత్తింది. అతడు కుర్చీలోంచి లేచి బయటనున్న మెట్లవైపు నడిచాడు. మెట్లెక్కి పైకి వెళ్ళాడు. డాబా మీదున్న లైట్ వెలుగుతోంది.

విశాలమైన డాబా! పిట్టగోడ పక్కనే కూర్చుని ఉష తన చదువులో నిమగ్నురాలై వుంది. తృళ్ళిపడుతూ ఆమె తండ్రివంక చూసింది.

"మీరా నానా!" అందామె.

"ఫ్లాస్కులో కాఫీవుందట. కావలసినప్పుడు తాగుతూ వుండు!" అన్నాడతను.

"తాగే పైకొచ్చాను" అందామె.

"నువ్వు చదువుకో! ఎల్లుండేగా పరీక్షలు" అని అతడు యిటూ అటూ నడవసాగాడు.

ఆకాశంలో అర్ధచంద్రుడు కనిపిస్తున్నాడు. నక్షత్రాలు మిసుకు మిసుకుమంటున్నాయి. చల్లటి గాలి వీస్తోంది. డాబా వెనకవైపున పెద్ద టాంక్ వుంది. ఆ టాంక్‌లోని నీళ్ళు పైపుల ద్వారా కింద మేడమీద వున్న వాళ్ళకు చేరుతూ వుంటాయి.

అతడు పిట్టగోడ వారగా వెళ్ళాడు. కిందకు చూశాడు. రోడ్డుమీద జనసంచారంలేదు. కుక్కలు తిరుగుతున్నాయి. ఇది టివీల యుగం! అందరూ గదుల్లో కూర్చుని టివీలను చూస్తున్నారు. ఒకప్పుడు యిళ్ళ బయట కుర్చీల్లో కూర్చుని కబుర్లు చెప్పుకోనేవాళ్ళు యీనాడు టివీల ముందు కూర్చుని కాలాన్ని గడిపేస్తున్నారు.

ఏదో కేకవిని అతడు మెట్లవైపు పరుగెత్తాడు.

"ఏవండోయ్, మిమ్మల్నే!" అర్చింది భార్య కింద నుంచి.

"ఏమిటే?" ప్రశ్నించాడతను.

"నాటకం ప్రారంభమైంది రండి."

"గట్టిగా అరవకు! అమ్మాయి చదువుకొంటోంది" అని అతడు కిందకు దిగాడు.

తన ఫ్లాట్‌లోకి వెళ్ళే తలుపు బార్లా తెరిచివుంది. కిందకు వెళ్తూన్న మెట్లవైపు చూశాడతను. పైనున్న డాబా కిందవాళ్ళకూ, మేడమీదున్న వాళ్ళకూ వుమ్మడిగా వుపయోగపడ్తోంది.

రామారావు హాల్లోకి వెళ్ళి తన యీజీ చెయిర్‌లో వాలాడు. ఏడున్నరకు ప్రారంభమైన నాటకం ఎనిమిది దాకా సాగుతుంది. తర్వాత వార్తలు! న్యూస్ మొదలవగానే టీవీని ఆఫ్ చేయటం అతడికలవాటు.

నాటకంలో అతడు లీనమైపోయాడు. ఎనిమిదింటికి

ముగిసింది నాటకం.

"ఆ అమ్మాయిని అతడు చివరకి పెళ్ళాడ్తాడని నేను మొదటే అనుకొన్నాను. పాపం ఆమెకు ఒక కాలులేదు. కాని ఆమె హృదయం వెన్నలాంటిది" అంది భార్య.

"ఏమిటో యీ ప్రేమలూ, పెళ్ళిళ్ళూ! కాలులేని భార్యతో ఆ యువకుడు ఎంత సుఖపడ్తాడు? రచయిత వాళ్ళిద్దర్కీ పెళ్ళి చేసి పారేశాడు!" అన్నాడు రామారావు.

ఉష కిందకొచ్చింది.

"మంచి నాటకం మిస్సయ్యావే!" అంది తల్లి.

"నా పరీక్షలయాక చూస్తానులే!" అని ఉష వంట గదిలోకెళ్ళింది.

ఫ్లాస్కులోని కాఫీని గ్లాసులో పోసుకొంది. గ్లాసును తీసుకొని పైకెళ్ళబోతూ తల్లిని చూసి ఆగింది.

"మాతో భోజనం చెయ్యవా?" అడిగింది తల్లి.

"చదవ్వాలసింది చాలా వుంది. అన్నం తింటే నిద్రొస్తుంది. పది తర్వాత తింటాను. నన్నెవరూ పిలవకండి" అని ఉష పైకి వెళ్ళిపోయింది.

రామారావు బాల్కనీలో నిలబడ్డాడు. వీధి దీపాలు వెలుగుతున్నాయి. ఒకతను రోడ్డమ్మట నడుస్తూవచ్చి, గేటు తెర్చుకొని లోపలికి వెళ్ళాడు. అతడిని రామారావు గుర్తుపట్టాడు. కింద నివసించే యింటామె తమ్ముడు.

ఇంటి ఓనర్ విజయ సమీపంలో ఒక నర్సరీ స్కూలును నడుపుతోంది. భర్త రైల్వేలో పనిచేసేవాడు. ఎనభై వేలు ఖర్చుచేసి ఆ మేడను కట్టించాడు. ఇల్లుకట్టి సంవత్సరం గడిచేలోగా అతడు మోటార్ సైకిల్ యాక్సిడెంట్ లో మరణించాడు. మేడను అద్దెకిచ్చి, తన యిద్దరు

కొడుకులతో విజయ జీవితాన్ని సాగిస్తోంది.

ఆమె తమ్ముడు దుర్గ తేనేంపేటలో వుంటున్నాడు. అప్పుడప్పుడు అక్క ఇంటికొచ్చి చూసిపోతూ వుంటాడు.

రామారావు టైమ్ చూశాడు. 8-15 దాటింది. అతడు వెనక్కి తిరిగొచ్చి యీజీ చెయిర్‌లో కూర్చున్నాడు. భార్య టీవీ ఆన్ చేసింది.

"చపాతీలు యిచ్చేస్తాను. తింటూ చూడండి" అందామె.

అతను తలాడించాడు. ఆమె వంటగదిలోకి వెళ్ళిపోయింది. అతడు ఒంటరిగా కూర్చుని "కళ్ళను కాపాడుకోండి" అనే డాక్యుమెంటరీ ఫిలిమ్ చూస్తున్నాడు. ఉష కిందకొచ్చి మంచినీళ్ళు తాగి పైకి వెళ్ళిపోయింది.

ప్లేటులో భార్య చపాతీలు తెచ్చి అతడికిచ్చింది. అతడు తింటూ టి.వి. చూస్తున్నాడు. భార్య, ఆమె తల్లి వంటగదిలో భోజనం చేస్తున్నారు. తినడం ముగించి అతడు చెయ్యి కడుక్కున్నాడు. సిగరెట్ వెలిగించాడు. టి.వి.లో ఇచ్చే ప్రోగ్రాము అంత యింట్రెస్టింగ్ గాలేక అతడు బాల్కనీలోకి వెళ్ళాడు—సిగరెట్ పొగవదుల్తూ టైమ్‌చూశాడు. తొమ్మిది దాటింది. కుక్కలు మొరుగుతున్నాయి. ఇంటి ముందునుంచి ఎవరో వేగంగా నడిచిపోతున్నారు. ఆ ఆకారాన్ని అతడు గుర్తుపట్టాడు. జయదేవ్! సమీపంలో వుంటున్నాడు. ఏదో ఇంజనీరింగ్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. మునుపు ఇంటికొచ్చి ఉషతో మాట్లాడుతూ వుండేవాడు. ఈ మధ్య రావటం మానేశాడు. జయదేవ్‌ని చూస్తూంటే ఏవేవో జ్ఞాపకాలు అతడి మెదడులో మెదిలాయి.

ఇంగ్లీషు పాప్ మ్యూజిక్ వినిపిస్తోంది. రామారావు

తన కుర్చీలో కూర్చుని మ్యూజిక్ వినసాగాడు. కాస్సే పద్మాక్ష భార్య వచ్చి పక్కనే కుర్చీలో కూర్చుంది.

"మీ అమ్మ ఎక్కడ?"

"పడుకొంది" అందామె.

అతడామె భుజంమీద చెయ్యివేశాడు. ఇంగ్లీషు మ్యూజిక్ సాగుతోంది.

"డాన్స్ చేద్దామా?" అన్నాడు నవ్వుతూ.

"మన పాదాల చప్పుడు విని కిందావిడ పైకి పరుగెత్తుకొస్తుంది" అందామె.

పక్కకువంగి అతడామెను ముద్దెట్టుకోబోయాడు. ఆమె వెనక్కు జరిగింది.

"అరవై ఏళ్ళొచ్చినా మీ ఆకలి తీరలేదు!"

అతడు కిలకిల నవ్వాడు.

"కనకం, నా వయస్సు అరవై, నీ వయస్సు యాభై రెండు. మన వయస్సులు వచ్చేసరికి భార్యాభర్తలు మారమైపోతారు. యాంత్రికంగా జీవిస్తూ వుంటారు. మనలో యింకా ప్రేమ జ్యోతి ప్రకాశిస్తున్నందుకు నువ్వూ నేను ఆనందించాలి" అని అతడామెను దగ్గరగా లాక్కొని ముద్దెట్టుకొన్నాడు.

"చాల్లెండి, అమ్మాయి వస్తే బాగుండదు!"

పదిగంటలైంది. అతడు టి.వి. స్విచ్ ఆఫ్ చేశాడు. దానిమీద వెల్వెట్ గుడ్డను కప్పేశాడు. హాలులోని ఫ్లొరొసెంట్ లైట్‌ను ఆమె ఆన్ చేసింది. గదంతా కాంతిమయంగా అయింది.

అతడు టైమ్ చూశాడు. పదిఐదు అయింది.

"అమ్మాయి యింకా చదువుతోంది!" అన్నాడతను.

"కింద తలుపు వేసేయండి" అందామె.

"ఒకసారి పైకెళ్ళి చూద్దాం పద! అక్కడ చల్లగా వుంటుంది!"

"పదండి!"

ఇద్దరూ మెట్లెక్కి పైకి వెళ్ళారు.

పైన చీకటి, లైటు వెలగడం లేదు.

"అది నిద్రపోతున్నట్లుంది!" అన్నాడతను.

"చల్లగాలిలో చదవడానికి కూర్చుంటే యిలాగే అవుతుంది. పుస్తకాలు తలకింద పెట్టుకుని పడుకుంటారు" అందామె.

అతడు లైటు స్విచ్ నొక్కాడు. డాబా లైటు వెలిగింది.

రామారావు పిట్టగోడ వైపు చూశాడు. నేలమీద చాప. దానిమీద నాలుగు పుస్తకాలు, రెండు నోట్ బుక్లు వున్నాయి. అతను డాబా నలువైపులా చూశాడు. ఎక్కడా ఉష కనిపించలేదు.

"సరస్వతింటికి వెళ్ళుంటుందా?" అడిగాడతను.

"ఇంత రాత్రివేళ ఎక్కడ వెళుతుందండీ, కిందకు పోయి పడుకుందేమో!" అంది కనకం.

రామారావు వేగంగా కిందకు పరుగెత్తాడు. గదులన్నీ పరికించాడు. ముందు వరండాలో నిలబడిన భార్య దగ్గరికొచ్చాడు.

"ఎక్కడా లేదే! ఏ పుస్తకం కోసమో సరస్వతింటికి వెళ్ళుండొచ్చు. నే వెళ్ళి కనుక్కొస్తా!" అని అతడు మెట్లు దిగి కిందకు వెళ్ళిపోయాడు.

బాల్కనీలో నిలబడి ఆమె కిందకు చూస్తోంది. రామారావు రోడ్డమ్మట గబగబా నడుస్తున్నాడు. అదే రోడ్డుమీదున్న ఐదో ఇంటిముందు అతడు ఆగాడు. ఇంట్లో

దీపాలు వెలగడం లేదు. అందరూ నిద్రపోతున్నారేమో!

"సరస్వతీ! అమ్మా సరస్వతీ!" అని రామారావు పిలవడం బాల్కనీలో నిలబడిన ఆమెకు వినపడుతోంది.

సరస్వతి యింట్లో లైటు వెలిగింది. రామారావు లోపల కెళ్ళాడు. కాసేపయ్యాక అతడు రోడ్డమ్మట పరుగెడ్తూ వచ్చాడు. వీధి కుక్కలు మొరుగుతున్నాయి. అతడు గబగబా మేడ మెట్లు యెక్కాడు. ఆమె బాల్కనీలోంచి మెట్లవైపున్న గుమ్మం దగ్గరకు దూసుకు వెళ్ళింది.

"ఏవండీ, అక్కడ లేదా?" అడిగిందామె గాభరాగా.

క్షణకాలం అతడామె వంక చూశాడు. అతడి మొహంలో భయం గోచరిస్తోంది. జవాబివ్వకుండా అతడు డాబామీదకు పరుగెత్తాడు. వెనకనే వెళ్ళిందామె. మరోసారి డాబా అంతటా కలయజూశాడతను. పిట్టగోడ పక్కనున్న చాప దగ్గరకు వెళ్ళాడతను. పిట్టగోడ పక్కనే రెండు గ్లాసులున్నాయి. పుస్తకాల మధ్య పడుందొక బాల్ పాయింట్ పెన్.

"అమ్మాయి యెక్కడికి వెళ్ళుంటుందండీ?" అడిగింది కనకం.

అతడు జవాబివ్వలేదు. బుర్ర వేడెక్కుతోంది. కళ్ళు తిరుగుతున్నాయి. అతడు కుప్పలా డాబా మీద కూర్చుండిపోయాడు. కనకం భర్త దగ్గరగా వెళ్ళింది. అతడు ఒగురుస్తున్నాడు. ఆమె కొంచెం దూరంలో వున్న ఓవర్ హెడ్ టాంక్ వైపు చూసింది. గబగబా టాంక్ దగ్గరకు వెళ్ళింది. టాంక్ మూతను వెనక్కి నెట్టి అందులోని నీళ్ళను తెచ్చి అతని మొహంమీద జల్లింది. రామారావు తేరుకున్నాడు.

లేచి టాంక్ దగ్గర కెళ్ళాడు. నీళ్ళకోసం టాంక్ లోకి చెయ్యి పోనిచ్చాడు. అమాంతంగా అతడు ఉలిక్కి పడ్డాడు.

"కనకం!" అని గట్టిగా అరిచాడు.

ఆమె తొందరగా వెళ్ళింది.

టాంక్ లోకి అతడు మళ్ళా చూశాడు. దూరంలో వున్న డాబా లైటు కాంతి టాంక్ లోపలకు పడటం లేదు.

"కనకం కిందకు వెళ్ళి టార్చి పట్రా!"

కనకం గబగబా కిందకు వెళ్ళింది. క్షణంలో తిరిగొచ్చింది.

టార్చిని పట్టుకున్న అతడి చేతులు వణుకుతున్నాయి. టార్చి కాంతిలో అతడు లోపలకు చూశాడు. నీళ్ళ అడుగున టాంక్ లో ఆమె వెల్లకిలా పడుంది.

టార్చిని భార్య కిచ్చి అతడు కూతుర్ని మెల్లిగా బయటకు తీసి డాబామీద పడుకోబెట్టాడు. ఆమె చూడ్డానికి భయంకరంగా వుంది. ఏడుస్తూ కనకం కూతురి మీద వాలిపోయింది. రామారావు కూతుర్ని పరీక్షించాడు. ఆమెలో జీవం లేదు. పక్కనే కూలబడిపోయాడు. భార్య వెక్కి వెక్కి ఏడుస్తోంది. రామారావు కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

ఎవరో మెట్లెక్కి పైకొచ్చారు.

సరస్వతి!

నేలమీద పడున్న ఉషను చూసి సరస్వతి గాభరాగా అరిచింది. క్షణంలో కిందావిడ డాబామీదకు వచ్చింది. ఇరుగు పొరుగు వాళ్ళు డాబామీద గుమిగూడారు.

"పోలీసు రిపోర్టు యివ్వాలి!" అన్నాడు ఎదురింటి రామన్.

"పక్కింట్లో ఫోనుంది. పోలీసులకు ఫోను చేద్దాం!" అన్నాడు మూడో యింట్లో వుండే మూర్తి.

మూర్తి, రామన్ మెట్లు దిగి కిందకు వెళ్ళారు.

## 2

సుందర్ నగర్ సుందరంగా వుంది. అన్నీ కొత్త యిళ్ళు. ఒక మేడముందు డాడ్జి కారాపి దిగాను. రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. రోడ్డుమీద యాభై మంది పైగా నిలబడి వున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నా దగ్గర కొచ్చాడు.

"బ్రదర్, శవం డాబా మీదుంది, పద" అన్నాడు నాయర్.

మెట్ల ప్రాంతంలో ఒక కానిస్టేబుల్ నిలబడి వున్నాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ వెనకనే మెట్లమ్మట పైకి వెళ్ళాను. డాబామీద చల్లటి గాలి వీస్తోంది. నేలమీద పడున్న యువతి వైపు చూశాను. పొట్ట బాగా ఉబ్బి వుంది. నీళ్ళలో మునిగి, వూపిరాడక ఆమె మరణించి వుంటుందని స్పష్టంగా తెలుస్తోంది. చేతుల మీద, మొహంమీద గాట్లున్నాయి. పావడా, వోణీలతో ఉందామె. జాకెట్, బ్రా వెనక్కి విడిపోయి వున్నాయి.

ఆమె వయస్సు యిరవై దాటి వుండదు. స్తనాలు పైకి నగ్నంగా కనిపిస్తున్నాయి. ఆమె చాలా అందమైన యువతి. మరణించిన తర్వాత ఆమె శవం వికృతంగా రూపొందింది.

విచారంతో లేచి నిలబడ్డాను. డాబా నలువైపులా

చూశాను. పిట్టగోడ వారగా ఇద్దరు కూర్చుని ఉన్నారు. ఒక కానిస్టేబుల్ గుమ్మం ప్రాంతంలో నిలబడ్డాడు. నేనూ, నాయర్ - మేం తప్ప అక్కడ మరెవ్వరూ లేరు.

"ఆయన యీమె తండ్రి రామారావుగారు. ఆయన పక్కనున్న స్త్రీ యీమె తల్లి. ఈమె పేరు ఉష. బి.ఎ. చదువుతోంది!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

డాబా మీద తిరుగుతూ నలువైపులా చూశాను. చాప, పైన పుస్తకాలు. టాంక్ దగ్గర కెళ్ళాను. మూత వెనక్కి నెట్టబడి వుంది. టార్చి కాంతిలో టాంక్‌లోకి చూశాను.

టాంక్‌లో ఎక్కువగా నీళ్ళు లేవు. మనిషి అడ్డంగా మునగడానికి సరిపోయే నీళ్ళున్నాయి. టాంక్‌లో హవాయి స్లిప్పర్లు పడున్నాయి.

జేబులోంచి ఇండియా కింగ్స్ సిగరెట్ తీసి వెలిగించాను. పొగ పీల్చి వదుల్తూ పక్కనున్న యిన్‌స్పెక్టర్ వంక తిరిగాను.

"నాయర్ భాయ్, ఆమె ఏదేనా వుత్తరం రాసిందా?"

"లేదు, బ్రదర్!"

ఆలోచిస్తూ నిలబడ్డాను. చల్లగాలి అఖండంగా వీస్తోంది.

"ఆమె ఉత్తరం రాసినా అది యీ గాలిలో ఎగిరిపోయి వుండొచ్చు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పిట్టగోడ వైపు చూశాను. గోడ ఎత్తుగా ఉంది. కాగితం గోడ పైనుంచి ఎగిరిపోలేదు. డాబా మీదే ఎక్కడో ఎగిరి వుండాలి. డాబాను జాగ్రత్తగా పరీ

క్షించాను. చాపమీదున్న పుస్తకాలను, నోట్ బుక్కు లను తిప్పి చూశాను.

గ్లాసులను పరిశీలించాను. కాఫీ తాగిన గ్లాసు లవి. ఆలోచిస్తూ రామారావు ముందుకు వెళ్ళాను. నన్ను చూసి భార్యా భర్తలు ఏడ్వసాగారు.

"మా ఆఖరిపిల్లకీ గతి పడ్తుందని ఎన్నడూ వూహించ లేదు!" అన్నాడు రామారావు.

అతడివైపు సూటిగా చూశాను. అతడి ముఖంలో జీవం లేదు. ఈ బ్రతుకెందుకా అన్నట్లున్నాయి అతడి కళ్ళు.

"మీ అమ్మాయిని బ్రతికుండగా ఆఖరిసారి మీరు యెప్పుడు చూశారు?"

"ఎనిమిది ప్రాంతంలో. అది కిందకొచ్చి కాఫీ గ్లాసు పట్టుకుని పైకి వెళ్ళింది. 8-20 ప్రాంతంలో మంచినీళ్ళ కోసం వచ్చింది. అదే ఆఖరిసారి చూడ్డం."

"పైన ఆమెతో యెవరైనా ఉన్నారా?"

"ఎవ్వరూ లేరు సార్. ఏకున్నర లోపల నేనొక సారి పైకి వచ్చాను. అది ఆ చాప మీద కూర్చుని చదువు కుంటోంది!"

"ఆమె డాబామీద చదువుకుంటూన్న సమయంలో మీ రందరూ ఏం చేస్తున్నారు?"

"మేం టి.వి. చూస్తున్నాం."

"మీరు టి. వి. చూస్తూండగా ఎవరేనా పైకి రావచ్చుగా?" అడిగాను.

"రావచ్చు సార్. హాల్లో టి.వి. చూస్తూ కూర్చున్న వాళ్ళకు మెట్లమ్మట వెళ్ళే వాళ్ళు కనిపించరు" అన్నాడు రామారావు.

"మీ అమ్మాయి ఎవర్నైనా ప్రేమించిందా?"

"లేదు!"

"అది చెప్పండి!" అంది భార్య.

"ఏమిటది?"

"జయదేవ్ అనే యువకుడు అప్పుడప్పుడు మా ఇంటి కొచ్చేవాడు. ఉషతో మాట్లాడేవాడు. నేను యిక్కడకు రావద్దన్నాను. రెండు నెలల నుంచి అతడు యిక్కడకు రావడం మానేశాడు."

"ఎందుకు రావద్దన్నారు?"

"అతడు నాకు నచ్చలేదు. అమ్మాయికి పెద్ద సంబంధాలు వస్తాయని నా నమ్మకం. అతడు చిన్న ఉద్యోగంలో ఉన్నాడు. అతడికి నలుగురు చెల్లెళ్ళు ఉన్నారు. ఇద్దరు అన్నలున్నారు. అంతమంది ఉన్న కుటుంబంలో ఉష సుఖపడదని నేను భావించి అతడిని రావద్దన్నాను."

"మీకు తెలియకుండా అతడు వచ్చేవాడేమో?"

"వస్తే అమ్మాయి నాతో చెప్పకుండా ఉండదు. అతడితో స్నేహం పెంచుకోవద్దని నేను అమ్మాయితో చెప్పాను. అది సరే అంది."

"అతడు మీకు యివాళ కనిపించాడా?"

"తొమ్మిదిదాటాక నేను బాల్కనీలో నుంచున్నాను. జయదేవ్ మా యింటిముందు రోడ్డమ్మట పోతున్నాడు."

"అతడు మెట్లు దిగి వెళ్తున్నాడేమో!"

"నేను చూసేసరికి అతడు రోడ్డుమీద ఉన్నాడు."

"అతడు ఎక్కడుంటున్నాడు?"

"అతడు మొదటి రోడ్డులో నంబర్ 7 యింట్లో ఉంటున్నాడు."

"క్రిందభాగంలో ఎవరుంటున్నారు?"

"విజయ, ఆమె యిద్దరు కొడుకులు. వాళ్ళిద్దరూ పుత్రాళ్ళు. ఇవాళ రాత్రి ఆమె తమ్ముడు యింటి కొచ్చాడు. అతడిని నేను చూశాను."

"అతడి పేరు?"

"ద్వారై అని విన్నాను. నా కతనితో ఎక్కువగా పరిచయం లేదు."

"అతడు ఉషకు తెలుసా?"

"ఎలుగుబంటిలా ఉంటాడు వాడని ఆమె వెక్కిరించేది. ఉషకు అతడు తెలిసి ఉండడు."

"రామారావుగారూ, యీనాటి యువతులు పెద్దలకు తెలియకుండా అనేక మంది యువకులతో మాట్లాడుతూ ఉంటారు!" అన్నాను.

"మా పిల్ల అటువంటిది కాదు సార్!" అన్నాడు రామారావు.

వెనక్కు తిరిగాను. ఇన్ స్పెక్టర్ నాయక్ తో కలిసి పిట్టగోడ దగ్గరగా నడిచాను.

"నాయర్ భాయ్, నేను క్రిందకు వెళ్ళి దర్యాప్తు చేసి వస్తాను. నీ పని కానీ!" అని మెట్లవైపు అడుగు వేశాను.

# 3

మెట్లు దిగి క్షణకాలం మేడమీది ఫ్లాట్ వైపు చూశాను. ఇంకా క్రిందకు దిగాను. మెట్ల గదిలో రెండు గుమ్మాలున్నాయి. ఒక గుమ్మం ముందు కానిస్టేబుల్ నిలబడి వున్నాడు. రెండో గుమ్మంవైపు వెళ్ళాను. తలుపు లోపల వైపు మూసివుంది.

సిగరెట్ వెలిగించి పొగ పీలుస్తూ ఆలోచించాను. క్రింద భాగంలో వుండేవాళ్లు యీ తలుపు తెర్చుకొని

పై డాబామీదకు మెట్లమ్మట వెళ్ళొచ్చు!

బయటకు నడిచాను. ఇంటిముందు నడవలో నిల బడ్డాను. కింద భాగంలో వుండే విజయ గుమ్మంలో నిలబడివుంది. ఆమె ముందుకు వెళ్ళాను. ఆమె వెనక్కు కదిలింది. లోపలకు వెళ్ళాను. హాల్లో ఫ్లోరొసెంట్ లైట్ వెలుతోంది.

"కూర్చోండి" అందామె.

కూర్చుని ఆమెవైపు సూటిగా చూశాను.

"మీరుకాక యీ ఫ్లోర్‌లో ఎవరున్నారు?" అడిగాను.

"పిల్లలు పడుకొన్నారు. పైనుంచి కేకలు విని నేను మేలుకొన్నాను. వెంటనే పైకి వెళ్ళాను" అందామె.

"మీరు పైకి ఎలా వెళ్ళారు?"

"పక్క గదిలోంచి మెట్లకు తోవుంది. ఆ తలుపు తెరుచుకొని వెళ్ళాను."

"ఇవాళ మీ యింటికి ఎవరేనా వచ్చారా?"

"నా తమ్ముడు దొరై వచ్చాడు. వాడు ఐదునిమిషాలు కూర్చుని పనుందని చెప్పి వెళ్ళిపోయాడు."

"అతడు ఎక్కడుంటున్నాడు?"

"తేనేంపేటలో, నరసింహన్ రోడ్డు నెంబర్ 20 యింట్లో ఒకగది అద్దెకు తీసుకొన్నాడు."

"మీ తమ్ముడు ఏం చేస్తున్నాడు?"

"వుద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడు."

ఆమె వైపు నవ్వుతూ చూశాను.

"అక్కయ్య యిల్లుండగా మీ తమ్ముడు తేనేంపేటలో గది అద్దెకు తీసుకొని వుండటం విచిత్రంగా వుంది!"

"ఈ యిల్లు పట్నానికి దూరంలో వుంది. తేనేంపేటలో వుంటే వాడికి సౌకర్యంగా వుంటుంది. అందుకని అక్కడుంటున్నాడు"

"ఉష మీకు బాగా తెలుసా?"

"మంచి పిల్ల సార్. రామారావుగారు చాలా మంచివాడు. ఇదంతా ఎలా జరిగిందో అర్థంకావటంలేదు" అందామె.

"మీ తమ్ముడికి ఉషతో పరిచయముందా?"

"తమ్ముడు మమ్మల్ని చూసి వెళ్ళిపోతాడు. అతడు ఎవరితోనూ ఎక్కువ మాట్లాడడు" అందామె.

"మీ హాలుకి ఎదురుగా గేటుంది - ఎవరు లోపలకు వచ్చినా ఆ గేటు తెర్చుకునే రావాలి. ఎవరేనా యీ రాత్రి పైకెళ్ళడం మీరు చూశారా?"

"లేదు సార్. తమ్ముడు వెళ్ళిపోగానే నేనూ, పిల్లలూ పడుకున్నాం."

ఆమెకు థాంక్స్ చెప్పి బయటకు నడిచాను. రోడ్డు మీద యింకా ప్రజలు వున్నారు. వాళ్ళ గుసగుసలు వినిపిస్తున్నాయి.

మొదటి రోడ్డు కనుక్కోడానికి ఎక్కువ టైమ్ పట్టలేదు. ఏడో నంబర్ బంగ్లా ముందు ఆగాను. ఇంట్లో లైట్లు లేవు. అందరూ నిద్రబోతున్నారు. డాబామీదకు వెళ్ళే మెట్లు బయట వున్నాయి.

చప్పుడు చేయకుండా మెట్లెక్కి పైకి వెళ్ళాను. డాబామీద నిలబడి రామారావు ఉండే మేడవైపు చూశాను. డాబామీద తిరుగుతున్న ఇన్‌స్పెక్టర్ నాయర్ కనిపిస్తున్నాడు. డాక్టర్ సుధాకర్ రూపం కనపడి మాయమైంది. శవపరీక్ష సాగుతూ ఉండాలి!

సిగరెట్ వెలిగించాను. అగ్గిపుల్ల కాంతిలో ఏదో చూసి అటువైపు చూశాను. పిట్టగోడ సమీపంలో పక్క వేసుకుని ఒక యువకుడు నిద్రబోతున్నాడు. అతడు లుంగీలో వున్నాడు. పైన బనియన్ లేదు.

ముందుకు వంగి అతడిని లేపాను. అతడు కళ్ళు నులుపుకుంటూ లేచి నా వైపు చూశాడు.

"మిస్టర్ జయదేవ్!" అన్నాను.

అతడు నా వైపు కాస్సేపు చూశాడు.

"నా పేరు మీ కెలా తెలుసు?"

"ఈ ప్రాంతంలో నీ పేరు మారుమ్రోగుతోంది!"

అతడు నవ్వాడు.

"మీరు పెద్దమనిషిలా వున్నారు. ఇంత రాత్రివేళ యిలా వచ్చారేమిటి?"

"నీతో మాట్లాడాలి!"

"దేన్ని గురించి?"

"ఉష!" అన్నాను క్లుప్తంగా.

"ఉష యింటికి నేను వెళ్ళటం ఎప్పుడో మానేశాను సార్. రామారావుగారు నన్ను రావద్దన్నారు. పెద్దలు చెప్పింది నేను పాటిస్తూ వుంటాను."

"నిన్ను చూడకుండా ఆమె వుండగలదా?" అన్నాడు మెల్లిగా.

అతను తృళ్ళిపడ్డాడు.

"మీ రెందుకలా అంటున్నారు? ఇంతకీ మీ రెవరు?"

"డిటెక్టివ్ పరశురామ్‌ని. నే నలా అనడానికి చాలా కారణాలున్నాయి. పెద్దవాళ్ళ లోకం వేరు, యువతీ యువకుల లోకం వేరు. పెద్దవాళ్ళు డబ్బును దృష్టిలో వుంచుకొని అంతా చూస్తారు. పది చిన్న

వుద్యోగంలా పెద్దాళ్ళకు కనపడొచ్చు. ఈనాడు ఐదు వందలు సంపాదించే యువకుడే రేపు వెయ్యిరూపాయలు గడిస్తాడు. ఈ సత్యాన్ని పెద్దలు చూడరు. జీవితం వడ్డించిన విస్తరిలా వుండాలంటారు!"

"బాగా చెప్పారు, సార్. ఉషకు నేనంటే యిష్టమే కాని ప్రస్తుతం ఆమె తలిదండ్రులకు వ్యతిరేకంగా వెళ్ళదల్చుకోలేదు."

"ఇవాళ రాత్రి ఆమెను కల్సుకొన్నావా?"

"ఎలా, సార్? అటువైపు వెళ్ళటం మానేసేగా!"

"అలా అని రామారావుకి చెప్పావు. మనసుంటే మార్గం దొరకదా!"

అతడు నవ్వాడు. పైకి చూశాడు. లేచి నిలబడి ఆమె యింటివైపు చూశాడు. లైట్లు వెల్గుతున్నాయి. ఆ కాంతిలో డాబామీద తిరిగే వాళ్ళను చూశాడతను.

"ఏమిటి సార్ ఆ హడావిడంతా?" ప్రశ్నించాడు జయదేవ్.

అతడి ముందుకు కదిలాను.

"మిస్టర్ జయదేవ్, శాడ్ న్యూస్! ఉషను ఎవరో చంపేశారు!"

అతడు కుప్పలా నేలమీద పడిపోయాడు. క్షణకాలం అతడు మాట్లాడలేదు.

"జయదేవ్, బి బ్రేవ్! పోయిన ఉష రాదు! ఇవాళ ఆమెను కల్సుకొన్నావా?"

"ఏం చెప్పమంటారు?"

"నిజం చెప్పమంటాను."

"వెళ్ళాను సార్. డాబామీదనుంచి ఆమె గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. గ్రీన్ సిగ్నల్ అంటే లైట్ ఆర్పే

యాటం! నేను మెట్లెక్కి పైకి వెళ్ళాను."

"ఆమెతో ఎంతసేపు వున్నావు?"

"చాలా సేపున్నాను. తొమ్మిది ప్రాంతంలో కిందకు దిగి వెళ్ళిపోయాను. ఆయన బాల్కనీలో నిలబడివున్నారు. నన్ను గుర్తుపట్టారో, లేదో!"

"నువ్వు వెళ్ళగానే డాబామీది లైట్ ఆమె ఆన్ చేసిందా?"

"లేదు. ఆమె కిందకు వెళ్ళిపోయి వుంటుంది. భోజనం చేసి పడుకో నేముందు నేనటువైపు చూశాను. డాబా మీద లైట్ లేదు. ఆమె కిందకు వెళ్ళుంటుందనుకొని నిద్రపోయాను."

"రాత్రి తిరిగొచ్చాక నువ్వు ఆ డాబావైపు చూశావు. ఎవరేనా నీకు కనిపించారా?"

"చీకట్లో ఎవ్వరూ కనపడరు సార్. లైట్ వుంటే కనిపిస్తారు."

"నువ్వు వచ్చే టైముకి ఆమె లైట్ ఎందుకు ఆఫ్ చేసింది?"

"ఇరుగుపొరుగు వాళ్ళ కంట పడ్డం మంచిదికాదని."

"చీకట్లో మీరు ఏం చేశారు?"

"తీయగా కబుర్లు చెప్పుకొన్నాం. నేను వృద్ధిలోకి వస్తానని ఆమెకు బాగా నమ్మకముంది. తన తండ్రి మా పెళ్ళికి ఒప్పుకొంటారని ఆమె విశ్వాసం. కొంతకాలం పాటు తండ్రికి తెలియకుండా కల్సుకొందామంది. వాళ్ళు టి.వి.లో మునిగివున్నప్పుడు మేం కల్సుకొనేవాళ్ళం!"

"హఠాత్తుగా ఎవరైనా పైకివస్తే?"

"మీరు అడిగితే జ్ఞాపకమొచ్చింది. ఒక రాత్రి నేను ఆమెతో కూర్చునివుండగా పాదాల చప్పుడు వినపడింది.

గాభరాపడ్డాను. ఆమె నీళ్ళ టాంక్ వైపు చూపించింది. టాంక్ మూతను పైకెత్తి లోపలదాక్కొన్నాను. ఆమె లైట్ వేసింది. సందులోంచి చూశాను. వెళ్ళొచ్చిన వ్యక్తి రామారావుగారు కాదు."

"ఎవరు?"

"కిందావిడ తమ్ముడు ద్వారై. అతడు ఉషతో మాట్లాడ్డానికి ప్రయత్నించాడు. ఆమె ఇంట్రెస్టు చూపటంలేదని గ్రహించి వెళ్ళిపోయాడు. అతడు పోయాక ఆమె లైట్ ఆఫ్ చేసింది. టాంక్ లోంచి నేను బయటకు దూకాను. పాంట్, చొక్కా కొంతభాగం బాగా తడిశాయి. ఎవరొచ్చినా ఆ టాంక్ బెస్టు హైడింగ్ ప్లేస్!" అన్నాడు జయదేవ్.

"మీ యిద్దరి ప్రేమా ఎంతవరకూ వెళ్ళింది?"

"ఆమెనొక దేవతలా నేను చూసేవాడిని సార్. దగ్గరగా కూర్చున్నా ఆమెను నేనెన్నడూ ముట్టుకొనేవాడిని కాదు. మాట్లాడుకొంటూ యిద్దరం ఆనందించేవాళ్ళం."

అతడి చెయ్యి పట్టుకొన్నాను.

"ద్వారైని గురించి ఆమె నీతో ఏదేనా చెప్పిందా?"

"ఒకసారి ఆమె రోడ్డమ్మట వెళ్తూంటే ద్వారై వెంట పడ్డాడట. మర్యాద కోసం కొంత దూరం అతడితో వెళ్ళిందామె. తర్వాత ఏదో చెప్పి అతడిని వదిలించుకొందట. అతడు మంచివాడని కాదని ఆమె నాతో అంది."

"ద్వారైని గురించి నీకేం తెలుసు?"

"అతడి అసలు ఊరు పుదుక్కోట. అక్కడ అతను పాడైపోయాడు. తండ్రి అతడిని అక్క యింటికి

పంపాడు. స్థలం మారితే అతడు మారొచ్చని తండ్రి అనుకొన్నాడు. ఇక్కడికొచ్చాక అక్క యింట్లో అవీ, యివీ మాయమయ్యేవి. దానితో ఆమె అతడిని వేరే వుండమంది. దొరై తేనాంపేటలో గది తీసుకొన్నాడు."

"అతడు వుద్యోగం కోసం నిజంగా ప్రయత్నిస్తున్నాడా?"

"వుద్యోగం దొరికినా దాన్ని నిలబెట్టుకొనే వ్యక్తి కాడతను. ఒకసారి నాటుసారా తాగి రైలుపట్టాల పక్కనే తూలుతూ పోతుంటే నేనతడిని చూశాను" అన్నాడు జయదేవ్.

"విజయ ఎటువంటిది?"

"ఆమె చాలా మంచిది. ఎవర్కీ ఏ హానీ చేయదు. అన్ని విధాలా సహాయపడుతుంది. అందుకే ఆమె అతడిని పొమ్మంది. అక్కకు తెలియకుండా దొరై వక్రమార్గంలో వెళ్తూ వుంటాడు."

వెనక్కు తిరిగి మెట్లవైపు నడిచాను. అతడు నా వెనకనే వచ్చాడు.

"పరశురామ్‌గారూ, ఒకసారి నేనొచ్చి ఆమెను చూడొచ్చా?"

"నువ్వు పూజించిన రూపం యిప్పుడు ఆమెలో లేదు!"

"రూపం మారినా, నా హృదయంలో ఆమె మీద ఏర్పడిన ప్రేమ యీ జీవితంలో తరగదు సార్!" అన్నాడతను వుద్రేకంతో.

"అనేకమంది వెళ్ళి ఆమెను చూస్తున్నారు. నువ్వూ వెళ్ళి చూడొచ్చు! ప్రస్తుతం రామారావుగారు విచారంలో మునిగివున్నారు. వెళ్ళి ఆయన్ని ఓదార్చు!" అని మెట్లు దిగాను.

రోడ్డుమీదునుంచి పెకిచూశాను. జయదేవ్ జీవం లేనట్లు, నా వైపు చూస్తున్నాడు.

4

పెడాబామీదకు చేరుకొన్నాం. డాక్టర్ సుధాకర్, ఇన్స్పెక్టర్ నాయర్ నా వైపు వచ్చారు.

"బ్రదర్, డాక్టర్ సుధాకర్ చెప్పేది నువ్వు వినాలి!" అన్నాడు నాయర్.

"పరశురామ్‌గారూ, ఉష అమానుషంగా రేప్ చేయిబడింది. ఆమె పోరాడింది. రేప్ చేసి ఆమెను చంపిన వ్యక్తి ఒంటిమీద గోళ్ళ రక్కులు వుండొచ్చు! ఆమెను టాంక్ నీళ్ళలో ముంచి అతడు చంపేశాడు" అన్నాడు డాక్టర్.

"ఆమె ఎప్పుడు మరణించి వుంటుంది?"

"తొమ్మిది తర్వాత! పోస్టుమార్టమ్ జరిగాక అంతా వివరంగా తెలుస్తుంది."

ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను. పొగవదులుతూ మరోసారి శవంవంక చూశాను. అందమైన ఆమె మొహం చూడ్డానికి ఘోరంగా వుంది. ఆమెపడ్డ బాధ ముఖంలో వ్యక్తమవుతోంది.

రామారావు, భార్య యింకా ఏడుస్తూనే వున్నారు. ఇన్స్పెక్టర్ నాయర్ నా దగ్గరగా వచ్చాడు.

"శవాన్ని మార్చురీకి పంపుతున్నాను" అన్నాడతను.

"నాయర్ భాయ్, నేను అలా ఒకచోటకు వెళ్ళి వస్తాను. నువ్వు నీ ఆఫీసులో వుంటావా?"

"అరగంటదాకా యిక్కడుంటాను" అన్నాడు నాయర్.

మెట్లు దిగి కిందకు వెళ్ళాను. డాడ్జికారులో కూర్చుని

తలుపు మూశాను. కారును మెల్లిగా ముందుకుపోనిచ్చాను. ఎదురుగా వస్తున్న వ్యక్తిని చూసి కారు ఆపాను.

జయదేవ్ విచార వదనంతో నావైపు చూశాడు.

"మిస్టర్ జయదేవ్, తొందరగా వెళ్ళు! ఆలస్యం చేస్తే శవం అక్కడ వుండదు" అన్నాను.

సమీపంలో వున్న మేడవైపు అతడు వేగంగా వెళ్ళాడు. కారును కుడివైపుకు తిప్పి పోనిచ్చాను.

ఇరవై నిమిషాల్లో తేనాంపేట చేరుకొన్నాను. నరసింహన్ రోడ్డు కనుక్కొనేసరికి తల ప్రాణం తోకకొచ్చింది. ఇరవై నంబరు ఇంటిముందు కారాపి దిగాను.

పెద్ద యిల్లు. ముందువైపున్న ఒక గదిలో లైటు వెలుగుతోంది. కిటికీ దగ్గరగా వచ్చి ఒకతను నావైపు చూసి, వెనక్కు జరిగాడు. పొడుగాటి నైట్ గౌన్లో వున్నాడతను. గేటు కటువైపున నిలబడ్డాడతను.

"ఎవరు కావాలి?" అడిగాడతను.

"దొరై" అన్నాను.

"అతడు పొద్దుట మహాబలిపురం వెళ్ళాడు. రేపు తిరిగివస్తానన్నాడు."

"అతడు ఎక్కడుంటున్నాడు?"

"ఆ గదిలో!" అని ఒక చీకటి గదివైపు చెయ్యి చూపించాడు.

అతడి దగ్గరగా వెళ్ళాను. దొరై ఫోటో చూడకుండా యింత దూరం వచ్చినందుకు విచారించాను. ఆలోచిస్తూ అతడివైపు పరీక్షగా చూశాను. పొట్టిగా, లావుగా వున్నాడు. క్రెజ్ సీవ్ కనుబొమ్మలు. ఏదో వాసన గాలిలో కొడ్తోంది. నాటు సారా వాసన!

"మిస్టర్ నీ పేరు?"

"రాజేశ్వరన్."

"ఆ గదిలో నువ్వు అద్దెకుంటున్నావా?"

"నేను అడ్వకేటు రామాచారిగారి కొడుకుని. ఒకే గది మేం దొరెక్కి అద్దెకిచ్చాం."

"నీతో మాట్లాడాలి!"

"చెప్పండి!"

"నీ గదిలో కెళ్దాం."

"ఇంత రాత్రివేళ మిమ్మల్ని గదిలోకి రానిస్తే నాన్నగారు తిడతారు."

"ఆయనతో కూడా మాట్లాడాలి."

అతడు తృళ్ళిపడ్డాడు.

"నాన్నగారు ఆరింటికి లేస్తారు. అప్పుడు రండి. మాట్లాడొచ్చు!"

"నువ్వు అప్పుడు వుంటావో, వుండవో!" అన్నాను.

"నేనెక్కడికి వెళ్తాను?"

"ఏ మహాబలిపురమో వెళ్ళొచ్చు!"

"నేనిక్కడే వుంటాను. ఏడువాకా నేను లేవను."

"నేను మళ్ళీ రాలేను. ఇప్పుడే నీతోనూ, నీ తండ్రితోనూ మాట్లాడాలి" అని గేటు తెరిచి లోపలకు వెళ్ళాను.

అతడు నాకడ్డుగా నిలబడ్డాడు.

"నాన్నగార్ని గురించి మీకు తెలియదేమో! ఆయన చాలా పేరుపొందిన లాయర్. క్షణంలో మిమ్మల్ని అరెస్టు చేయిస్తారు" అర్చాడతను.

అతడి చెయ్యిపట్టుకొని లైటు వెల్గుతున్న గదిలోకి యీడ్చుకుపోయాను. గోడమీదున్న మేకుకి వేళ్ళాడుతోంది ఒక ఫోటో. విజయ, ఆమె కొడుకులు ఆ ఫోటోలో

వున్నారు. గది చిందరవందరగా వుంది. చాపమీద పరుపు, నాలుగు తలగడలు. పక్కనే ఒక బాటిల్ వుంది. అందులో వున్నది నాటు సారా!

"దొరై అటువైపు గదిలో వుంటున్నాడా?" అడిగాను.

"చెప్పానుగా?"

"ఆ ఫోటో ఎవరిది?"

"అమ్మది. వాళ్ళు నా తమ్ముళ్ళు."

"నువ్వు, అమ్మనే మీ అక్కతో మాట్లాడే ఇక్కడి కొచ్చాను!"

అతడు సూటిగా నా వైపు చూశాడు.

"నేను మీతో ఎన్నో అబద్ధాలు చెప్పాను. ఇదంతా అక్కయ్యకు చెప్పకండి. నన్ను యింటికి రానివ్వదు."

"ఆవాళ నీ అక్కయ్య యింట్లో ఎంతసేపున్నావు?"

"ఇలా వెళ్ళి ఐదు నిమిషాల్లో బయటికొచ్చేశాను."

"అక్కడనుంచి ఎక్కడికి వెళ్ళావు?"

"చాలా చోట్లకు వెళ్ళాను. నాటు సారా అమ్మే పాకలోకి వెళ్ళి బాటిల్ నిండా పోయించుకొని బీచ్ కి వెళ్ళాను. అక్కడ కూర్చుని కొంచెం నాటు సారా తాగాను. బీచ్ నుంచి హోటల్ ఇరోజ్ కి వెళ్ళి భోజనం చేశాను. తర్వాత నా గదికి చేరుకొన్నాను."

"నీ అక్క యింట్లోంచి బయటకొచ్చి పైడాబా మీదకు వెళ్ళలేదా?"

"వెళ్ళలేదు సార్! మేడమీదివాళ్ళు డాబామీదుంటే అక్కడకు వెళ్ళొద్దని అక్కయ్య నాకెన్నిసార్లో చెప్పింది. వాళ్ళుండగా ఎప్పుడూ పైకి వెళ్ళను. వెనక్కితిరిగి వచ్చేస్తాను."

"ఉష నీకు తెలుసా?"

"నేను విజయ తమ్ముడినని ఆమెకు తెలుసు. ఆమె రామారావుగారి కూతురని నాకు తెలుసు. ఆమె బి.ఎ. చదువుతోందని విన్నాను. నేను 10దో స్టేండర్డు కూడా పాసవలేదు. అంత చదువుతున్న యువతులంటే నాకు భయం సార్."

"నువ్వొకసారి డాబామీదకు వెళ్ళి ఆమెతో మాట్లాడానికి ప్రయత్నించావని విన్నాను!"

"రైట్! ఒకసారి పైకెళ్ళాను. ఆమెను చూసి వెనక్కి వెళ్ళిపోయాను. ఆమే నన్ను పలకరించింది. ఆమె ఇంగ్లీషు నాకర్థంకాలేదు. కాస్సేపు అక్కడ నిలబడి నేను వెళ్ళిపోయాను."

"ఆమె బజార్‌కి వెళ్తూంటే వెంటబడ్డావా?"

"ఒకసారి గబగబా వెళ్ళి ఆమెను కల్సుకొన్నాను. కాఫీ పొడుం కొనమని ఆమెతో చెప్పమని రామారావుగారు అన్నారు. ఆమెతో ఆ విషయం చెప్పి నేను వెళ్ళిపోయాను."

"రామారావుగార్ని అడిగితే నీ అబద్ధం బయట పడుంది."

"అడగండి! నేను చెప్పింది నిజమని తేల్తుంది" అన్నాడతను.

క్షణకాలం ఆలోచిస్తూ ఉండిపోయాను. ఇదంతా విచిత్రంగా వుంది. నా అనుమానం యితడిమీద కేంద్రీకృతమైంది. కాని ఇప్పుడు ఇదంతా నిజం కాదనిపిస్తోంది.

"ఇదంతా మీరు నన్ను ఎందుకడుగుతున్నారు?"

"ఉషను యీ రాత్రి ఎవరో హతమార్చారు!"

షాకయినట్లు అతడు నా వైపు చూశాడు.

"అక్కడ శ్యామ గాభరాపడ్తూ వుంటుంది. నేను అక్కడి కెళ్ళాలి!"

"ఆమె కెందుకు గాభరా?"

"తన యింట్లో హత్యజరిగింది. అది యింటికి అశుభం. రామారావు గారు మేడ ఖాళీచేసి పోవచ్చు. హత్య జరిగిన ఫ్లాట్ లోకి ఎవ్వరూ అద్దెకు రారు."

"జయదేవ్ తెలుసా?"

"ఆతడిని చూశాను సార్. ఉష యింటికి తరచు వచ్చే వాడు. వాళ్ళిద్దర్నీ కాసినో థియేటర్లో ఒకరోజు చూశాను. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకొంటారని యిరుగుపొరుగువాళ్ళు అనుకొంటుంటే విన్నాను. అది ఎంతవరకూ నిజమో నాకు తెలియదు!"

ఆతడివైపు సూటిగా చూశాను.

"వెళ్ళి ఆమె శవాన్ని చూసే అంత స్నేహం ఆ కుటుంబంతో నాకు లేదు సార్."

గది నలువైపులా చూశాను. ఒక మూల న్యూస్ పేపర్ తో చుట్టిన పాకెట్ పడుంది. దానివైపు నడిచాను. వంగి పాకెట్ ను తీయబోయాను. అతడు వేగంగావచ్చి పాకెట్ ను పట్టుకొన్నాడు.

"పెద్దలు! ఇది మీకు అనవసరం సార్!"

"అందులో ఏముంది?"

"మాసిన గుడ్డలు లాండ్రీకివ్వాలని పేపర్ లో పాక్ చేసి వుంచాను."

"మాసినవా, తడిసినవా?" అన్నాను గంభీరంగా.

అతడు జవాబివ్వలేదు. పాకెట్ ను తీసుకొని గుమ్మం వైపు కదిలాడు. అమాంతంగా అతడివైపు దూకాను. నా కుడిచెయ్యి అతడి చంపకు యినపకడ్డీలా తగిలింది.

అతడు కిందపడ్డాడు.

పాకెట్ విప్పి చూశాను. పాంట్, అండర్ వేర్, బనియన్, షర్టు! అన్నీ తడిగా వున్నాయి. వాటిని పరీక్షించాను.

నేలమీద పడున్న దొరై మూలుగుతున్నాడు. అతడి దగ్గర కెళ్ళి అతడి ధరించిన నైట్ గౌన్ని విప్పేశాను. అడుగున మరే దుస్తులూ లేవు!

ఛాతీమీద తొడలమీద గోళ్ళతో రక్కిన గాట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. కళ్ళు తెరిచి అతడు నావంక చూశాడు.

అతడి చేతులు, కాళ్ళు వణుకుతున్నాయి.

"రాస్కెల్, గెటప్!" అర్చాను.

అతడు లేచి కూర్చున్నాడు.

"ఉషను ఎందుకు చంపావు?" గర్జించాను.

"నేను చంపలేదు."

"పొట్ట చీల్చినా నువ్వు నిజం చెప్పవు. అందుకే కన్న తలిదండ్రులు నిన్ను యీ పట్నానికి పంపి చేతులు కడుక్కున్నారు. అక్కయ్య తనింట్లోనుంచి నిన్ను బయటకు పొమ్మంది!"

అతడు మాట్లాడలేదు. మొహాన్ని చేతుల్లో కప్పేసుకున్నాడు. తడిసిన గుడ్డల్ని పేపర్ లో చుట్టాను.

"గెటప్! నువ్వు నాతో రావాలి!"

"నాకేం తెలియదు సార్!"

నా చెయ్యి పైకిలేచింది. అతడు వెనక్కు జరిగాడు. అతడిని లేవదీశాను. నైట్ గౌన్ని సరిగ్గా కట్టుకోమన్నాను. పాకెట్ని అతడికిచ్చాను.

"బయటకు పద!" అర్చాను.

అతడు గుమ్మం దాటాడు. తలుపుమూసి గదికి తాళం వేశాను. తాళంచెవిని నా జేబులో పడేసుకొన్నాను.

"కారు దగ్గరకు నడువు!"

ముందు తలుపు తెర్చి అతడిని కూర్చోమన్నాను. అతడి చేతులకు బేడీలు వేశాను. తలుపు మూశాను. సిగరెట్ వెలిగించి, స్టీరింగ్ వీల్ వెనక్కు జరిగాను. కారును పోనిచ్చాను.

కారు వేగంగా కదులుతోంది. ద్వారై మౌనంగా కూర్చున్నాడు. చల్లటి గాలి వీస్తోంది. నా మెదడులో ఉష రూపం కదిలింది. బాగా చదువుకొంటున్న యువతి! చక్కని చుక్క! ఈ దుర్మార్గుడి కామానికి ఆ అమాయకురాలు బలై పోయింది.

పళ్ళు పటపట కొరికాను. పిడికిలి బిగించాను. ఇటువంటి కిరాతకులను రోడ్డుమధ్య నిలబెట్టి కమ్చీతో కొట్టాలి! అలా చేస్తేగాని వీళ్ళకు బుద్ధి రాదు!

## 5

ఇన్స్పెక్టర్ నాయర్ ఎదురుగా కూర్చున్నాను. ద్వారై గోడవారగా స్టూల్ మీద మా సమీపంలో కూర్చున్నాడు. అతడి కిరువైపులా కానిస్టేబుల్సు నిలబడ్డారు.

ఇన్స్పెక్టర్ నాయర్, నేనూ అతడిముందుకు వెళ్ళాం. మా వైపు భయంతో చూశాడతను.

"ఇవాళ జరిగినదంతా చెప్పు! అబద్ధం చేస్తే పళ్ళూడ్తాయి!" గద్దించాను.

"వెళ్ళిపోతున్నానని అక్కయ్యతో చెప్పి బయట కొచ్చాను. మేడమెట్లెక్కి పైకి వెళ్ళాను. లైటు వెల్గ

తోంది. అక్కడ ఎవ్వరూలేరు. ఆమె పుస్తకాలు వున్నాయి. ఆమె కోసం వేచివున్నాను.

"ఎవరో పైకివస్తున్నారు. నీళ్ళటాంక్ మూతను వెనక్కి నెట్టి లోపల దాక్కొన్నాను. మూతను మూసేసి కొద్దిగా ఎత్తి పట్టుకొన్నాను. అమాంతంగా లైట్ ఆరి పోయింది. ఉష, మరో వ్యక్తి చాపమీద కూర్చున్నారు. నన్ను వాళ్ళు గుర్తించలేదు. కొంతసేపయ్యాక చీకటికి నా కళ్ళు అలవాటుపడ్డాయి. వాళ్ళిద్దరూ దగ్గరగా పక్కపక్కనే కూర్చున్నారు.

"అతడు జయదేవ్ అని గ్రహించాను. వాళ్ళు తీయగా కబుర్లు చెప్పుకొంటున్నారు. ఇద్దరూ కౌగలించుకొని ముద్దెటుకొంటున్నారు. అదంతా చూస్తుంటే నీళ్ళలో కూర్చున్న నా ఒళ్ళు వేడెక్కుతోంది!

"అతడు చాలాసేపు వున్నాడు. సమీపంలో వున్న గోడగడియారం తొమ్మిదికొట్టాక అతడు వెళ్ళిపోయాడు. ఆమె లైట్ ఆన్ చేసి చదవడం ప్రారంభిస్తుందేమో అనుకొన్నాను. కాని ఆమె లైట్ ఆఫ్ చేయలేదు. కలలు కంటూ చాపమీద పడుకొంది.

"అటువంటి సమయం కోసమే ఎదురుచూస్తున్నాను. మెల్లిగా బయటకు దిగి ఆమె దగ్గరకెళ్ళాను. ఆమె నిద్ర పోతోంది! వెల్లకిలా పడుకొన్న ఆమెవంక చూశాను. జాకెట్, బ్రా పైకి తొలగివున్నాయి. నగ్నంగా వున్న ఆమె స్తనాలవైపు చూశాను.

"ఆమెమీద వాలిపోయాను. ఆమె మేలుకొంది. నన్ను గుర్తించింది. అరవబోయింది. నోరు నొక్కేశాను. ఆమె నాతో ఆడసింహంలా పోరాడింది. కాని ఆమె అబల! నా బలాన్ని ఎదిరించలేకపోయింది. నా కామాన్ని

తనివితీరా తీర్చుకొన్నాను" అన్నాడు చౌరై.

"ఆమె నెందుకు చంపావు?" అడిగాడు యిన్స్పెక్టర్ నాయర్.

"నన్నామె గుర్తుపట్టింది. నా గురించి అక్కయ్యతో చెప్తుంది. ఆమె నోరును శాశ్వతంగా నొక్కేయాలి. అటువైన నాకు ప్రమాదం వుండదు. నేను డాబామీదకు వెళ్ళటం ఎవ్వరూ చూడలేదు. జయదేవ్ ఆమెతో చాలాసేపున్నాడు. అనుమానం అతడిమీదకు వెళ్తుంది. అలా ఆలోచిస్తూ ఆమెవైపు చూశాను. ఆమె మూలుగుతోంది. ఆమెను ఎత్తి తీసుకువెళ్ళి టాంక్‌లో పడేశాను. ఆమె లేవబోయింది. టాంక్‌లోకి దిగి ఆమెను నొక్కిపట్టుకొన్నాను. కొన్ని క్షణాల్లో ఆమె మరో లోకానికి చేరుకొంది. బయటకు దూకి మెట్లు దిగి, వెళ్ళిపోయాను."

అతడివైపు సూటిగా చూశాను.

"మంచి కుటుంబంలో పుట్టి నువ్విలా ఎందుకు పిశాచంగా మారిపోయావు?" ప్రశ్నించాను.

"గారాబంగా పెరిగాను. పెద్దవాడినయ్యాను. నాకు చదువు రాలేదు. నాన్న నాకు డబ్బివటం మానేశాడు. నేను బాగుపడ్డాననుకొన్నాడు. కాని నేనింకా పాడైపోయాను. ఇంటి దొంగనయ్యాను. ప్రతిరోజూ ఇంట్లో ఏదో మాయమవుతూ వుండేది. డబ్బును దొంగిలించినట్లే నా కామాన్ని కూడా రేప్ ద్వారా తీర్చుకొనేవాడిని' అక్కడుంటే వాళ్ళ గౌరవం దెబ్బతింటుందని భయపడి నన్ను యిక్కడకు పంపేశారు. ఈ పట్నంలో విజయాన్ని సాధించే క్వాలిఫికేషన్‌లు నాకు లేవు!

"అక్కయ్య యింట్లో దొంగతనం మొదలెట్టాను. ఒకరోజు పనిమనిషి కూతుర్ని బలాత్కరించాను. రెండు

వందలిస్తే నోరు మూసుకొంటానంది పనిమనిషి. అక్కయ్య బంగారు గాజులు అమ్మేసి, డబ్బు చెల్లించి పనిమనిషి నోరు నొక్కేశాను. కాని అక్కయ్య తన గాజుల విషయంలో నన్ను అనుమానించింది. ఇల్లు వదిలి పొమ్మంది. మరేం గత్యంతరంలేక తేనాంపేటలో గదితీసుకొన్నాను. అటుపైన అంతా మీకు తెలిసిందే!" అని దొరై కళ్ళు మూసుకొన్నాడు.

ఇన్స్పెక్టర్ నాయర్ తన కుర్చీలో కూలబడ్డాడు. పైన ఫాన్ తిరుగుతోంది. అతడి ఎదురుగా నిలబడ్డాను.

"నాయర్ భాయ్, వెళ్ళాలి!" అన్నాను.

"కేక్స్, టీ తెప్పిస్తాను. అవి సేవించాక వెళ్ళు బ్రదర్" అన్నాడు.

కుర్చీలో కూర్చుని మరో సిగరెట్ వెలిగించాను. ఇన్స్పెక్టర్ నాయర్ బెల్ నొక్కాడు. దొరైని కానిస్టేబుల్స్ లోపలకు తీసుకుపోయారు.

—: ఐ పో యిం ది :—

కొత్త సీరియల్ ప్రారంభం




"వకుళా_ఓసారి రామ్మా_" అంది శారద.

"వస్తున్నా పిన్నీ! అంటూ" తోముతున్న గిన్నెల్ని పక్కన పెట్టి చేతులు కడుక్కొని పరికిణీకి తుడుచుకొంటూ హాల్లోకి వచ్చింది వకుళ.

హాల్లో శారదకు ఎదురుగా ఓ బట్టల మూటలవాడు

కూర్చునివున్నాడు. శారద వకుళను చూస్తూనే—"వీటిల్లో పరికిణీలకే గుడ్డలు బాగుంటాయో చెప్పవే!" అంది.

వకుళ చకచకా అక్కడి గుడ్డలన్నీ చూసి ఓ గుడ్డను ఎన్నిక చేసింది.

"సరే—నువ్విక వెళ్ళు—" అంది శారద.

వకుళకు ఇంకా అక్కడే వుండి బట్టల బేరం చూడాలనుంది. ఏమేమో అడగాలని వుంది. కానీ అన్నీ మనసులోనే అణచుకొని నిరుత్సాహంగా దొడ్లోకి వెళ్ళి అంట్లు తోమసాగింది.

తను ఎన్నిక చేసిన ఆ గుడ్డ తనకోసం కాదని వకుళకు తెలుసు. ఆ గుడ్డ శారద కూతురు రమ కోసం! రమ ఎవరో కాదు—వకుళకు చెల్లెలే....

వకుళకు రెండేళ్ళప్పుడు ఆమె తల్లి ప్రమాదవశాత్తు మరణించింది. వకుళ తండ్రి జోగారావు ఏడాది తిరక్కుండా పెళ్ళి చేసుకున్నాడు. ఆ దంపతులకు వివాహమైన సంవత్సరానికే రమ పుట్టింది. శారదకో మగపిల్లాడు కూడా పుట్టాక జోగారావు ఆపరేషన్ చేయించుకొన్నాడు.

శారదకు సవతి కూతురంటే ఏమాత్రం ఇష్టంలేదు. అందువల్ల ఊహ తెలిసినప్పట్నించీ వకుళ కష్టాలన్నవి తప్ప ఎరుగదు. మొదట్లో ఆమె తన బాధ తండ్రికి చెప్పుకుందామని ప్రయత్నించింది. జోగారావు వకుళను గొడ్డును బాదినట్లు బాది—"పిన్ని మీద నేరాలు చెప్పావంటే నిన్ను చంపేస్తాను—" అన్నాడు. శారద అడ్డుపడబట్టి కానీ అతనా పిల్లను అప్పుడే చంపేసి వుండేవాడు.

అప్పట్నించి వకుళకు తండ్రి అంటే భయం పట్టు

కొంది. అతడి పేరు చెబితేనే వణికిపోయేది.

జోగారావు తనంటే చాలా ఇష్టపడతాడని శారదకు తెలుసు. కానీ తనకోసం కన్నకూతుర్ని అంతలా బాదేస్తాడని ఆమె అనుకోలేదు. ఈ సంఘటన ఆమె ధైర్యాన్ని పెంచింది. ఆ రోజున్నుంచీ ఆమె వకుళను అష్టకష్టాలు పెట్టసాగింది. ఎటొచ్చీ భర్తకు మాత్రం వకుళమీద పితూరీలు చెప్పేదికాదు. అతనెప్పుడైనా — "వకుళ బుద్ధిగా ఉంటోందా?" అని అడిగితే—"చిన్నపిల్ల. అదెలాగున్నా నేను సర్దుకుపోతాను. మీరు దానిగురించి పట్టించుకోకండి—" అనేది.

సవితి కూతురు విషయంలో ఎలా వున్నా శారద చాలా కలుపుగోలు మనిషి. వీధిలో అంతా ఆమె అంటే ఇష్టపడేవారు. అందరిలోనూ ఆమె ఎంతో మంచిగా ఉండేది. అందువల్ల వకుళకు తన కష్టాలగురించి ఎవరితో చెప్పుకోవాలో తెలిసేదికాదు. ఆమె మనసులో దుఃఖం, పగ రోజు రోజుకూ పేరుకుపోతూండేవి.

పాసిపోయిన అన్నం, నిలవకూరలు, కుళ్ళినపళ్ళు— ఇవే వకుళ ఆహారం. ఇంట్లో ఆమెకు ఎప్పుడూ ఏదో ఒక పని ఉండేది.

శారద చాలా తెలివైనది. వకుళను తను కష్టపెడుతున్నట్లు బయటవాళ్ళకు తెలియకుండా ఉంచడానికి విశ్వప్రయత్నాలు చేసేది. వకుళను స్కూల్లో జేర్పించింది. స్కూలుకు కట్టుకొనేందుకు మంచిబట్టలే యిచ్చేది. వకుళకు అన్ని పుస్తకాలూ కొనేది. కానీ యింటికిరాగానే అవన్నీ దాచేసేది.

వకుళకు ఇంట్లో చదువుకుందుకుగానీ, హోంవర్క్ చేయడానికిగానీ అవకాశముండేదికాదు. ఇంటికి రాగానే

దాచివేసిన పుస్తకాలు—మళ్ళీ స్కూలుకు వెళ్ళేసమయంలో ఇచ్చేది. ఆ కారణంగా వకుళ స్కూల్లో టీచర్ల చేత తిట్లు తినేది. ఆమె బాధ యెవరికీ తెలియదు. వకుళ హోంవర్క్ చేయడంలేదని ఇంటికి ఫిర్యాదు వెళ్ళిందంటే తండ్రి చంపేస్తాడు. ఆఖరికి ఒక రోజున విధిలేక వకుళ అంది లెక్కల మాస్టారికి తన గోడు చెప్పుకుంది.

ఆయన ఇది విని ఆశ్చర్యపోయాడు. వకుళపై ఆయనకు అంతులేని జాలికలిగింది. లెక్కల మేస్టరు తన భార్య ద్వారా శారదకు సందేశం పంపించాడు.

ఆ సందేశం విని శారద ఆశ్చర్యపోయింది. అయితే ఏ మాత్రమూ కోపం తెచ్చుకోలేదు.

"పగవాడికి కూడా ఈ సవతిపిల్లలు వద్దమ్మా!" లెక్కల మేస్టరు భార్యతో.

"ఆయనకు అదంటే కోపం. అది పుట్టాకే ఆరోగ్యం చెడి తన మొదటి భార్య పోయిందని ఆయన నమ్మకం. ఏదో వంక పెట్టుకొని ఆయన దాన్ని నాలుగు వేయాలని చూస్తారు. మగాళ్ళున్నట్లు మనముండగలమా చెప్పండి. నేను అయిందానికీ, కాని దానికీ దాన్ని వెనకేసుకు వస్తున్నానని ఆయనకొక్కపం కూడాను.

దానికి తగ్గట్టే అది కోతి. చేసే అల్లరి ఇంతా అంతా కాదు. ఏదో వంకపెట్టి చిన్నపిల్లలిద్దర్నీ ఏడిపిస్తుంది. తను పనిచెయ్యదు. నన్ను చేసుకోనివ్వదు. అటు దానితో వేగలేక—ఇటు ఆయనకు చెప్పుకోలేక నానా అవస్థ పడుతున్నాను. సవతి తల్లిని గదా నాకు చెడ్డ పేరొస్తుందేమోనని భయం.

నా భయం కనిపెట్టి అది నన్ను లోకువ కట్టేసింది. తనను చదువుకోమని చెప్పినా, అల్లరి చెయ్యొద్దని హెచ్చ

రించినా నామీద నేరాలు ఇరుగుపొరుగులకు చెప్పే స్తానని బెదిరిస్తుంది. చిన్నపిల్లని ఉపేక్షిస్తున్నాను. కానీ దాని తప్పుల్ని నా నేరాలుగా మారుస్తూంటే ఎంత కాలం సహించేది?''

శారద ఉపన్యాసం లెక్కల మేస్టరు భార్య ఓపికగా వింది. శారదలో విశేషమిదే! ఎదుటి వాళ్ళను మంత్ర ముగ్ధుల్ని చేసే తెలివితేటలు, వాక్చాతుర్యం ఆమె కున్నాయి.

లెక్కల మేస్టరు భార్య యింటికి వెళ్ళి—"చూస్తే తప్పంతా ఆ వకుళదే లాగున్నదండీ. ఆవిడ ఎంతో మర్యాదస్తురాలు. నెమ్మదైన మనిషి. ఇరుగూ పొరుగూ కూడా ఆవిడ గురించి ఎంతో గొప్పగా చెప్పారు—" అన్నది.

కథ ఇక్కడితో ఆగలేదు. జరిగిన విషయం శారద భర్తకు చెప్పింది. అతను కాలరుద్రుడైపోయి కూతుర్ని బెల్టు పుచ్చుకొని చావబాదాడు. తనకు తృప్తికలిగాక తనే అడ్డుపడింది శారద.

"ఈ రోజునుంచీ దీన్ని చదువు మానిపించేయ్—" అన్నాడు జోగారావు.

"వద్దండీ—సవతి తల్లి మానిపించిందని అంతా నన్నే ఆడిపోసుకుంటారు—" అంది శారద.

కానీ జోగారావు అంతటితో ఊరుకోలేదు. మర్నాడతను వకుళను స్కూలుకు తీసుకువెళ్ళి క్లాసులో విద్యార్థులందరి ఎదురుగా—"ఇది నా కూతురేగానీ చాలా అల్లరిపిల్ల. ఇంట్లో హోం వర్క్ చేయమని ఎంత మొత్తుకొన్నా వినదు. చెప్పలేక చస్తున్నాం. ఇది చెప్పే అబద్ధాలు నమ్మకండి. దీనికి మీరే శిక్ష విధించినా నా

అనుమతి తీసుకోనవసరంలేదు_" అని లెక్కల మేస్టరుకి చెప్పాడు.

ఈ సంఘటన తర్వాత వకుళ అటు విద్యార్థులకూ, ఇటూ టీచర్సుకూ కూడా ఎంతో లోకువై పోయింది. తన దుర్గతికి ఆమె ఒంటరిగా కూర్చుని కుమిలికుమిలి ఏడ్చేది.

వకుళ క్లాసులోనే హోం వర్క్ చేసుకొందామని ప్రయత్నించేది. కానీ కొంటెవిద్యార్థులది సాగనిచ్చేవారు కాదు. ఇంట్లో ఎలాగూ కుదిరేది కాదు.

పిన్నికి పుట్టిన బిడ్డలు తనతో స్నేహముగా ఉంటారేమోనని వకుళ ఆశించింది. కానీ దుష్ప్రవర్తనలో వాళ్ళు తల్లిని మించిపోయారు. ఇద్దరూ కూడా ఆమెను పని మనిషికన్నా హీనంగా చూసేవారు.

ఇంట్లో, వీధిలో, స్కూల్లో—ఇలా ఎక్కడచూసినా తనకు శత్రువులే కనబడేసరికి వకుళకు ఈ ప్రపంచం మీదనే కసి, ద్వేషం ప్రారంభమయ్యాయి.

అప్పుడప్పుడామె తల్లిని తలచుకొని — "అమ్మా! ఎక్కడున్నావమ్మా నన్ను కనేసి ఇలా వదిలేసి పోయావా?" అని కన్నీరు మున్నీరుగా ఏడ్చేది.

దేవుడిముందు నిలబడి—"నువ్వంటూ ఉంటే ఏం తప్పుచేశానని నాకిన్ని కష్టాలు రాసిపెట్టావు?" అని పిచ్చిగా ప్రశ్నలు వేసేది.

ఈ ప్రశ్నలకెప్పుడూ సమాధానాలు లభించేవికావు. సవతి తల్లి శిక్షలు మాత్రం క్రొత్త పుంతలు తొక్కుతూండేవి.

పండుగలు వస్తే శారద వకుళను ఆప్యాయంగా పిలిచి—"నీకేం ఇష్టమో—చెప్పవే!" అనేది. ఆమె

కిష్టమైనవన్నీ చేసేది. కాని ఒక్కటి కూడా వకుళకు పెట్టేదికాదు. రెండు రోజులు పోయాక అవన్నీ పాడైనాక అప్పుడు వకుళకు పెట్టేది.

అలాగే బట్టలు కూడాను! వకుళకేమేం ఇష్టమో—అవే తన పిల్లలకు కొనేది.

వకుళ మనసును ఏదో విధంగా బాధించటమే ధ్యేయంగా ఉండేదామెకు.

పరికిణి గుడ్డ ఎన్నిక చేసి అంట్లు తోముతూ వకుళ— "ఈ మనుషులందరి మీదా పగతీర్చుకొనే శక్తి నాకు ప్రసాదించు భగవాన్—" అనుకొంది.

## 2

అప్పుడు వకుళకు పదమూడేళ్ళు.

ఇంట్లో ఆమె ఒక్కర్తె వుంది. ఆమెను ఇంటికి కాపలాగా పెట్టి అంతా సినిమాకు వెళ్ళారు.

ఇంటిముందు నిలబడి ఎవరో పిలుస్తున్నట్లనిపించి వకుళ వెళ్ళి తలుపుతీసింది.

"సోదె చెబుతానమ్మ—సోదె చెబుతాను—" అంది సోదెమనిషి.

ఇంట్లో ఎవరూ లేరని చెప్పింది వకుళ.

"నువ్వున్నావు కదమ్మా—" అంది సోదె మనిషి.

"నాకేం చెబుతావు?" అంది వకుళ.

"పోయినోళ్ళు సోదిలోకి వచ్చి మాట్లాడతారు—" అంది సోదె మనిషి.

"మా అమ్మ వస్తుందా?" అనడిగింది వకుళ ఆత్రుతగా.

"మీ అమ్మ చనిపోయిందా?" జాలిగా అడిగిందా మనిషి.

"అవును. చనిపోయింది. నేను మా అమ్మతో

మాట్లాడాలి. ఎన్నో చెప్పుకోవాలి. వీలవుతుందా?"
ఆత్రుతగా అడిగింది వకుళ.

సోది మనిషి క్షణం తటపటాయించి—"శేరు బియ్యం తీసుకొచ్చి నా చేటలో పొయ్యి. మీ అమ్మను పిలుస్తాను. నువ్వు మాట్లాడుదువు గాని—" అంది.

వకుళ తక్షణం ఇంట్లోకెళ్ళి శేరు బియ్యం తీసుకువచ్చి సోది మనిషి చేటలో పోసింది.

సోది మనిషి కాసేపు దేవతలందర్నీ స్మరించి చేటలో ఏవేవో గీతలు గీసింది. తర్వాత నెమ్మదిగా—"నే నే వకుళా—మీ అమ్మని—" అంది.

"అమ్మా—" అంది వకుళ ఆశ్చర్యంగా.

"అవును నే నే!" అంది సోది మనిషి.

"అమ్మా—నువ్విప్పుడెక్కడున్నావు?" ఆత్రుతగా అడిగింది వకుళ.

"నే నెక్కడుంటే నేం? ఏం అడుగుతావో త్వరగా అడుగు—" అంది సోది మనిషి.

వకుళ మనసులో ఎన్నో ప్రశ్నలు ఒక్క సారి కదిలాయి. ఆమె ఆత్రుతగా—"అమ్మా! నేనిక్కడ అష్ట కష్టాలూ పడుతున్నాను. అందరూ నన్ను బాధలు పెడుతున్నారు. వాళ్ళందరిపైనా నేను పగతీర్చుకోవాలి. నాకు సాయపడ్డానికి నువ్వు తప్ప ఇంకెవరున్నారు?" అంది.

"నీకు నేను తప్పక సాయపడతాను. కానీ దేనికైనా సమయం కావాలి. కొంతకాలం ఓపికపట్టి ఎలాగో నీ కష్టాలు ఓర్చుకో—ఇంకా చెప్పాల్సిందేమైనా వుందా?" అంది సోది మనిషి.

ఇంకేం అడగాలో వకుళకు తెలియలేదు. ఆమె మౌనం

శపించింది. అలా కొద్ది నిముషాలు గడిచాక—"మీ అమ్మ వెళ్ళిపోయింది—" అంది సోది మనిషి.

"అయ్యో—మళ్ళీ పిలిస్తే రాదా?" అంది వకుళ ఆత్రతగా.

"రాదు. మళ్ళీ ఓ సంవత్సరందాకా రాదు-" అంది సోది మనిషి.

"సంవత్సరమే? అమ్మ బాబోయ్—అన్నాళ్ళెందుకు ఆగాలి?—" అంది వకుళ.

"ఆత్మల టైము వేరు. మనకో ఏడాది అయితే వాళ్ళకో రోజవుతుంది. రోజు కొక్కసారికి మించి ఆత్మలు మనుషుల్ని కలుసుకోవు—" అంది సోదిమనిషి.

"అయ్యో! ఇంకా నేను చాలా అడగాలనుకొన్నానే!" అంది వకుళ దిగులుగా.

సోదిమనిషి జాలిగా వకుళవంక చూసి—"నువ్వు మీ అమ్మను ఏమీ అడగలేదా?" అంది.

"ఏదో అడిగానులే—" అంది వకుళ నీరసంగా.

"నువ్వేమడిగావో మేమంతా విన్నాంలే—" అంటూ పక్కల్నించి ముగ్గురు పిల్లలు వచ్చారు.

వకుళ వాళ్ళవంక అదోలా చూసి—"నేనడిగింది మీరు విన్నారా?" అంది.

"విన్నాం—"

"అయితే అదింకెవ్వరికీ చెప్పకండి. చెప్పారంటే—మా అమ్మ నా దగ్గరకొచ్చినపుడు మిమ్మల్ని కూడా వేధించమంటాను—" అంది వకుళ.

పిల్లలామెవంక భయంగా చూశారు. ఆ క్షణంలో ఆమె వారికి దెయ్యంలా కనబడింది. వెంటనే అక్కణ్నించి పారిపోయారు వాళ్లు.

సోది మనిషి తను వెళ్ళిపోతూ—"వస్తా బుల్లెమ్మా! నీకు కష్టాలుంటె అవన్నీ పోవాలని—ముత్యాలమ్మకు మొక్కుకో. నీకు శుభమవుతుంది—" అంది.

సోది మనిషి వెళ్ళిపోయాక వకుళ ఒక్కర్తే ఇంట్లో కూర్చుని ఆలోచిస్తూ కూర్చుంది.

నిజంగానే తన తల్లి వచ్చి తనకు సాయపడుతుందా? వస్తే ఎప్పుడు?

ఇంకా కొంతకాలం ఆగాలని అమ్మ చెప్పింది. కొంత కాలం అంటే ఎంతో? మనుషులకు ఏడాది అయితే— ఆత్మలకు ఒక్క రోజు అవుతుందిట. అమ్మ తనకు సాయ పడ్డానికి యెన్నేళ్ళు పడుతుందో ఏమో?

అంత కాలం తను ఆగగలదా?

వకుళ పిడికిళ్ళు బిగుసుకొన్నాయి. తనలో కసి పేరుకు పోతోంది. పగ రగిలిపోయింది. అసహాయత తనలో ద్వేషాన్ని నింపుకొంది.

అమ్మ తనకు వచ్చి సాయపడితే ఏం చేయాలి?

తను పగ ఎలా తీర్చుకోవాలి?

అమ్మ అంటే అమ్మకాదు. అమ్మ చచ్చిపోయింది. అమ్మ మనిషికాదు. తనకు సాయపడితే ఆమె ఆత్మ సాయపడుతుంది. ఆత్మ అంటే ఒక మానవాతీత శక్తి. తనకో మానవాతీత శక్తి సాయపడితే అది చాలా అద్భుతంగా ఉంటుంది.

అప్పుడు....

ఇప్పుడు తనను పిన్ని హింసిస్తున్నకంటె ఎక్కువగా— వాళ్ళందర్నీ హింసించవచ్చు. మాయలతో, మంత్రాలతో బెదరగొట్టేయవచ్చు. తన్ను హింసించిన వారందరికీ నరకాన్ని సృష్టించవచ్చు.

ఆలోచనల తృప్తిలో కలిగిన తన్మయత్వానికి వకుళకు నిద్రపట్టింది. నిద్రలో ఆమెకు కల వచ్చింది. ఆ కలలో అమ్మ కనిపించింది. ఆమెకు అమ్మ దేవతలాకాక దెయ్యంలా భయంకరంగా కనపడింది. ఆ దెయ్యం వకుళకు సాయపడతానని చెప్పింది. వకుళ దెయ్యాన్ని చూసి ఏమాత్రమూ భయపడలేదు. తన కోరిక ఈడేరినందుకు యెంతగానో సంతోషించింది.

దెయ్యం వకుళకు మంత్రపు కొరడా ఒకటిచ్చింది. వకుళ కొరడా ఝుళిపించి పిన్నిని పిలిపించింది. వెంటనే శారద ఆమె యెదురుగా ప్రత్యక్షమైంది.

"వెళ్ళి దాన్ని హింసించు—" అంది వకుళ.

కొరడా గాలిలో యెగురుతూ వెళ్ళింది. ఆ దృశ్యం చూసే శారద భయపడి కేకపెట్టింది. ఈలోగా కొరడా ఆమెను చావబాదింది. శారద హృదయవిదారకంగా కేకలు పెడుతూంటే వకుళ వికటాట్టహాసం చేయసాగింది.

హఠాత్తుగా వకుళ కల చెదిరిపోయింది. యెవరో తలుపు తడుతున్నారు....

వకుళ కంగారుగా పరుగున వెళ్ళి తలుపు తీసింది.

తలుపు తెరవగానే శారద చూసుకువచ్చింది— "తలుపెంతసేపు తట్టాలే మాదనష్టపుదానా...." అంటూ ఆమె వాక్యాన్ని పూర్తి చేయలేదు.

వకుళ ఆమెకు మామూలు మనిషిలా కనబడలేదు. జుట్టు విరబోసుకొని వుంది. కళ్ళు యెర్రగా వున్నాయి. చూపులు మామూలుగా కాక భయంకరంగా వున్నాయి.

"ఏమయింది వకుళకు?" అనుకొంది శారద. పిల్లలిద్దరూ భయంగా తల్లిని కౌగలించుకొన్నారు.

"ఆయన బజార్లో ఆగిపోబట్టి బ్రతికిపోయావు. నిన్నీ వేషంలో చూశారంటే చితకదన్నేదురు. ముందు కాస్త ముఖం కడుక్కొని జడవేసుకో—" అంది శారద.

"అలాగే పిన్నీ!" అని బుద్ధిగా తల ఊపి అక్కణ్నించి వెళ్ళిపోయింది వకుళ.

# 3

అప్పుడు వకుళకు పద్నాలుగేళ్ళు.

ఇంట్లో ఆమె ఒక్కర్తె వుంది. మిగతా అందరూ బజారుకి పోయారు.

వకుళకు విశ్రాంతి దొరికేది ఇలాంటి సమయాల్లోనే! ఆమె హాల్లో కుర్చీలో కూర్చుంది. వెనక్కు జారగిలపడితే నిద్రపడుతుందేమోనన్న భయమామెకు. కూర్చుని ఆలోచిస్తూండగా—"భిక్షాం దేహి—మాతా—" అన్న మాటలు వినిపించాయి.

యెవరో సాధువు అయుంటాడని అనుకొంది వకుళ. ముందు మాట్లాడకొండా వూరుకొన్న ఆమెకు మళ్ళీ ఏదో ఆలోచన వచ్చింది. చటుక్కున వెళ్ళి తలుపు తీసింది.

"భిక్షాం దేహీ!" అన్నాడు అక్కడున్న సాధువు. వకుళ సాధువును పరీక్షగా చూసింది.

మనిషి పరిశుభ్రంగా లేడు. రంగు నలుపు. తైల సంస్కారంలేని జుట్టు. బారెడు గడ్డం. కాషాయ వస్త్రాలు. క్రూరమైన చూపులు.

ముఖ్యంగా సాధువు చూపులు వకుళకు నచ్చాయి.

"ఇంట్లో పెద్దవాళ్ళెవ్వరూలేరు—" అంది వకుళ.

"నాకు కావలసింది భిక్ష. పెద్దవాళ్ళు కాదు—" అన్నాడు సాధువు.

"మీకు భిక్షమేస్తే నాకేమిటి ప్రయోజనం?" అంది

వకుళ.

ఈ ప్రశ్నకు సాధువు ఆశ్చర్యపడి—"మనోవాంఛా ఫలసిద్ధిగస్తు!" అన్నాడు.

"అదంత సులభం కాదు—" అని నీరసంగా నవ్వింది వకుళ—"ఈ యింట్లో నేనిప్పుడివ్వగలిగింది—బియ్యం మాత్రమే! మీరెన్ని కావాలంటే అన్నీ యిస్తాను. నా కోరిక తీర్చండి—"

"ఏమిటి నీ కోరిక?" అన్నాడు సాధువు ఆశ్చర్యంగా.

"మీకు మాయలు, మంత్రాలు తెలుసా?" అనడిగింది వకుళ.

"తెలుసు—" అన్నాడు సాధువు నిశ్చలంగా.

"అవి నాకు నేర్పగలరా?"

"రెండు శేర్ల బియ్యం ఇస్తే రెండు మంత్రాలు నేర్పుతాను—" అన్నాడు సాధువు.

"మహా ప్రసాదం. తమరు లోపలకు రండి—" అంది వకుళ.

సాధువు లోపలకువచ్చి ఓ కుర్చీలో కూర్చున్నాడు. వకుళ ఇంట్లోకి వెళ్ళి రెండు శేర్ల బియ్యం తెచ్చి సాధువు జోలెలో పోసింది.

"నువ్వు నా పాదాల దగ్గర కూర్చో—" అన్నాడు సాధువు. వకుళ అలాగే చేసింది.

"ఇప్పుడు నీ అభీష్టం చెప్పు!" అన్నాడు సాధువు.

వకుళ క్లుప్తంగా తన కథను సాధువుకు చెప్పి—"నా జోలికి వచ్చిన ప్రతి ఒక్కరి మీదా నేను పగతీర్చుకోవాలి. అందుకు మీబోటివారే నాకేదైనా మంత్రం

చెప్పి సాయపడాలి!" అంది.

"అయితే నీకు నేను రెండు మంత్రాలు నేర్పుతాను. ఒక మంత్రం చదివితే నువ్వు కోరినంత సేపు అదృశ్యంగా ఉండగల్గుతావు. రెండో మంత్రం చదివితే ఎదుటివారిని నువ్వు కోరినవిధంగా హింసించవచ్చు—" అన్నాడు సాధువు.

"చెప్పండి—" అంది వకుళ ఆత్రుతగా.

"మంత్రాలు సులభమైనవే. వాటిని నువ్వు నిష్ఠగా పఠించడంలోనే ఉంటుంది మహిమ అంతా!" అన్నాడు సాధువు.

"ఏం చేయాలో చెప్పండి!" అంది వకుళ.

"దృశ్యం దృశ్యం అదృశ్యం మస్తం సమస్తం అదృశ్యం" అన్నాడు సాధువు. వకుళ కూడా ఆ మాటలు వల్లెవేశాక—"ఇది మొదటి మంత్రం!"

"ఈ మంత్రాన్ని మీరు పఠించారా?" అనడిగింది.

"ఆహా—" అన్నాడు సాధువు.

"అయితే మీరొక పర్యాయం అదృశ్యంకండి—చూస్తాను—" అంది వకుళ.

సాధువు మందహాసంచేసి—"బాలా—నువ్వు బేలవు. చూడుము మా శక్తి—" అంటూ ఒక్క నిమిషం కళ్ళు మూసుకొని—"దృశ్యం దృశ్యం అదృశ్యం—మస్తం సమస్తం అదృశ్యం—" అన్నాడు.

"మీరింకా నా కళ్ళకు కనబడుతూనే ఉన్నారు—" అంది వకుళ.

"సూటిగా నా కళ్ళలోకి చూడు—" అన్నాడు సాధువు. వకుళ సాధువు కళ్ళలోకి చూసింది. సాధువు ఆమె కళ్ళలోకి తీవ్రంగా చూస్తూ—"నువ్వలా చూస్తూనే

ఉండు. నేను మాయమైపోతాను చూడు.... చూడు. నేను మాయమైపోయాను. నీ కంటికి నేను కనపడుతున్నానా?" అన్నాడు.

"లేదు స్వామీ!" అంది వకుళ.

"అయితే శ్రద్ధగా చూడు. మళ్ళీ నేను ప్రత్యక్షమవుతున్నాను—" అన్నాడు సాధువు.

వకుళకు సాధువుపై నమ్మకం కుదిరింది—"రెండో మంత్రం కూడా త్వరగా చెప్పండి స్వామీ!" అందామె ఆత్రుతగా.

"భగభగ హారి భగభగ హారి హింస బేతాళోక హారి!" అన్నాడు సాధువు.

వకుళ ఈ మంత్రం కూడా కంఠస్థం చేసింది కానీ సాధువు శక్తి పరీక్షించాలని మాత్రం అనుకోలేదు.

"ఇప్పుడీ మంత్రాల్నెలా ఉపాసించాలో చెప్పండి!" అంది వకుళ.

"అదే కష్టమైన పని! అమావాశ్యనాడు ప్రారంభించి మొత్తం ఇరవైనాలుగు అమావాశ్యలు ఈ మంత్రాల్ని రాత్రి పడుకోబోయేముందూ, ఉదయం లేచేముందూ తడవకు పదకొండుసార్లు జపించాలి. ఇరవైనాలుగో అమావాశ్య దినం ముగియగానే—తొలి ప్రయోగం హితులపైనా, సన్నిహితులపైనా చేయాలి. అదీ అమావాశ్య దినానే చేయాలి. ఆ తర్వాత ఈ మంత్రాలు ఎప్పుడు ఎవరిముందు ప్రయోగించినా ఫలితాలనిస్తాయి—" అన్నాడు సాధువు.

వకుళ నిరుత్సాహంగా—"ఇరవైనాలుగు అమావాశ్యలంటే—రెండేళ్ళు ఆగాలన్నమాట!" అంది.

"తప్పదు. మానవాతీత శక్తులు సంపాదించడానికి

ఇంకా ఎక్కువే కష్టపడాలి. అసలీ మంత్రాలు తెలుసు కొనేందుకు నేను పది సంవత్సరాలు శ్రమించాను. నీకైతే రెండు శేర్ల బియ్యానికి ఒక్క క్షణంలో లభించాయి. ఎలాగైనా అదృష్టజాతకురాలివి—" అంటూ సాధువు లేచి వెళ్ళిపోయాడు.

సాధువును సాగనం పేటప్పుడు వీధి అరుగుమీద ఇద్దరు పిల్లల్ని చూసింది వకుళ. వాళ్ళవంక తీవ్రంగా చూస్తూ—"అంతా విన్నారా!" అంది.

వాళ్ళు పెద్దగా భయపడలేదు—"సాధువు నీకేవో మంత్రాలు చెప్పాడు. అవి మాకు వినబడలేదు. కానీ వాడు నీతో మాయమయ్యావని చెబితే నువ్వు కనపడలేదని అన్నావు. కానీ మాకిక్కణ్నించి బాగానే కనబడు తున్నాడు. అంతా కనికట్టులాగుంది—" అన్నాడు పిల్లల్లో ఒకడు.

"కనికట్టు అంటే ఏమిటి?" అంది వకుళ.

"ఏమో నాకూ తెలియదు...." అన్నాడు కుర్రాడు.

కుర్రాళ్ళు వెళ్ళిపోగానే వకుళ వీధి తలుపులువేసి తిరిగివచ్చి కుర్చీలో కూర్చుంది. తర్వాత ఏదో గుర్తుకు రాగా వెళ్ళి క్యాలండర్ తీసింది. అమావాస్య కోసం వెతికింది.

ఆ రోజుకు సరిగ్గా నాలుగురోజులుంది అమావాస్య. వకుళ ఆత్రుతగా లెక్కలువేసింది. ఉన్నట్టుండి ఆమెకో సందేహం వచ్చింది.

ఆమెకు క్యాలిండర్ చూడటం సరిగా రాదు. అమావాస్య క్యాలండర్లో ఇచ్చిన సమయానికి ముగు స్తుందా లేక ఆరంభమవుతుందా?

ఎందుకైనా మంచిదని వకుళ క్యాలెండర్ తీసుకొని

ఎదురింటికి వెళ్ళింది. ఆ యింట్లో కామేశ్వరమ్మ ఆప్యాయంగా వకుళను ఆహ్వానించింది.

"ఇందులో తిథులెలా చూడాలో చెప్పండి పిన్నిగారూ!" అంది వకుళ.

కామేశ్వరమ్మ నవ్వుతూ-"నీకొక్కటలసిన తిథి ఏమిటో చెప్పమ్మా!" అంది.

"అమావాశ్య—" అంది వకుళ అప్రయత్నంగా.

"అమావాశ్యా?" అని కామేశ్వరమ్మ ఉలిక్కిపడింది—"పిశాచాలకు పనికొచ్చే ఆ రోజు నీకెందుకమ్మా!"

"నాకు అమావాస్యే అచ్చొచ్చింది పిన్నీ!" అంది వకుళ తొణక్కుండా బెణక్కుండా.

కామేశ్వరమ్మ మరేమీ మాట్లాడకుండా—కాస్త ఇబ్బందిగా నవ్వి—క్యాలండర్ ఎలా చూడాలో వకుళకు చెప్పింది.

"బాగుంది. నేనింకా నాలుగురోజులుందనుకొన్నాను. మూడు రోజులేనన్నమాట!" అంది వకుళ ఉత్సాహంగా. ఆమె వెంటనే ఇంటికి పరుగెత్తింది.

## 4

అప్పుడు వకుళకు పదిహేనేళ్ళు. అయితే ఆ ఒక్క సంవత్సరంలోనే ఆమెలో చాలా మార్పులు వచ్చాయి. చూడ్డానికామె పదిహేనేళ్ళ పాపలాకాక పద్దెనిమిదేళ్ళ యువతిలా కనపడేది. శరీరంలో అన్ని అవయవాలు తీర్చిదిద్దినట్లుండేవి. ఆమె పదవతరగతి పరీక్షలురాసి ఫలితాలకోసం ఎదురు చూస్తోంది.

ఫలితాల గురించి వకుళకు బెంగలేదు. ప్యాసౌతానన్న ధైర్యముందామెకు. అందుకు చాలా కారణాలున్నాయి.

ఇంట్లో కష్టపడి చదివే అవకాశము న్నా లేకపోయినా బయట ఆమెకు సహకరించేవారు పెరిగారు.

వకుళ నిప్పుడు మేష్టరంతా సానుభూతితో అర్థం చేసుకొంటున్నారు. విద్యార్థుల్లో కూడా కొందరు యువకులామెకు సహకరించడానికి సిద్ధంగా ఉండేవారు.

అందుకు కారణం వకుళకు తెలుసు. క్లాసులోని ఆడపిల్లలందరిలోకీ తనే అందగత్తె! మిగతావారిలో ఎవర్ని చెప్పుకొన్నా తన తర్వాతనే చెప్పుకోవాలి. అదలా గుంచితే వకుళకు ఇంట్లో ఆదరణ లేదనీ, ఆమె చాలా కష్టాలుపడుతుందని చాలామందికి తెలుసు. ఈ కారణంగా వకుళపట్ల మోజు పెంచుకొన్నారు.

అసహాయురాలైన ఆడదాని దగ్గరేకదా—మగాడికి అవకాశం దొరికేది!

రూంలోకి పిలిచీ, ఒంటరిగా అవకాశం కల్పించుకోవాలనీ ఇద్దరు ముగ్గురు మేష్టర్లు వకుళ చెయ్యి పట్టుకోవటం జరిగింది. వకుళ వాళ్ళను అమాయకంగా ఏడ్చేసి బెదరగొట్టేసింది. ఆమె ఏడుపు చూడగానే చెయ్యి పట్టుకొన్న మేష్టరు కాళ్ళు పట్టుకొని ప్రతిమలాడి ఊరుకోబెట్టాడు.

మేష్టర్లను జయించడానికామెకా ఉపాయం సరిపోయింది.

క్లాసులో అయిదారుగురు మగపుర్రాళ్ళు ఆమెతో మాట్లాడాలని తహతహలాడిపోయేవారు. వకుళ వారితో ఎంతో స్నేహంగా ఉండేది. ఆమె అడిగిందే తడవుగా ఏమైనా చేసిపెట్టేవారు వాళ్ళు.

ఇలాంటి మాష్టర్లూ, విద్యార్థులూ ఉండగా వకుళ పరీక్షలు బాగా రాయకేంచేస్తుంది?

అయితే వీళ్ళ అభిమానం వకుళకు ప్రపంచంమీద, మనుష్యులమీద అభిమానాన్ని సృష్టించలేదు. వాళ్ళందరూ ఆమెకు శవం కోసం పొంచివున్న రాబందుల్లా కనబడే వారు. తననుంచి వారు కోరేదేమిటో ఆమెకు తెలుసు. వారి స్వార్ధబుద్ధికి ఆమెకు కలిగిన అసహ్యామింతా అంతా కాదు. కానీ తప్పనిసరి పరిస్థితుల్లో అదంతా భరించి ఎలాగో తనను తాను రక్షించుకోగలిగింది.

వకుళకు తనను తాను రక్షించుకోలేని పరిస్థితులుకూడా ఏర్పడ్డాయి.

నలుగురు కాలేజీ కుర్రాళ్లు కన్ను ఆమెమీద పడింది. వాళ్ళోసారి ఆమెను ఒంటరిగా కనిపెట్టి చేలలోకి ఎత్తుకుపోయారు. అక్కడ ఆమె ఎంతో కష్టపడింది. శాయశక్తులా వాళ్ళతో పోరాడింది. ఓటమి తప్పదనీ తను సర్వనాశనమై పోతున్నాననీ ఆమె గ్రహించిన క్షణంలో ఓ హీరో వచ్చి ఆమెను రక్షించాడు.

ఆ హీరో ఆమె ఎరుగనివాడు కాదు. వాళ్ళవీధిలో అబ్బాయే! అందంగా, ఎర్రగా, పొడుగ్గా ఉంటాడు. పేరు మధు.

మధు ఆ దుర్మార్గులతో పోరాడి ఆమెను రక్షించాడు. శారీరకంగా బలహీనులు కాకపోయినా—నైతికంగా బలహీనులు కావటంటల్ల నలుగురు కాలేజీ కుర్రాళ్ళూ మధు ముందు తలవంచి వెళ్ళక తప్పలేదు.

"ఇంటికి పిలిచి కాఫీ అయినా యిచ్చి సత్కరించలేని దాన్ని. మీ ఋణం ఎలా తీర్చుకో నేది?" అని బాధ పడింది వకుళ.

అయితే మధుకు ఆమెనుంచి కాఫీ ఎలా పుచ్చుకోవాలో తెలుసు.

ఓ రోజు అతనామె ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో ఆమె ఒంటరిగా వుంది.

అతన్ని చూసి ఆశ్చర్యపడి—"మీరా?" అనడిగింది.

"ఇవ్వాలనుకొంటే ఇప్పుడు కాఫీ ఇవ్వొచ్చు—" అన్నాడతను.

వకుళ అతడికి కాఫీ కలిపి ఇచ్చి—"ఘటికులే—బాకీ బాగా వసూలు చేసుకొన్నారు—" అంది.

"అంటే నా ఋణం తీరిపోయిందా?" అనడిగాడు మధు నీరసంగా.

వకుళ కంగారుగా—"నా ఉద్దేశ్యం అదికాదు—" అంది.

మధు మాత్రం సీరియస్‌గా—"మీ ఉద్దేశ్యమేమిటో కచ్చితంగా చెప్పండి. మీరు నాకు కాఫీ ఇవ్వాలన్నారు. అది వెంటనే వసూలు చేసుకొన్నాను. ఇంకా ఏవేమి ఇచ్చి ఋణవిముక్తులౌదామనుకొంటున్నారో నాకు చెప్పండి. బాకీ వసూళ్లలో నాకు నేనే సాటి!" అన్నాడు.

వకుళ నవ్వేసి—"మీరు చాలా చమత్కారంగా మాట్లాడతారు—" అంది.

మధు నవ్వి—"మిమ్మల్ని కలుసుకోవటమంత సులభం వేరేలేదు. వారానికి నాలుగు రోజులు మీరు యింట్లో గంటలతరబడి ఒంటరిగా ఉంటూనే ఉంటారు—" అన్నాడు.

వకుళ ఉలిక్కిపడి—"అన్నట్లు మీరు వీధి గుమ్మంలోంచే కదూ—వచ్చారు?" అనడిగింది.

"అవును—ఏం?" అన్నాడు మధు.

"ఇంకెప్పుడూ ఇలా మా యింటికి రాకండి—" అంది వకుళ.

మధు వెళ్ళిపోయాడు. వకుళ అతడి గురించి మరీ ఎక్కువ ఆలోచించలేదు.

కానీ వారంరోజుల తర్వాత అతను మళ్ళీ ఆమెను ఇంట్లో కలుసుకొన్నాడు.

"మీకేం చెప్పాను?" అంది వకుళ సీరియస్‌గా.

"మీరు చెప్పినట్లే విన్నాను. వీధి గుమ్మంలోంచి రాలేదు. దొడ్డిదారినవచ్చాను—" అన్నాడు మధు.

"అవును-అన్నట్లు వీధి తలుపులువేసి వున్నాయిగదా- మీరు ఇంట్లోకి ఎలా వచ్చారు?"అనడిగింది వకుళ ఆశ్చర్యపోతూ.

"మీ దొడ్డి గోడవరకూ ఒకలావచ్చాను. అక్కడ గోడ దూకాను—"

"ఎవరైనా చూశారా?" కంగారుగా అడిగింది వకుళ.

"ఎవరైనా చూస్తే గోడదూకినందుకు నన్నిలా వదుల్తారా?" అన్నాడు మధు నవ్వుతూ.

"ప్రమాదంకదా—ఎందుకిలా చేశారు?"

"మీకోసం ఎలాంటి ప్రమాదంలోనైనా తల దూర్చగలను—" అన్నాడు మధు.

"ఇంత కష్టపడి వచ్చి ఏం చేద్దామని?" అంది వకుళ.

"మిమ్మల్ని చూస్తే అదో ఆనందం. మీతో మాట్లాడుతూంటే అదింకో ఆనందం. మీ సమక్షంలో గడపగల్గుతున్నానన్న భావనే నాకానందం—" అన్నాడు మధు.

వకుళ ఆ మాటలకు ఎంతో ఆనందించింది. ఆమె మనసు విప్పి అతడితో మాట్లాడింది.

తర్వాత ఇద్దరూ ఒకరికొకరు సన్నిహితులయ్యారు. ఇంట్లో వకుళ ఒంటరిగా వున్నప్పుడల్లా ఎలాగో తెలుసుకొని మధు ఆమెను కలుసుకొనేందుకు వచ్చేవాడు. ఒంటరితనం

లభించినప్పుడల్లా మాగుకోసం ఎదురుచూసేది! అతడిమాట లా మెకు ఆహ్లాదకరంగా ఉండేవి.

ఒక రోజు మధు—"వకుళా—ఇలా ఎన్నాళ్ళు? మనం ఏదో ఒకటి చేయాలి?" అన్నాడు.

"ఏం చేయాలో నువ్వే చెప్పు—" అంది వకుళ.

"మనం పెళ్ళిచేసుకొందాం—" అన్నాడు మధు.

"మా నాన్నని అడిగిచూడు—" అంది వకుళ.

"అమ్మ బాబోయ్—" అన్నాడు మధు.

"పోనీ మీ నాన్ననడుగు. మీ యింట్లోవాళ్ళొప్పు కొంటే మా ఇంట్లోవాళ్ళొప్పుకోకపోయినా ఫరవాలేదు. నాకు నువ్వంటే యిష్టమే!" అంది వకుళ.

మధు చటుక్కున వకుళ చేయి పట్టుకొని—"ఇప్పుడూ ఇష్టమేనా?" అనడిగాడు.

వకుళ ఆ చేతిని విసిరికొట్టి—"ఇలా ప్రవర్తిస్తే చాలా అసహ్యం!" అంది.

మధు తెల్లబోయి ఆమె ముఖంవంక చూశాడు. ఆమె కళ్ళలో ఎక్కడా కాంతి కనబడలేదు—"నన్ను మన్నించు వకుళా! తొందరపడ్డాను. నీ అందం నన్ను పిచ్చివాణ్ని చేస్తోంది. ఆగలేకపోతున్నాను. మా ఇంట్లో నువ్వంటే ఇష్టమే—కానీ అప్పుడే నా పెళ్ళికి ఎవరూ ఇష్టపడరు. నా కుద్యోగం రావాలి...."

"ఉద్యోగంరానీ....తొందరేముంది?" అంది వకుళ.

మగవాడి తొందర ఎందుకో ఆడదానికి అర్థంకాదు. కానీ తొందరపాటు ఆడదానికెలాంటి దుష్పరిణామాల నిస్తుందో ప్రతి ఆడదానికీ తెలుస్తుంది. అందుకే మగాడు తొందరపడుతూంటే—ఆడది భయపడుతుంది.

"నాకేం తొందరలేదు. నిన్ను చూస్తేనే జాలిగా

వుంది. ఇంకా ఎన్నాళ్ళు సవతి దగ్గర కష్టాలు పడతావు? హాయిగా భర్త ఒడిలో సేదతీర్చుకోవలసిన నీవు....”

“ఆగు—” అంది వకుళ.

“నన్నాపకు వకుళా! ఇంతకాలం అందరికీ సేవలు చేసి బ్రతికావు నువ్వు. అందుకే నిన్ను నా అర్ధాంగిని చేసుకొని నీకే నేను సేవలు చేస్తూ మిగతా జీవితం గడపాలని అనుకొంటున్నాను—” అన్నాడు మధు.

“ఇప్పుడు నాకు పదిహేనేళ్ళు. పదహారేళ్ళు వచ్చేదాకా ఓపికపట్టు—” అంది వకుళ.

“ఎందుకని?”

“ఎందుకేమిటి? నాకో జీవితాశయముంది. ఇంకా ఓ ఏడాదిపాటు నిశ్శబ్దంగా ఉంటేనే అది నెరవేరుతుంది. ఇంతకాలం నన్ను బాధలు పెట్టిన వారందరిపైనా—పేరుపేరునా పగతీర్చుకొంటాను. సామాన్యంగా కాదు — అమానుష శక్తితో....” అంది వకుళ.

ఆ మాటలంటున్నపుడు మధు ఆమె ముఖంవంక చూశాడు. ఏదో అమానుషశక్తి ఆమెను ఆవహించినట్లే కనపడింది. మధుకు రవంత భయం కూడా వేసింది.

“నువ్వేమంటున్నావో నీకు తెలుసా వకుళా!” అన్నాడు మధు.

“అన్నీ నాకు తెలుసు మధూ! ఆఖరికి నీ గురించి కూడా తెలుసు. నేను మరీ అంత తెలివి తక్కువదానినని అనుకోకు. సవతి తల్లిదగ్గర నికృష్టంగా బ్రతుకుతున్న ఆడదాన్ని కాబట్టి నన్ను లొంగతీసుకోవటం సులభమని భావించావు. నలుగురు కాలేజ్ కుర్రాళ్ళను నామీదకు ఉసిగొల్పి—ఆపైన నన్ను హీరోలా రక్షించి—నా దృష్టిలో పడ్డావు. అప్పట్నించి ఎలాగో నన్ను మభ్య

పెట్టాలని చూస్తున్నావు. నీ ఎత్తుగడ నే నేనాడో గ్రహించాను—"

మధు ఆశ్చర్యపోతూ—"ఇదేమి అభియోగం వకుళా! నేను నిజంగానే నిన్ను రక్షించాను. అది బూటకంకాదు. నన్ను నమ్మ—" అన్నాడు.

"నేను నమ్మడం, నమ్మకపోవటంతో నీకు నిమిత్తమేముంది? నాకు నువ్వంటే యిష్టం ఏర్పడింది. ఆ యిష్టాన్ని నిలబెట్టుకోవటం నీ ప్రవర్తనలో ఉంటుంది-" అంది వకుళ.

"నీకు మనుషులమీద, మానవత్వంమీద నమ్మకం పోయింది. అందుకు నిన్ను తప్పుపట్టి లాభంలేదు. పరిస్థితులే నిన్ను అలా తయారుచేశాయ్—"అన్నాడు మధు.

## 5

ఇప్పుడు వకుళకు పదహారేళ్లు.

ఆమె ఆత్రుతగా ఆఖరి అమావాశ్యకోసం ఎదురు చూస్తోంది. అది సరిగ్గా నాలుగు రోజులుంది.

వకుళ ప్రాణాలన్నీ ఉగ్గబట్టుకొని ఆఖరు అమావాస్య కోసం ఎదురుచూస్తోందంటే అందుకు కారణముంది.

సరిగ్గా రెండు నెలల క్రితం జరగకూడనిది జరిగి పోయింది.

వకుళ తండ్రి ఆఫీసుకి వెళ్ళిపోయాడు. చెల్లెలు, తమ్ముడు స్కూళ్ళకు వెళ్ళిపోయారు! అప్పుడు శారద పెత్తనాలకు వెళ్ళింది—ఇల్లు వకుళకు అప్పజెప్పి!

వకుళ టెన్త్ క్లాసు ప్యాసయ్యాక చదువు మానేసింది. తండ్రి ఆమెకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు.

వకుళకెక్కడ మంచి సంబంధం వచ్చేస్తుందోనని శారద బెంగపెట్టుకొంది. వకుళ అందం ఆమెను అమి

తంగా కలవరపరుస్తోంది. వకుళ కోసం శారద ప్రత్యేక మైన సంబంధాలు చూస్తోంది.

శారదకు దూరపు వరుసలో కోదండం అనే తమ్ముడున్నాడు. వాడు పదహారోయేటే భోగందానింటికి వెళ్ళి వాళ్ళింట్లో చరిత్ర సృష్టించాడు. ఆ తర్వాతనుంచి వ్యసనాలపుట్ట అనే పదానికి మారు పేరుగా వ్యవహరించ బడుతున్నాడు. కోదండానికి పెళ్ళి కుదరటంలేదు. ఎదురు కట్నమిస్తానన్నా ఎవరూ పిల్లనివ్వనంటున్నారు. తల్లికి వాడొక్కడే కొడుకు కావటంతో—ఆ వంశం అంతటితో అంతరించిపోతుందేమోనని కోదండం తల్లి సూరమ్మ బెంగపెట్టుకొంది. ఒకటి రెండుసార్లు సూరమ్మ తన గోడు శారద దగ్గర కూడా చెప్పుకొంది—సవతి కూతుర్ని తన కొడుక్కి కట్టబెడుతుందేమోనన్న ఆశతో.

అయితే వకుళ గురించి శారద ఆలోచనలు వేరే వున్నాయి. ఎందుకూ పనికిరానివాణ్ని, బొత్తిగా చేత కానివాణ్ని వకుళకు కట్టబెట్టి ఇద్దర్నీ ఇంట్లో ఉంచుకొంటే చవగ్గా పనివాళ్ళు దొరికినట్లూ ఉంటుంది. వకుళ ఎక్కడో సుఖపడిపోతోందన్న బాధా ఉండదు. కోదండంలాంటివాణ్ని ఇంట్లో పెట్టుకొంటే ఇల్లు గుల్ల చేస్తాడు. అదీకాక తనకూ కూతురుంది. అసలే ఆ కోదండం బుద్ధులు మంచివి కావు....ఇలా ఆలోచించి శారద కోదండాన్ని వకుళకు భర్తగా లెక్కపెట్టలేదు.

శారద బైటకు వెళ్ళటం మధు యెప్పుడు గమనించాడో తన అడ్డదారి తను చూసుకొని ఇంట్లో ప్రవేశించాడు. వకుళ మధును చూసి ఆశ్చర్యపడింది. తర్వాత ఇద్దరూ కబుర్లు ప్రారంభించారు.

ఆ రోజు వకుళ అదృష్టం బాగోలేదు, వీధితలుపులు

గడివేయటం మరిచిందామె. బయటకు వెళ్ళిన శారద కొన్ని క్షణాల్లోనే వెనక్కి తిరిగివచ్చింది.

ప్రేమికుల జంట ఆమె కళ్ళబడ్డారు. శారదను చూస్తూనే మధు కంగారుపడి ఒక్క ఉదుటున గోడదూకి పారిపోయాడు. ఊహించని ఈ సంఘటనకు శారద ముందు స్తబ్దపడిపోయింది. కాసేపటికి తమాయించుకొని "యెన్నాళ్ళనుంచి జరుగుతోంది ఈ వ్యవహారం—" అనడిగింది.

వకుళ నిభాయించుకొని—"అతను నన్ను తాకనైనా తాకలేదు. నేనేమీ తప్పుచేయలేదు. అతను నన్ను పెళ్ళి చేసుకొంటానంటే మిమ్మల్నడగమని చెప్పాను—" అంది.

శారద వకుళ వంక చూసింది. ఆమె కళ్ళలో బెదురు లేదు. మనిషి వాటం చూస్తే మొండికేసినట్లుంది. దెబ్బలకు భయపడే స్థితి దాటిపోయినట్లు కనబడిందామెకు.

దీన్ని కొట్టిలాభం లేదు. తిట్టి లాభంలేదు. సరైన విధంగా దెబ్బతీయాలి—అనుకొంది శారద. అందుకేం చేయాలో ఆమెకు తెలుసు.

వకుళను ఓ గదిలో పెట్టి గొళ్ళెంవేసి అప్పటికప్పుడు ఆమె మధు ఇంటికి వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి మధు ఇంట్లోనే వున్నాడు. శారద అక్కడికలా వస్తుందని ఊహించలేదతను. వినయంగా లేచి నిలబడ్డాడు.

"మీ అమ్మగారున్నారా?"

తలూపాడు మధు.

"పిలు—" అంది శారద,

అతను లోపలకు వెళ్ళాడు. మధు తల్లి వచ్చింది.

"మీ అబ్బాయిని కూడా రమ్మనండి—" అంది

క్షురద.

తల్లీకొడుకు లిద్దరూ ఉండగా—"ఇదేం బాగుంది చెప్పండి—" అంది శారద.

"ఏం జరిగిందమ్మా—" అంది మధు తల్లి.

"మీ అబ్బాయి రహస్యంగా మా యింటికి వచ్చి మా వకుళతో మాట్లాడుతున్నాడు—"

ఉలిక్కిపడింది మధు తల్లి—"ఏరా—ఇది నిజమేనా?"

మధు కాసేపు గొణుక్కొని—"నేనలా పిట్టగోడదగ్గర తిరుగుతూంటే ఆ పిల్లే నన్ను రమ్మని పిలిచిందమ్మా—వెళ్ళటం తప్పేననుకో—కానీ ఆడపిల్ల అలా పిలిచేసరికి బుద్ధి అటు లాగింది—" అన్నాడు.

సరిగ్గా ఇలాంటి సమాధానం కోసమే శారద యెదురు చూస్తోంది—"తను పిలవలేదు, నువ్వే వచ్చావని మా అమ్మాయంటోంది. నువ్వేమో ఇలా అంటున్నావ్—యెవరిమాట నమ్మాలి!"

"ఆడపిల్ల పిలిస్తే తొందరపడ్డాడేమో గానీ—మా అబ్బాయి బుద్ధిమంతుడు—" అంటూ కొడుకును వెనకేసుకొచ్చింది మధు తల్లి. వకుళను వెనకేసురావడానికి ఆమెకు తల్లి లేదు.

"చూడమ్మా—మీ మాటలు నేను నమ్ముతాను. కానీ ఎంత ప్రేమగా చూసినా నేను సవతి తల్లి నిగదా-అందుకని మీ రీ మాటలు అనలేదనీ నేనే కల్పించాననీ అంటుందది. ఈ మాటలే ఒక్కసారి మీ యిద్దరూవచ్చి దాని ముఖంమీదనే అనేసి వెళ్ళిపోతే మీకు ఋణపడి వుంటాను. తర్వాత దానికి నేను బుద్ధి చెప్పుకొంటాను-" అంది శారద.

"అనడానికి మాకేం భయమా?" అంది మధు తల్లి.

వ్యవహారం ఇంత సులభంగా తేలిపోతే అంతకంటే కావలసిన దామె కేముంది? తల్లి కేం భయం లేకపోవడంతో మధూ భయాన్ని వదలక తప్పలేదు. అయినా మగాడు. అతని కేం భయం? భయమంటూపడితే ఆడది పడాలి— తప్పు చేసినా చేయకపోయినా!....

"నువ్వు పిలిస్తే నేకదా మావాడొచ్చాడు—దానికింత అల్లరిపెడతావా?" అంటూ మధు తల్లి వకుళను గద్దించింది.

"నువ్వూ అదే మాటంటున్నావా మధూ!" అంది వకుళ.

"నువ్వు పిలిస్తే రావటం నాది తప్పు. కానీ నీతో సలహా. నేను మంచివాణ్ని కాబట్టి సరిపోయింది. ఇంకెప్పుడూ అలా మగాళ్ళను పిలవకు—" అన్నాడు మధు.

వకుళ అదోలా నవ్వి—"ఎట్టి పరిస్థితిల్లోనూ నీ స్నేహాన్ని వదులుకోను. ఎందుకంటే నాకు అమానుష శక్తులు లభించినాక నా మొదటి ప్రయోగం నీపైనే కదా!" అంది.

ఆ మాటలు అక్కడున్న ముగ్గురికీ అర్థంకాలేదు. కానీ ఆ మాటలంటున్నప్పుడు వకుళ ముఖంలో అదొక రకమైన భావం కనబడింది. ఆ భావం అమానుషంగా కనబడింది.

మధు ఆ మాటలకు భయబడ్డాడు.

"ఏమిటే నీ పిచ్చిమాటలు!" అంది శారద.

"పిచ్చికాదు పిన్నీ పిశాచం—నన్ను పిశాచం ఆవహిస్తుంది. ఇంతకాలం మీరు మామూలు వకుళను చూశారు. అప్పుడు నా అసలు స్వరూపం చూస్తారు—"

అంటూ భయంకరంగా నవ్వింది.

ఆ నవ్వు నిజంగా పిశాచం నవ్వులాగానే వుంది.

సూను, మధు తల్లి అక్కణ్ణించి వెళ్ళిపోయారు. శారద భయం భయంగా వకుళవంక చూస్తూ—"పిచ్చి వేషాలు వెయ్యకు. వెళ్ళి పనులు చూడు. మీ నాన్నగారికి చెప్పావంటే నిన్నూ, నిన్ను పట్టిన పిశాచాన్ని కలిపి చావదంతారు—" అంది.

"అవును. నాన్న నన్ను తన్నడం కోసమేకదా—ఈ యింట్లో వున్నది—" అంటూ వకుళ పనులు చేయడానికి వెళ్ళింది. మధు వచ్చి అలా మాట్లాడినప్పుడు కలిగిన ఆవేశంలో తనేం మాట్లాడిందో .. ఆ తర్వాత ఆమెలో ధైర్యం మాయమై భయం ఆవహించింది.

ఆ రాత్రి జోగారావు కూతుర్ని—ఆడపిల్లని జాలి కూడా తలవకొండా కొట్టాడు. ముందు కాసేపు మౌనంగా భరించిందామె. అతడి ఆవేశం ఎప్పటికీ తగ్గకపోయేసరికి మధ్యలో భద్రకాళిలా—"జోగారావ్!" అని అరిచింది.

జోగారావు ఉలిక్కిపడి ఆమెవంక చూశాడు.

వకుళ తండ్రివంక క్రూరంగా చూస్తోంది.

జోగారావు కొట్టటం ఆపేశాడు. వకుళ ఆకారం చూడగానే అతడికి తను చేయి చేసుకొన్నది—ఎదిగిన ఓ కన్నెపిల్లపైన అని అర్థం అయింది. ఓ వయసొచ్చిక ఆడపిల్లమీద చేయిచేసుకోటం ఎంత అసహ్యం? మనసులో ఇప్పుడూహించుకొంటుంటే—ఆ దృశ్యం తండ్రి కూతుర్ని కొడుతున్నట్లులేదు. సినిమాలో రేప్ సీన్‌లా ఉంది.

జోగారావు ఒక్క ఉదుటున వెనక్కి వెళ్ళి తన గదిలోకిపోయి రెండు చెతుల్లోనూ ముఖం కప్పుకొని

ఏడ్వసాగాడు. శారద నెమ్మదిగా అతడి వెనక్కు వచ్చింది-
"ఎందుకండీ ఏడుస్తారు?"

జోగారావు మాట్లాడలేదు. అతడి ఏడ్పు ఆగలేదు.

"కన్న కూతుర్ని కొట్టాలని ఏ తండ్రికుంటుంది చెప్పండి—సవతి కూతురైనా నాదేమో పెంచిన ప్రేమ కానీ చూస్తూ చూస్తూ అది తప్పుదారిన పడుతూంటే వదిలేస్తామా చెప్పండి! అదేం తప్పుచేసినా అంతా నన్నే ఆడిపోసుకొంటారు. బాగా ఆలోచించాను. దానికి పెళ్ళి చేసేద్దాం—" అంది శారద.

అప్పటికి జోగారావు తేరుకొని—"దాన్ని పెళ్లెవడు చేసుకొంటాడే?" అన్నాడు—అక్కడికి వకుళకు పెళ్ళి కావటం చాలా కష్టమన్నట్లు.

శారద బుద్ధి చురుగ్గా పని చేస్తోంది. మధు వాటం చూస్తే వకుళను ప్రేమించినట్లే కనబడుతోంది. అయితే ఆ కుర్రాడికి పెద్దాళ్ల దగ్గర ఆ విషయం ఒప్పుకొనే గుండె ధైర్యం లేదు. అందువల్ల త్వరగా వకుళ పెళ్ళి జరపించేస్తే ఆ కుర్రాడి బాధ వుండదు.

అయితే అంత త్వరగా వకుళకు వరుడెక్కడ దొరుకుతాడు? అందులోనూ ఆడపిల్ల పెళ్లంటే బోలెడు ఖర్చుతో కూడిన వ్యవహారం....

వకుళ చూస్తే మొండికేస్తున్నట్లు కనబడుతోంది. ఉండుండీ ఉడుగుండీ అమానుష శక్తులంటుంది. పిశాచంలా నవ్వుతోంది—చూస్తుంది. ఈ రోజు తండ్రిని కూడా ఎదిరించింది. అది బరి తెగించిందంటే ఆపటం కష్టం.

వకుళను లొంగదీయాలంటే ఒక్కటే ఉపాయం—దానికి కోదండంతో ముడిపెట్టాలి!

కోదండం మహా క్రూరుడు. కోపంవస్తే తల్లినే కొడతాడు. పెళ్ళాం ఒక లెక్కా! అలాంటివాడి ఇల్లాలయిందంటే వకుళ మళ్ళీ పిశాచం గురించి మాట్లాడదు.

ఇలా ఆలోచించి కోదండాన్ని తన యింటికి రప్పించింది శారద. వకుళ కథచెప్పి—"దాన్నెలాగో మచ్చిక చేసుకొని ఒప్పించావంటే మీ ఇద్దరికీ పెళ్ళిజరిపించేస్తాను" అంది.

మగాడికి కావలసిన అన్ని హంగులూ పుష్కలంగా వున్న వకుళ కోదండానికి నచ్చింది. అతగాడు తన అదృష్టానికి అమితానందపడిపోయాడు. అక్క తనకై కల్పించిన ఏకాంతంలో వకుళ మనసును మార్చగొనడానికి అతడు ప్రయత్నాలు మొదలెట్టాడు.

వకుళ కోదండాన్ని అసహ్యించుకోనూలేదు. అభిమానించనూలేదు. అతడు తనకెంత దగ్గరగా రావాలనుకొంటే అంత దూరంగానూ మాత్రం వుండేది.

"నేను నీకు నచ్చలేదా?" అన్నాడు కోదండం ఒకసారి.

"నువ్వు నాకు నచ్చటం ఎందుకు?" అంది వకుళ.

"నేను నిన్ను పెళ్ళిచేసుకొంటాను—" అన్నాడు కోదండం.

"ఆడపిల్లను ఎవరైనా అడిగి పెళ్ళిచేసుకొంటారా? అందులో తల్లిలేనిదాన్ని!" అంది వకుళ.

పాషాణ హృదయుడైన కోదండాన్నే చలింపజేశాయా మాటలు—"నాది జాలిగుండె!" అన్నాడు వాడు.

"నీది జాలిగుండే అయితే మీ అక్కను చంపేయ్!" అంది వకుళ.

"ఏమన్నావ్? జాలిగుండె వాణ్ని హత్య చేయమంటున్నావా?" అన్నాడు కోదండం.

వకుళ నవ్వి—"ఈ ప్రపంచంలో జాలిగుండెకలవాళ్లే హత్యలు చేస్తారు. హంతకులవుతారు. పాషాణహృదయులే కళ్లెదుట ఎన్నో ఘోరాలు జరుగుతున్నా చూస్తూ ఉండిపోతారు—" అంది.

కోదండం ఆమెవంక ఆరాధనా పూర్వకంగా చూసి "నువ్వు చాలా తెలివైనదానివి—" అన్నాడు.

"సింహానికి మెదడుంటుంది. కానీ అది ఉపయోగించదు. లేడకి మెదడుంటుంది అది ఉపయోగిస్తుంది. ఉన్న తేడా అల్లా అవసరమొక్కటే!" అంది వకుళ.

"వకుళా—నువ్వు నన్ను పెళ్ళిచేసుకొంటావా?" అనడిగాడు కోదండం.

"చేసుకోనంటే వదిలిపెడతావా?" అంది వకుళ.

"వదలను—"

"అయితే ఆ ప్రశ్న నన్నడక్క—" అంది వకుళ.

"ఇక్కణ్నించి నిన్నేమీ అడగను. దేనికీ నీ అనుమతి తీసుకోను—" అంటూ కోదండం ఆమెను చటుక్కున నడుంపట్టి దగ్గరగా లాగి కౌగలించుకొన్నాడు.

ఒక్క తోపు తోసింది వకుళ. కోదండం వెల్లకిలా పడ్డాడు. అదృష్టవశాత్తు దెబ్బలేమీ తగల్లేదు.

"నన్ను నువ్వు ఆపలేవు-" అన్నాడతను లేవడానికి ప్రయత్నిస్తూ.

"నేనే నిన్ను ఆపను-కొన్నాళ్ళాగితే!" అంది వకుళ. ఆమె దృష్టిలో అమావాస్యలు మెదులుతున్నాయి. ఆ జపం అయ్యేవరకూ తను కలుషితం కాకూడదు.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

(ఈ శీర్షికలో ప్రచురితమయ్యే ప్రతిరచనకూ రూ. 5 పారితోషకం ఇవ్వబడును.)

## బురఖా!

ఇస్లామియా ఉమెన్స్ కాలేజ్ ముందు సైకిల్ ఆపి, స్టాండు వేశాడు సలీమ్. సైకిల్ ట్రబుల్ ఇస్తున్నట్టు కాసేపు పెడల్ తిప్పుతూ, బ్రేక్ చెక్ చేస్తూ, వీల్ ఆపేస్తూ అక్కడే నిల్చున్న అతన్ని రోడ్డుమీద పోతున్న వాళ్లెవ్వరూ పట్టించుకోవడంలేదు. అలా వారం రోజుల్నించీ అతని సైకిల్ అక్కడే ట్రబుల్ ఇస్తోంది!

చేతులు సైకిల్ అవయవాలని తడుముతోంటే, అతని కళ్ళు మాత్రం మాటి మాటికీ కాలేజ్ మెయిన్‌గేటును తడుముతున్నాయి. ఎట్టకేలకు ఐదు నిమిషాల ఆడటం తరవాత, కాలేజ్ విడిచిపెట్టారు. అమ్మాయిలు గుంపులు గుంపులుగా ఇవతలకి వస్తున్నారు.

అది ముస్లిమ్ ఉమెన్స్ కాలేజ్ గనక, అధిక శాతం యువతులు రకరకాల బురఖా ముసుగుల్లోనే ఉన్నారు. అందులో తనక్కావలసిన బురఖాకోసం అతని కళ్ళు చక చక వెతుకుతున్నాయి. ఎంతమందిలోనైనాసరే, ఆ బురఖా నతను అవలీలగా గుర్తుపట్టగలడు!

కాసేపటికి అతని ఫేవరెట్ బురఖా ఇవతలకి వచ్చింది. అక్కడే ఆగివున్న రిక్షా ఎక్కింది. ముందుకు సాగింది. అంతే! మరుక్షణం మన సలీమ్‌గారి సైకిల్ రిపేరయింది. ఎక్కి రిక్షా వెంటపడ్డాడు.

మధ్య మధ్య గంట మోగిస్తూ, కూనిరాగాలు తీస్తూ, ఈలలు వేస్తూ, జనసంచారంలేని ప్రదేశంలో కొత్త సినిమా పాటందుకొంటూ ఆ యువతిని ఆకర్షించడానికి నానా అవస్థలూ పడిపోతున్నాడు. ఒక్కొక్కసారి చేతులు వదిలి శరవేగంతో రిక్షా దాటుతూ, మళ్ళీ చటుక్కున వెనక్కి వస్తూ సైకిల్‌మీద కొంగ్రొత్త సర్కస్ ఫీట్లు ప్రదర్శిస్తున్నాడు.

అలా వారంరోజుల్నించి క్రమం తప్పకుండా సాగుతోంది అతని కార్యక్రమం! ఐనా, ఆ యువతి కనికరిస్తున్న సూచనలు కానరావడం లేదు. ఈ రోజు కాకుంటే రేపన్నా ప్రసన్నం కాకపోతుందా అని అతని నమ్మకం!

అంతలో ఆమె యిల్లు వచ్చేసింది. రిక్షా దిగి మెట్లెక్కుతూ చటుక్కున వెనుదిరిగి, మొహంమీది ముసుగు పైకి లేపింది. అంతే! అతని గుండె గుభిల్లుమంది!!

"చెల్లాయ్! నువ్వా!!...." అన్నాడు దిగ్భ్రాంతితో.

"ఔను! రోజూ నువ్విలా వెంటపడి వేధిస్తున్నావని నా స్నేహితురాలు నీ మీద ఫిర్యాదు జేస్తే నిజం తెలుసుకొందామని ఈ రోజు ఆ బురఖా వేసుకొని బైలుదేరాను. నీ నిర్వాకం కళ్ళారా చూశాను. ఇప్పుడే ఇంటికెళ్ళి నాన్నతో

చెప్పి నీ తోలు వొలిపిస్తాను చూడు!" అంది ఆమె బుసలు కొడుతూ.

—విద్వాన్ షీలాదేవి.

## నైట్ వాచర్

"ఏ వస్తువూ పోకుండా కాపలా బాగా కాస్తావనే నమ్మకంతో నీకీ ఉద్యోగం యిస్తే ఇలా చేస్తావా? రాత్రంతా బాగా పడుకున్నావన్న మాట!"

"లేదండి."

"ఏమిటి లేదు — మరి స్టోర్‌లో సామానంతా మేమైందీ?"

"అదే తెలీడం లేదండి."

"ఐతే నీవేం చేస్తున్నావ్?"

"రాత్రి బెంచీమీద కూర్చున్నానండి."

"ఆ బెంచి ఏదీ?"

"అదే తెలీడం లేదండీ. కూర్చున్నపుడు బెంచీమీదే కూర్చున్నాను. తరువాత చూసుకుంటే దిగువన ఉన్నాను. బెంచీ కన్పించడంలేదు, సామానూ కన్పించడంలేదు."

—ఎస్. రామారావు, జె. కే. పూర్ (ఒరిస్సా)

---

